# చక్రభ్రమణం

# CHAKRABHRAMANAM

చలన చిత్రంగా రూపొందించ
బడిన ప్రప్రథమ ఆధునిక తెలుగు
సాంఘిక నవల.

★

ఆంధ్రప్రభ శుభకృత్ ఉగాది నవలా పోటీలలో
ప్రథమ బహుమతిపొంది, సీరియల్‌గా
ప్రచురించబడ్డ ఉత్తమ నవల.

# చక్రభ్రమణం

రచన:

[illegible] కోడూరి కౌసల్యాదేవి




సర్వోదయ పబ్లిషర్సు
విజయవాడ-2

సర్వోదయ ప్రచురణ-1

ప్రథమ ముద్రణ
నవంబరు 1962

ద్వితీయ ముద్రణ
ఆగష్టు 1963

తృతీయ ముద్రణ
అక్టోబరు 1964

*



సాదా ప్రతి రు **5-00**
మేలు ప్రతి రు **6-00**

*

సంపాదకులు :
**'మిస్టర్ రావ్'**

ముద్రణ
'సోమేశ్వర ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ – 2.

# కృతజ్ఞత

చిన్న చిన్న కథలు, వ్యాసాలు వ్రాసినా నవల వ్రాయటమంటే ఏమిటో ఎరుగని నేను ప్రథమ ప్రయత్నమనికూడా వెరువక సాహసించి పోటీకి పంపిన 'చక్రభ్రమణం' నవలను ఆదరించి, మన్నించి నాలో ఉత్సాహం ఇనుమడింపజేసిన ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక సంపాదకులకు, గౌరవనీయులైన బహుమతి నిర్ణేత లకు నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

నాలో చెలరేగే కొన్ని భావాలు 'ఆకులుగా', అంత ర్లీనమైవున్న ఆదర్శాలు 'ఇరుసులు'గా ఊహాసంచయమే 'వలయంగా' ఏర్పడిన ఈ 'చక్రం' భ్రమణానికి ఉత్తమపథమైన ప్రభద్వారా వయోధికులు, విద్యాధికులు, జ్ఞానాధికులు, అనుభవ శాలురు అయిన అనేకులకు పరిచయంకాబడిన నేను ఆ అందరి ఆదరాభిమానాలను సదా నిలుపుకొనగలందులకు ప్రయత్నిస్తాను.

—రచయిత్రి.

# అంకితం



నా ఆరాధ్యదైవం

శ్రీ కళ్యాణ చక్రవర్తి

పాద పద్మాలకు

భక్తి శ్రద్ధలతో అర్పించిన ప్రథమ

నవలా పుష్పం.

—రచయిత్రి.

౧

"మాధవీ! ఓ మాధవీ లతాదేవి!" హడావుడిగా కేక పెడుతూ వచ్చాడు రవీంద్ర. "లే, లే! మాంచి పిక్చర్ విడుదలయింది. వెళ్దాం."

ప్రశాంతంగా మనోహరంగా ఉన్న వాతావరణంలో మాలతీ పందిరి క్రింద సిమెంటు బెంచీపై కూర్చుని వ్రాసుకుంటూన్న మాధవి వ్రాత ఆపు చేసింది. "తప్పదంటారా?" మొహం చిట్లిస్తూ అడిగింది.

"రాలేనంటావా?" అలాగే మొహం చిట్లించి కొంటెగా అడిగాడు రవి.

"మరేం లేదనుకోండి. ఈ కథ పంపడానికి ఆఖరి తేదీ ఎల్లుండే. పండగకు ప్రభలో కథలపోటీ. రేపు పోస్టు చేస్తేగాని ఎల్లుండికి చేరదు. 'ఫెయిర్' వ్రాయడం ఇంకా అవలేదు" అంది మాధవి నసుగుతూ.

"అమ్మ దొంగా! క్రొత్త కథ వ్రాశావేమిటి మళ్ళీని? నాకు చెప్పలేదేం? పేరు 'ఆరాధన' బాగుంది. ఉండు చదవనీ." కుర్చీ చేతిమీద ఆనీ ఆనకుండా కూర్చుని ఆత్రంగా చదివేస్తున్న రవీంద్రను చూస్తే నవ్వొచ్చింది మాధవికి.

"చదువుపురుగా సిలెండి తర్వాత, టైమైంది. లేవండి."
కాగితాలు సర్ది ప్రక్కనపెట్టి వెయిట్ వుంచుతూ లేచింది మాధవి.

"పోనీ బంవంతే మేమీలేదు మాధవీ. పిక్చర్‌కు మరో రోజు వెళ్ళచ్చు. పోటీ గడువు దాటిపోతే ఎలా? వ్రాసుకో."

"పర్వాలేదు, నడవండి. వచ్చి రాసుకుంటానుగా! నాకూ కొంత రిలీఫ్ కావాలి."

దారిలో రవీంద్ర అన్నాడు: "నే నేదో యధాలాపంగా అన్నంత మాత్రాన తప్పని సరిగా వచ్చితీరాల నెక్కడుంది మాధవీ? 'పోస్టల్ టైము'లోగా అందించగలమా రేపు?"

"పోనీండి. పోటీకి అందుకోలేకపోతే మామూలుగా అచ్చు అవుతుంది. ఆఫీసులో శ్రమపడివచ్చి పిక్చర్‌కు వెళ్దామనుకొన్న మీ కోరికకంటె ముఖ్యమా నా కా కథ?"

రవీంద్ర మాట్లాడలేదు. కొంతసేపాగి "ఏమి టాలో చిస్తున్నారు?" అంది మాధవి.

"ఏమీ లేదు కానీ, ఇంత చదివిన వాళ్లెవరైనా ఈ రోజుల్లో నీలా వుంటారంటావా?"

"నాలాగా? అంటే?" విస్తుపోతూ ప్రశ్నించింది మాధవి.

"పద పద, థియేటర్‌కి దగ్గరగా వచ్చేశాం. జాగ్రత్తగా నడువు. రద్దీగా వుంది" అని మాట మార్చేశాడు రవీంద్ర. హాల్లో కూర్చున్న తర్వాత మెల్లగా అంది మాధవి: "ఇందాక మీమాట నాకర్థం కాలేదు."

“అబ్బ మాటంటేమాత్రం వదలవుకదా......మన పెళ్ళికి ముందెంత గొడవ జరిగిందో నీ కెప్పుడూ చెప్పలేదు. బియ్యే ప్యాసైన కోడ లొస్తోందనగానే అమ్మ గజగజలాడి పోయింది. నాన్నగారెన్ని లెక్చర్లిచ్చారో చెప్పలేను. ఇక స్నేహితులు సరేసరి. చదువుకున్నవాళ్ళు వంట చెయ్యరనీ, కార్లు షికార్ల మీదున్న మోజు భర్తపై ఉంచరనీ, నాతో సమానంగా వుద్యోగానికి తయారౌతావని — ఒకటేమిటి? ఇవన్నీ విన్నాక నాకూ కొంచెం బెదురుపుట్టింది. కాని నీ సౌందర్యాన్ని మాత్రం వదులుకోలేక పోయాను.

“అందుకే మనపెళ్ళిజరిగింది. ఔనా?” పకపకా నవ్వింది. “ఔనులెండి. అలా మిడిసిపడేవాళ్ళూ ఉంటారు మరి. కాని విశేషమేమంటే ఆ మిడిసిపాటు అనేకమంది విద్యావిహీనల్లో కూడా వుంటుంది. అయినా అదెవ్వరూ గమనించరు. 'విద్య యొసగును వినయంబు' అనే సంగతి విస్మరించేస్తారు.”

“హు. విన్నంతగా శంకించామని చెప్పినా నీకు కోపం లేదు. నీది చాలా మెత్తని హృదయం మాధవీ.” ప్రేమతో ఆమె హస్తాన్ని మృదువుగా నొక్కాడు రవీంద్ర.

## ౨

కిటికీనుండి వీస్తూన్న చలిగాలి స్పర్శతో మెలకువ వచ్చింది రవీంద్రకు. శాలువా కప్పుకొని బద్ధకంగా ఒత్తిగిల్లాడు.

'ఏదీ మాధవి? బాత్ రూమ్‌లోకి వెళ్ళిందా? ఉహు. ఎక్కడా లైట్లు లేవే!' చేతినున్న రేడియమ్ డయల్ వాచ్‌లో

టైము చూస్తే పన్నెండున్నర! బద్ధకమంతా వదలిపోయింది. లేచి లైటువేసి, స్లిప్పర్లు తొడుక్కుని ఓరగా వేసివున్న తలుపులు త్రోసి ప్రక్కగదిలోనికి వెళ్ళాడు. అక్కడా లేదు. ఇటు ప్రక్కనున్న రీడింగ్ రూమ్‌లోనికి వెళ్ళాడు.

టేబుల్ లైటుదగ్గర కుర్చీలో కూర్చుని, బల్లమీద నున్న సగం వ్రాసిన కాగితాలపై తల ఆన్చి నిద్రపోతూంది మాధవి. పెన్ను ఎప్పుడో జారి క్రింద పడిపోయింది. రెండు కిటికీలనుండి వస్తూన్న చలిగాలి ఆమె ముంగురులను పలుకరిస్తూ పైట చెరగుతో సయ్యాట లాడుతూంది. కొద్దిసేపు రెప్పవాల్చకుండా నిద్రావస్థలో ఇనుమడించిన ఆమె సౌందర్యాన్ని తనివిదీరా చూస్తూ ఉండిపోయాడు రవీంద్ర. అంతలో అతడిలో ఒక కొంటె ఆలోచన రేగింది. సవ్వడికాకుండా వెళ్ళి డ్రాయింగ్ రూమ్ అల్మైరాలో వున్న, ఫ్లాష్‌బల్బ్ కెమేరా తెచ్చాడు. టేబుల్‌లైటు ఆఫ్‌చేసి, ఆకర్షణీయమైన భంగిమలో వున్న ఆ సౌందర్యాన్ని కెమేరా ఫిల్ముపై బంధించాడు. ఆ ఫ్లాష్ బల్బ్ కాంతి కానీ, కెమేరా క్లిక్ మన్న శబ్దంకానీ మాధవి నిద్రకు అంతరాయం కల్గించలేకపోయాయి. ఆమె నిశ్చింతగా నిద్రపోతూనే వుంది. నవ్వుకొన్నాడు రవీంద్ర. తట్టి లేపుదామనుకుంటూ ముందుకు వెళ్ళినవాడు ఏదో ఆలోచన రాగా ఆగిపోయాడు. 'పాపం! ప్రొద్దున్న లేచినది మొదలు ఏదో ఒక పనితో తీరిక లేకుండానే వుంటుంది. ఓ క్లబ్బుకు కానీ, షికారుకు కానీ వెళ్ళదు. సినిమాకైనా నేను తీసుకువెళ్తేనే వచ్చేది. ఇంట్లో ఒక్క దాసీమనిషి. మినహా నౌకర్లెవరూ

లేరు. కావాలనీ అనదు. కథలు బాగా వ్రాస్తుందని మెచ్చు కోవడమే కాని ఇవన్నీ ఎప్పుడు వ్రాస్తుంది? టైమేదీ? అనే ఆలోచనే లేకపోయింది నాకు! రేపు తప్పకుండా ఒక వంట మనిషిని ఏర్పాటు చేయాలి.' సడికాకుండా కాగితాలు, కలం తీసేసి దిండు తెచ్చి మెల్లగా మాధవి తలక్రింద చేర్చి, కిటికీ తెరలు వేసేసి లైటు తీసేశాడు.

ఉదయం తొమ్మిది గంటలకు మాధవి మేలుకొలుపు లతో బద్ధకంగా నిద్రలేచాడు రవీంద్ర. కాఫీ అందిస్తూ ఆమె కృతజ్ఞతా పూర్వకంగా నవ్వింది. అతడు భావయుక్తమైన చిరునవ్వు నవ్వాడు.

"నా కోసం అంత శ్రమపడ్డారా?" అంది మంచంమీద కూర్చుంటూ.

"నీకోసమేమిటి? నా మాధవికోసం; ఆమె కీర్తి ప్రతి ష్టల కోసం." కాఫీ త్రాగి గ్లాసు ఇచ్చేస్తూ అన్నాడు: "మాంచి నిద్రలో ఉన్నావు. లేపడం ఇష్టంలేకపోయింది. ఎవరు చేస్తేనేం? పని జరగటమే కావల్సింది. త్వరగా భోజనం సిద్ధం చెయ్యి. ఆఫీసు కెళ్ళేటప్పుడు పోస్టు చేసేస్తాను."

"నన్నంటారు కాని, మీలా భార్య నింత గౌరవంగా చూచేవారు మాత్రం వుంటారా, మనలో?" ప్రేమ చిందులు త్రొక్కింది మాధవి నేత్రాలలో.

నవ్వి ఊరుకున్నాడు రవీంద్ర.

మాధవి చేతినుంచి కవరు అందుకుంటూ అడిగాడు రవీంద్ర: "సాయంకాలం వచ్చేటప్పుడు తెచ్చేవేమైనా ఉన్నాయా?"

"ఏమున్నాయి? మీరు త్వరగా రండి" అంది నవ్వుతూ.

"సరే అయితే మంచి ప్రజంటు తీసుకొస్తాను. సిద్ధంగా వుండు. బీచ్‌కి వెళ్దాం."

సాయంకాలం బీచ్‌లో జనసమ్మర్దానికి దూరంగా కూర్చున్నారు మాధవీ రవీంద్రులు. చంద్రోదయం సమీపిస్తున్న దనే సంతోషంలో ఎగిరి పడుతున్నాయి సముద్ర కెరటాలు. ఆకాశంలో అక్కడక్కడ నీరులేని తెలిమబ్బులు అందంగా తేలిపోతున్నాయి. అస్తాద్రి అరుణరాగవల్లరైంది. సముద్ర తరంగాలనుంచి దృష్టి మెల్లగా భర్తవైపు త్రిప్పింది మాధవి. రవీంద్రకూడా ఆమెనే చూస్తున్నాడు.

"ఉదయంనుంచి వూరిస్తున్నారు ప్రజంట్, ప్రజంట్ అని. ఇహనైనా ఇవ్వకూడదూ, అదేమిటో? మరీ అంత మురిపెమా?" గోముగా అడిగింది మాధవి.

అందంగా నవ్వాడు రవీంద్ర. "అయితే చెప్పుకోలే వన్నమాటేనా? ఓడిపోయావా?"

"పూలు కాదు; పళ్లు కాదు; చీరలు కావు, నగలు కావు; మరేమిటబ్బా అది? బ్రతిమాలించుకోవడం సరదా మీకు." మాటి ముడుచు కూర్చుంది.

"అయితే చెప్తున్నాను. ఎప్పటికీ వాడిపోనిది. దేవ పారిజాతం తెచ్చాను. కావాలా?" కొంటెతనం పోతూ కళ్ళు చికిలించాడు.

మాధవికి ఉడుకుమోత్తసం వచ్చేసింది. "మీరేదో తమాషా చేస్తున్నారు. అసలు నే నీ పందెం కాయను."

"కాయాలి; కాచితీరాలి. సరే నువ్వోడిపోయావు. ఇదుగో. ఇదేమిటో చూడు." జేబునుంచి అరచేతిసైజు ఫోటోతీసి మాధవి చేతిలో ఉంచాడు రవీంద్ర. అందమైన యువతి 'సైడ్ పోజ్.' కుర్చీలో కూర్చుని ఎదుటి డ్రాయర్ మీద తలాన్చి నిద్రపోతూంది. పుష్ప మృదులతా. పసి అమాయకతా దోబూచులాడుతున్న ముఖం. తలలో పూల మాల బుజంమీదికి అందంగా జాలువారింది. చీరకుచ్చెళ్ళు నేలమీద జీరాడుతున్నాయి. పైటచెంగు గాలివేగాన్ని సూచిసూంది.

"ఎవ రీ అమ్మాయి ?" ముఖం చిట్లించింది మాధవి.

"ఏమో, నాకేల తెలుసు ? ఎవరమ్మాయ్ నువ్వు ?" కనుకొసల కొంటెతనం చిందిస్తూ అడిగాడు రవి.

"అయితే చెప్పరన్నమాట !"

"ఇంతకూ చెప్పాలో లేవన్నమాట ! చూసేవరకూ ఏమిటని గొడవ. చూశాక ఎవరని ప్రశ్న. బాగుంది. ఏమీ తెలియకపోతే ఎలా ?" గంభీరంగా అనబోయి నవ్వేశాడు రవీంద్ర. "ఎంత అసూయ, అంత అందమైన కళ్ళలో !"

"నాకేం అసూయలేదు" అంటూనే ఫక్కున నవ్వింది మాధవి. "నేనే నేమోనని అనుమానంగా వుందండి నాకు."

"అలాగా ! దేవతా స్త్రీయేమోనని అనుమానమేసి, అరుదుగా లభించే ఆ దేవి సౌందర్యాన్ని ఫోటోలో భద్ర పరిచాను" చిలిపిగా అన్నాడు రవి.

"రాత్రి రాస్తూ నిద్రపోయాను. అప్పుడుకదూ తీశారు?" సిగ్గుగా అడిగింది.

"ఊఁ! అలసి—అందులోనూ అంత అందంగా నిద్ర పోతూంటే లేపగలనా?"

"ఫోండి."

"అంటే 'రండి' అని అర్థంకదూ?"

రాత్రి భోజనం చేస్తూ అన్నాడు రవీంద్ర. "ప్రజంట్ చెప్పుకోలేక ఓడిపోయావ్. అదీగాక అడక్కుండానే నీ కథ నేను కాపీచేసి పెట్టాను. అందుచేత నువ్వు నాకోర్కె తీర్చాలి."

"నేను మీకోరిక తీర్చడమా? అంతటిదాననా?" విస్ఫారిత నేత్రాలతో ఆశ్చర్యం దోబూచులాడుతూంది.

"అడగమంటావా?"

"నా దగ్గ రేముంటాయి మీ రడగటానికి? – నేను మీ కోరిక తీర్చడానికీని!"

"ఇంత తెలివైనదానవూ అలా మాట్లాడతావేమిటి మాధవీ? కేవలం రూపాయణాలలోనే జీవన మధురిమ అంతా ఇమిడివుంటే ఈ జీవితాల కర్థమే లేదన్నమాట. ధనంవల్ల వచ్చేది దర్జా, సౌకర్యమూను. సుఖ సంతోషాలు మన మనోవృత్తుల ఫలితాలు" అంటూనే భోజనం ముగించి లేచి గదిలోకి వెళ్ళిపోయాడు.

తానూ భోజనంచేసి, ఇల్లు సర్ది తలుపులన్నీ వేసి వచ్చింది మాధవి. రవీంద్ర చదువుతున్న నవల మూసేసి లేచి, మాధవి సర్దిన ప్రక్కమీద కూర్చున్నాడు. అతడికి

వక్కపొడి భరిణె అందించి, "సంగతేమిటో చెప్పారుకాదు" అంది మాధవి మెల్లగా ప్రక్కపై వాలుతూ.

"చిన్నదే అనుకో - మా స్నేహితులం అంతా కలసి భార్యలతో సహా ఎల్లుండి పిక్నిక్ వెళ్ళే ఏర్పాటైంది. ఉదయం ఆరింటికి వెళ్ళి సాయంకాలం ఏడు, ఎనిమిదింటికి వచ్చేయవచ్చు. చక్రవర్తని మాకొక డాక్టర్ మిత్రుడు ఉన్నాడు. లక్షాధికారి పుత్రుడు. అతడికి చక్కటి పూలతోట ఉంది, ఇక్కడికి పది మైళ్ళ దూరంలో, అదే పిక్నిక్ ప్రదేశం".

చాలాసేపు మౌనంగా ఉండిపోయింది మాధవి. మెల్లగా అంది : "ఇదివరలో ఓసారి మీరిలాగే అడిగారు."

"అవును నువ్వప్పు డంగీకరించలేదు. మానేశాను. ఇప్పుడూ వాళ్ళంతా సిద్ధమే. మన విషయమే ఇంకా నేనెటూ తేల్చి చెప్పలేదు. నాకు తెలీకడుగుతాను మాధవీ - చదువూ సంస్కారమూ ఉన్న నువ్వు ఇటువంటివాటికి వెను కంజ వేయడమేమిటి ? టీ పార్టీలు, డిన్నర్ పార్టీలకు వెళ్ళినటు వంటిదేగా ఇదీని ! నా స్నేహితుల భార్యలెవరూ గొప్ప చదువుకున్నవాళ్ళు కాదు. పైగా పల్లెటూరివాళ్ళు కూడా. అయినా ఇటువంటి వాటికి ఎగిరి గంతేసి ఒప్పుకుంటారు. వాళ్ళకేలేని అభ్యంతరం నీకెందుకో నాకు బోధపడటంలేదు."

నీరసంగా నవ్వింది మాధవి. "విద్యావిహీనలు గనుక నే విచక్షణాజ్ఞానం లేక విర్రవీగుతారు. విజ్ఞానంకోసం చదువు కుంటాం గానీ, ఈ విదేశీయ లాంఛనాలను గ్రుడ్డిగా అనుక రించడం, అనర్థాలు కొని తెచ్చుకోవడమే. ఇటువంటి సమా వేశాలవల్ల అంతగా ఉపయోగమున్నట్లు నాకు తోచదు.

అయినా కాస్త తీరిక దొరికితే చదువుకోవాలనీ, వ్రాసుకోవాలనీ ఉంటుందేగాని ఏమిటో తిరగాలని ఉండదు నాకు."

"మన మనోనిగ్రహంపై మనకు నమ్మకముండగా అంత బెదురు దేనికి?" సూటిగా చూస్తూ ప్రశ్నించాడు రవీంద్ర.

"అందువల్ల మానసిక ఆరోగ్యం పాడవుతుందని నా అభిప్రాయం. పోనీండి, ఎందుకదంతా ? మీకంత వెళ్ళాలని కోర్కెగా ఉంటే నేను మూర్ఖంగా త్రోసిపుచ్చి మిమ్మల్ని నొప్పించలేను. తప్పక వెళ్దాం."

తృప్తిగా నిట్టూర్చాడు రవీంద్ర.

## 3

డాక్టర్ చక్రవర్తి పంపిన కారులో మాధవీ, రవీంద్రా వెళ్ళేసరికే అంతా తోటలో చేరిపోయారు. కారు ఆగగానే చక్రవర్తి ఎదురుగా వచ్చాడు.

"మాధవీ! ఈయనే నా స్నేహితుడు, డాక్టర్ చక్రవర్తి, గవర్నమెంట్ హాస్పిటల్‌లో పని మానేసి ప్రైవేట్ ప్రాక్టీస్ పెట్టారు" అని పరిచయం చేశాడు రవీంద్ర.

బలంగా, పొడుగ్గా, ఠీవిగా వున్న ఆ సుందర యువకుడు, 'చక్రవర్తి' పేరుకు తగివున్నాడనిపించింది మాధవికి. రెండు చేతులూ జోడించి నమస్కరించింది మర్యాదగా.

చిరునవ్వుతో ప్రతినమస్కారం చేశాడు డాక్టర్ చక్రవర్తి. "మీ కథలవల్ల యిదివరకే మీరు నాకు బాగా పరిచితులు. మిమ్మల్ని నేడు ప్రత్యక్షంగా చూడగలడం నా అదృష్టం."

మాధవి చిన్నగా నవ్వి ఊరుకుంది. సోదరులతోనూ, భర్తతోనూ, తప్ప మరొక యువకునితో అంత సన్నిహితంగా మాట్లాడడం ఆమెకు అదే ప్రథమం. బిడియపడుతూ నిల్చొంది, తోటను పరీక్షిస్తూ.

"రండి, తోటంతా చూద్దురుగాని. మనవాళ్ళంతా అటు ప్రక్కనున్నారు" అంటూ దారితీశాడు చక్రవర్తి.

"బాగా పెంచారు చక్రవర్తీ, ఈతోటని. మీకృషికి మెచ్చుకోవాలి" అన్నాడు రవీంద్ర.

"నాకు తగిన తోడు వుంటే యింకా అభివృద్ధి చేద్దును. దీనికయ్యే ఖర్చంతా దండగని నా భార్య బాధ. చదువు లేక పోవడంతో అభిరుచీ, సంస్కృతీ తక్కువవుతాయి. నువ్వదృష్ట వంతుడివి, గ్రాడ్యుయేట్ భార్య!" అన్నాడు చక్రవర్తి. ఆ మాటలకు రవీంద్రుడు ఎంత వుప్పొంగి పోయాడో మాధవికి అంత ఉక్రోషం మొచ్చింది; కాని ఏమంటుంది!

చక్రవర్తి రెండు తెల్లగులాబీలు బహూకరించాడు మాధవికి. మొదట తీసుకోవటానికి సంకోచించింది మాధవి. కాని, చక్రవర్తి మరీ దగ్గరగా తెచ్చిఇస్తే తీసుకోక తప్పింది కాదు. ఏమిటో ఇదంతా వచ్చి వెలగ గొంతు దిగక బాధ పెట్టినట్లుగా వుంది ఆమెకు.

అందమైన తామర కొలను. ఉదయభానుని బంగారు కిరణాలుసోకి అందంగా మిలమిలా మెరుస్తున్నాయి నీటి అలలు. ఎర్రని, తెల్లని తామరపద్మాలు, ముత్యాలు, పగడాలు విర జిమ్మినట్లు వింత సోయగాలు వెదజల్లుతున్నాయి. కొలను చుట్టూ రంగు రంగుల పూలతో రక రకాల మొక్కలు. పండ్లతో వున్న జామిచెట్టుపై పక్షులు కలకల స్వనాలు. ఆ సుందర ప్రకృతిని తిలకించుతూ మైమరచి నిల్చున్న మాధవి చక్రవర్తి మాటలతో జాగ్రదవస్థ పొందింది. తల త్రిప్పి చూడగా అక్కడ చప్టా నేలమీద అతి నాగరిక వేషంలో వున్న పదిపన్నెండుమంది స్త్రీలు కూర్చున్న దృశ్యం కంట బడింది. ఇద్దరు పూలమాలలు కడుతున్నారు, నలుగురు పేకాడు తున్నారు. మిలిగినవాళ్ళు కబుర్లు చెప్పుకుంటున్నారు.

"వీళ్ళందర్నీ పరిచయం చేద్దామంటే అంత పరాకుగా ఉన్నారేమిటి మీరు? కవయిత్రులుకదా! మాకంటికి ఆకు, అలం, పక్షి, జంతువుగా కన్పించేవన్నీ మీకు కావ్యవస్తువు లౌతాయి" అంటూ హాస్యం చేశాడు చక్రవర్తి. "ఈవిడ నాభార్య నిర్మల. ఆమె శ్రీమతి ఆనంద్. వీరు శ్రీమతి వనజా శర్మ..." అంటూ ఒక్కొక్కరినే పరిచయంచేసి, "వీరే మాధవి, బి. ఏ. రవీంద్రగారి భార్య, కథలు, పద్యాలు బాగా వ్రాస్తారు" అని చెప్పాడు చక్రవర్తి.

"అందరం ఈవిధంగా కలుసుకోవడం చాల సంతోషంగా వుంది నాకు. నేడు సుదినం" అంటూ వారికి నమస్కరించింది మాధవి. చక్రవర్తి భార్య మినహా మిగిలిన వారికి ప్రతినమస్కారం చేయాలనే జ్ఞానంకూడా లేకపోయింది.

సంస్కారశూన్యులైన వారి బాహ్యాలంకరణలోని నాగరకతకు లోలోన ఆశ్చర్యం పొందింది మాధవి. అందరూ బెల్లం కొట్టిన రాళ్ళకుమల్లే కళ్ళప్పగించి చూస్తూ, సిగ్గుపడుతూ నిల్చున్నారే కాని ఒక్కరూ మాధవిని పలుకరించలేదు.

"రండి కూర్చుందాం. మీరంతా వచ్చి చాలాసేపైం దనుకుంటాను" అంది మాధవి కూర్చుంటూ. అప్పటికీ ఎవరూ పలకలేదు. వాళ్ళలో వాళ్ళు కేరింతలు కొడుతూ మాట్లాడు కుంటున్న వాళ్ళు, తనను చూడగానే ఎందుకలాగై పోయారో మాధవికి అర్థం కాలేదు. దిక్కులు చూస్తూ కూర్చుంది. కొంత సేపటికి కాఫీవచ్చింది. దానితో వాతావరణంలోని స్తబ్ధత కొంచెం తగ్గింది.

"మీరు సాధారణంగా ఎక్కడా కన్పించరు. ఏం చేస్తూంటారు, నిత్యం ఇంట్లోకూచుని ?" అని అడిగింది నిర్మల, మాధవిని. మిగత ముఖాలుకూడ సమాధానం వినడానికి ఉబ లాట పడుతున్నట్లు కన్పించాయి. వారి యిందాకటి మౌనానికీ, ఈ ప్రశ్నకూ ఏదో సంబంధం ఉందనిపించింది మాధవికి.

"ఏముందీ ? అంతా చేసేపనే" అంది చిరునవ్వుతో.

"పిల్లలున్నారేమిటి ?" అని వనజ ప్రశ్న. ఆమె న్యాయ వాది శర్మ భార్య. పిల్లలనేవాళ్ళు కేవలం పెద్దవాళ్ళకు దుఃఖ కారకులనే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతూ తనకు పిల్లలులేని లోపాన్ని మరచిపోతుంటుం దావిడ.

మాధవికి ఆమె ప్రశ్నతో చాలా చికాకు కలిగింది. "అబ్బే లేరండి" అంది పైకి ప్రశాంతంగా.

"మరి ? ఆయన ఆఫీసుకు వదింటికిపోయి సాయంకాలం తిరిగి వచ్చే వరకు కాలక్షేప మెలా ? ఎంతగా రేడియో లవీ ఉన్నా—నాకు మాత్రం తోచదుబాబూ !"

మాధవి ఒక్క క్షణం ఆగి నెమ్మదిగా సమాధాన మిచ్చింది. "నాకు రేడియో వినటానికికూడా తీరిక ఉండదు. పని చేసుకుంటూనే వింటాను. వంటా, వడ్డనా, అంతా స్వయంగా చూచుకుంటేనేగాని నాకు తృప్తి వుండదు. ఏదో కొద్ది తీరిక లభించినా, పేపరు చూడ్డానికీ; చదువుకోడానికీ, వ్రాసుకోడానికీ సరిపోతుంది. అసలు వృస్నమైనే చాలకపోతే కాలక్షేపం కావాలనే సమస్యేమిటి నాకు ?"

వింటూన్న అందరూ కూడా ఆశ్చర్యంనుంచి తేరుకో లేక పోయారు. "ఇంతా విద్యా చదివిన ఈమెకు వంట చేసు కుంటూ యింట్లో కూర్చుంటాననడానికి సిగ్గు లేదూ ?" అన్పించింది లోలోన వారికి.

"వంటా వడ్డనలకు పుట్టామూ, మనం ? డబ్బు పారేస్తే బోలెడు మంది నౌకర్లు" అంది అతిశయంగా మరొకావిడ. ఆవిడ రామయ్య అనే ముసలి ఇంజనీరుగారి మూడవ భార్య ఇంటర్ ఫెయిలైందని వినికిడి.

"ఏమో, బాబూ, నామటుకు నాకు వంట అంటే పరమ చిరాకు. భోజనానికి తప్ప నేను ఆ ఛాయలకే పోను. ఎప్పుడూ రేడియోతోనే నాకాలక్షేపం. సాయంత్రం నాలుగయ్యేటప్పటికి క్లబుకెళ్ళిందే తోచదు. సినీమాలు సరేసరి. మీరింట్లో కూర్చో గలుగుతున్నారంటే నాకు చాల ఆశ్చర్యంగాఉంది" అంది నిర్మల.

"నేనూ అంతేబాబూ. ఆఖగాకు పిల్లల్ని కూడా ఆయూలకు అప్పజెప్పేస్తాను" అంది మరొకావిడ.

"అదృష్టవంతులు !" అంది మాధవి నిర్లిప్తంగా. అంతకంటె ఆ తరహా మనుషులతో తర్కం అవసరం లేదనిపించింది. సినిమా థియేటర్‌లో ఆ రోజు తనూ, భర్తా మాట్లాడుకున్న మాటలు గుర్తుకువచ్చి నవ్వొకుంది.

"మీారు మా లేడీస్ క్లబ్బులో జేరండి. రకరకాల ఆటలుంటాయి. ఏవో పుస్తకాలూ ఉంటాయి. బోలెడు కాలక్షేపం. అందరం కలుసుకుంటూండవచ్చు" అంది నిర్మల.

"థాంక్స్. ప్రయత్నిస్తాను" అంది మాధవి. 'క్లబ్ సంగతి నాకు నీవు చెప్పాలా ?' అనుకుంటూలోలోన.

చక్రవర్తి, రవీంద్ర, శర్మ మొదలైన పరివారమంతా దిగారు చదరంగం, పేకాట, రింగ్ వగైరా ఆటల సామగ్రితో. అందరూ అన్ని ఆటల్లోనూ సర్దుకుపోయారు. అందరూ అలా కలసిపోయి ఆడుతూంటే మాధవికేమీా బాగుండలేదు. రెండు పుస్తకాలు తీసుకొని దూరంగా ఒక చెట్టుక్రింద చదువుకుంటూ కూర్చుంది. చక్రవర్తి దంపతులతో పేకాట ఆడుతున్న రవీంద్ర, భార్యను తీక్షణంగా చూడడం మాత్రం ఎవరూ గమనించ లేదు. మాధవి చూచీ చూడనట్లు ఊరుకుంది.

ఓగంట ఆడాక పేకముక్కలు గిరవాటేసేసి రవీంద్ర లేచి, "నేను భోజనా లేర్పాటుచేస్తా" నంటూ తోటలో ఉన్న షెడ్‌లోకి వెళ్ళాడు. నిర్మల మరో ఆటలో సర్దుకుంది. చక్రవర్తి మెల్లగా మాధవి దగ్గరికొచ్చి కూర్చున్నాడు.

"ఇన్ని ఆటల్లో యేఒక్కటీ మీ కిష్టంలేదా?" అన్నాడు నవ్వుతూ.

"ఇష్టంలేక కాదనుకోండి. నవల చాల ఇంటరెస్టింగ్‌గా ఉంది" అంది మాధవి.

"అది డుమారియల్ 'రెబెకా' కదూ! ఇంతవరకు చదవలేదా మీరు?"

"పెన కొకసారి చదివాను. ఆ మధ్య రెబెకా పిక్చర్ కూడా వచ్చింది కదూ—చూశాను ఇప్పుడు మళ్ళీ శ్రద్ధగా చదవాలనీ—"

"కథ పొడవునా 'సస్పెన్స్' కాపాడడంలో మీకూ, మారియర్‌కూ చాలా పోలిక వుంది. మంచి నాయికా నాయకు లను సృష్టించడంలో మీకు గొప్ప నేర్పు వుంది."

"థాంక్స్. కాని మీ అభిమాన మల్లా అన్పిస్తుంది" అంది మాధవి చిరునవ్వుతో.

చక్రవర్తి మళ్ళీ ఉత్సాహంగా ఏదో చెప్పబోయాడు. "మీ కథల్లో..." అత డింకా చెబుతూండగానే మాధవి అడ్డు తగిలింది. ఆమె కసలే ఆ వాతావరణం జుగుప్సాకరంగా ఉంది. ఈ సంభాషణ మరీ చీకాకు కలిగించింది. "చూడండి, చక్రవర్తిగారూ, ఏదో వ్రాస్తాను కానీ నాకు వాటిని గురించి అంతగా చర్చించడం ఇష్టం ఉండదు. అదీకాక మనం ఈరోజు అన్నీ విడిచి ప్రశాంతంగా గడుపుదామని కదా ఇక్కడికి వచ్చాం! ఇక్కడకూడా నా కథలను నేనూ, మీ పేమంట్లను మీరూ మననం చేసుకుంటూ కూర్చుంటే యేం లాభం?"

ఛెళ్ళున చెప్పిన ఆ జవాబుకు చక్రవర్తి ఒక్కక్షణం నిశ్చేష్టు డయ్యాడు. మొగంలో నవ్వు మాయమైపోయింది. "ఎక్స్క్యూజ్ మీ. ఐ యామ్ వెరీసారీ" అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

భోజనాలయ్యాయి. "పాటలు వచ్చిన వాళ్ళు కాస్త విన్పిస్తే సంతోషిస్తాం" అంటూ అభ్యర్థించాడు శర్మ. దానితో కలకలం రేగింది. ప్రతి ఒక్కరూ మరొకర్ని "మీకొచ్చా ?" అనడిగేవారే. మూర్తి అనే కాలేజీ లెక్చరర్ కడకు ఒక ఎంకి పాట, ఒక భజనగీతం పాడినాడు.

"ఇంకెవ్వరికీ రానట్టేనా ? అవమానం ! కళల తల్లి సరస్వతీ దేవి స్త్రీ అవ్వడమేమిటి? ఇందరు స్త్రీలలో ఒక్కరికైనా సంగీతం రాక పోవడమేమిటి ?" శర్మ మాటలకు మగ వాళ్ళంతా నవ్వారు. ఆడవాళ్ళు కొంచెం సిగ్గుపడ్డారు.

"ఎంతమాటన్నావ్! అయితే కాచుకో శర్మా?" భుజా లెగరేశాడు రవీంద్ర. మాధవివైపు తిరుగుతూ, "మాధవీ, మొదలెట్టు. వీళ్ళ చెవులతుప్పంతా వదిలించెయ్యి" అన్నాడు.

"ఓ సారీ!" హాస్యంగా లెంపలేసుకున్న శర్మను చూచి మళ్ళీ అంతా నవ్వారు.

"ఏం మాధవీ ? ఏవిటింకా ఆలస్యం ?" అన్నాడు తిరిగి రవీంద్ర.

"పాడండీ" అంది నిర్మల.

"నాకంత బాగా రాదండీ. అయినా అందరిలో పాడే అలవాటు లేదండీ" అంది మాధవి ముఖం యిబ్బందిగా పెట్టి.

"అంతా మనమేగదండీ. పరాయి వాళ్ళేవరు ? పాడక తప్పదు" అన్నాడు శర్మ.

'అంతకూ నువ్వే కారణ' మన్నట్లు కోపంగా చూచింది మాధవి, భర్తను.

"నాకేం ? నీకు పాటవచ్చున్న సంగతి అందరికి చెప్పే శాను. ఇక నువ్వు పాడితేనేగాని వాళ్ళొదిలిపెట్టరు. అట్టే బ్రతిమాలించుకోక పాడేసెయ్యి" రవీంద్ర కొంటెతనానికి మరీ కోపం వచ్చింది మాధవికి.

అంతవరకూ మౌనంగా ఉన్న చక్రవర్తి కలుగ జేసు కున్నాడు. "పోనివ్వండి. బలవంతం దేనికి ? కొందరన్నిసమ యాల్లోనూ పాడలేరు" అంటూ మాధవిని చూచి, "కాని పాడటానికి ప్రయత్నించండి మాధవిగారూ, లేకపోతే వీళ్ళంతా నాకోసమేడుస్తారు" అన్నాడు.

మాధవికి నవ్వొచ్చింది. ఇక పాడకపోతే బాగుండదని పించింది. ఇష్టంలేకపోయినా తప్పని సరిగా మొదలెట్టింది. జయదేవుని అష్టపది ఒకటి అందుకొంది. 'యామి హేసఖి మిహా శరణం' అని మృదు మధురంగా పాడుతుంటే ఏ మాత్రం సంగీత జ్ఞానంలేని వాళ్లు కూడా కళ్లు మూసుకు తన్మయులై పోయారు. పాటముగించి మాధవి తలయెత్తేసరికి అందరూ మౌనంగా విస్ఫారిత నేత్రాలతో ఆమెనే చూస్తున్నారు. ఆ నేత్రాలలోనే వారి ప్రశంసలూ దాగి ఉన్నాయి.

"రవీంద్ర సవాల్ చేస్తే యేమో అనుకున్నాను కానీ నిజంగా చెవుల్తుప్పు వదలిపోయింది. తేనెలో స్నానం చేసి నట్టుంది" అన్నాడు చక్రవర్తి మందస్వరంతో.

"నయం! తేనెటీగలు కుట్టినట్టులేదు" అంది నిర్మల నవ్వుతూ. అంతా నవ్వారు కాని అందులో అర్థమేమిటో ఎవరికీ బోధ పడలేదు.

"మా కాలేజి మొత్తంమీద ఒక్కళ్లు లేరు, ఇలా పాడగలవారు" అన్నాడు మూర్తి.

"ఇన్ని చెప్పిన నేనే అడుగుతున్నా నీసారి. 'మధురా నగరిలో' పాడగలరా?" సంకోచిస్తూ అడిగాడు చక్రవర్తి.

సమాధానం రవీంద్రనుంచి వచ్చింది. "ఓ. దివ్యంగా, అది నాకు చాలా యిష్టం. ఎటొచ్చీ ఆవిడకు మనమీద దయ గలగాలంతే."

మాధవి ఒక్కసారి చురుగ్గా చూచింది రవీంద్రను. వెంటనే ఆనందభైరవిలో కృతి అందుకుంది. 'రాజమార్గమిది కృష్ణా' అని మాధవి పాడుతూంటే, సన్నని గంట మ్రోగుతున్నట్లున్న ఆ కంఠంలోనే ఆచరణం మధురత్వం సిద్ధించుకొందనిపించింది శ్రోతలకు. కృతి ముగించుతూనే, "మరి బలవంతం చేయకండి" అంది మాధవి బ్రతిమాలుతున్నట్లు.

"సరేలెండి. కాని మరీ మరీ వినాలన్పించే గాత్రం మీది. ఇలాంటి తోటలో, ఈనేత్ర పర్వంగావున్న పూల తీగెల మధ్య, వీనుల విందుచేసే మీ గానంవంటి గానం వింటూంటే మరి జీవితమక్కర్లేదనిపిస్తుంది."

"మీబోటి బైరాగులకు". అంటూ పూర్తిచేసింది నిర్మల, భర్తమాటను.

"అయితే మీవారు బైరాగా?" అంటూ వనజ హేళన చేసింది నిర్మలను.

అందరూ లేచి పూల మొక్కలను పరామర్శించారు కాసేపు. కొందరు సరదాగా చెర్లోదిగి కాళ్ళూ, చేతులూ కడుక్కున్నారు. కాఫీలైన తర్వాత కొంతసేపు సరదాగా కబుర్లతో కాలక్షేపం చేశారు. మాధవి మాత్రం రాధా మనోహరపు పందిరి క్రింది కూర్చొనే ఉంది, ఎటూకదలకుండా. క్రమంగా సాయంత్రం అయిదు అయింది. సంధ్యా వీచికలు బయల్దేరాయి. భాస్కరునికి వీడ్కోలిస్తూన్న ప్రకృతి కన్య చెక్కిళ్లు సిగ్గుతో అరుణ రాగరంజిత మయ్యాయి. పగలంతా ఎక్కడో తిరిగిన పక్షులు నివాసాలు జేరుకొంటున్నాయి కల కల నాదాలతో.

చక్రవర్తి కారులోనే అందరినీ ఇండ్లకు పంపించాడు. ఆఖరి ట్రిప్‌లో చక్రవర్తి, నిర్మలా, మాధవీ, రవీంద్రా బయల్దేరారు. కారు దిగి, రవీంద్ర 'గుడ్‌నైట్' చెప్పాడు. మాధవి మర్యాదకు నిర్మలను ఎప్పుడైనా తమ యింటికి వస్తూండమని ఆహ్వానించింది. ఆ పిలుపుకు చక్రవర్తి సమాధానమిచ్చాడు. "వేరే పిలవాలా ? ఇహ మన కుటుంబాల మధ్య స్నేహం పెరగాలి. గుడ్‌నైట్" అంటూనే కారు స్టార్టు చేశాడు.

౪

కాళ్ళూ, చేతులూ కడుక్కుని సాయంకాలం వంట ప్రయత్నంలో నిమగ్నమైంది మాధవి. కాసేపటికి రవీంద్రకూడ దుస్తులు మార్చుకువచ్చి కూర్చున్నాడు.

"పెద్ద చదువుసంధ్యలు లేకపోయినా 'సోషల్ బిహేవియర్' తెలిసినవాళ్ళు వాళ్ళందరూను" అన్నాడు ఉపోద్ఘాతంగా.

ఒక్కసారి తలెత్తిచూచి తిరిగి తన పనిలో నిమగ్నమైనది మాధవి. జవాబు రాకపోవటంతో మళ్ళీ రెట్టించాడు రవీంద్ర. "ఒక ఆటలోకాని, మాటలోకాని ఎవరితోనూ కలియకుండా మడిగట్టు కుర్చున్నట్టు కూర్చోవడం నాకేం బాగులేదు. అది అతిశయమో, బిడియమో తేల్చుకోలేకుండా ఉన్నాను. అందులోనూ చక్రవర్తి 'ఫారిన్ రిటర్న్డ్'; చాల 'ఫార్వర్డ్‌గా' ఉంటాడు. అతడిముందు నీ ప్రవర్తనతో నాకు తల కొట్టేసినట్లుంది."

కూరలు తరగడం ఆపుజేసి రవీంద్రవైపు దృష్టిత్రిప్పింది మాధవి. "మీరు చాల మారిపోయారు, ఈ ఒక్కరోజులోను. కాని అటువంటి మనుష్యులతో ప్రయత్న పూర్వకంగా కలసిపోదామన్నా నాకు చేతకాదు. అది నాలో బలహీనతని మీకు తెలుసు. నేను చదువుకొనే రోజుల్లోకూడ అటువంటి వాటికి దూరంగా ఉండేదాన్ని. నేను పెరిగిన వాతావరణమే అటువంటిది. ఈ పాతిక సంవత్సరాల జీవితంలోనూ లేనిది, ఇహ భవిష్యత్తులో ఆమార్పు రాగలదని నే ననుకోను".

"బాగుంది. ఎల్లకాలం ఒకలాగే ఉంటామా? మన చుట్టూ నాగరికతకు అనుగుణంగా కొంచెం మారాలి."

"చూడండీ, మన వివాహమైన ఈ రెండు సంవత్సరాల కాలంలోనూ మన మధ్య చిన్న కలహమైనా లేదు. ఇప్పుడిటువంటి అనవసర విషయం, అందులోనూ ఇతరుల గురించి

మన మధ్య పట్టింపులు, కలహాలు రావడం నా కిష్టంలేదు." ఆ మాటల్లో స్థిర గాంభీర్యానికి ఆశ్చర్యపోయాడు రవీంద్ర. కొంచెం మెత్తబడ్డాడు కూడాను. "అవును, మాధవీ. మనకు మనస్పర్ధలు వద్దు. ఏదో కొంచెం ఆవేశపడ్డాను. ఏమీ అను కోకు, కాని నే ననే దేమంటే–"

"తెలుసు. మర్యాదకోసమైనా ఒక్క–నాలుగు గంటల కాలం నలుగురితోనూ కలిసిపోకూడదా – అని. కాని మన మంత పట్టించకోవలసినంత మర్యాద తెలిసిన వాళ్ళెవ్వరూ లే రక్కడ. నమస్కారానికి ప్రతినమస్కారం చేయాలనే జ్ఞానంకూడా లేనివాళ్ళు. పైపై అలంకరణలు మాత్రం తెలుసు. మరి ఇంతటి ఘార్వర్డుగా ఉండే భర్తలూ వాళ్ళు ట్లా 'బ్రూట్స్' మాదిరిగా ఎందుకుంచారో!"

"ఎవరు? ఆ వన్నెల విసనకర్రలేనా బ్రూట్స్?" ఆశ్చర్యంగా అడిగాడు రవీంద్ర.

"వన్నెల విసనకర్రలు కాదు. సీతాకోక చిలుకలనండి. ఉపమానం అన్నివిధాల సరిపోతుంది. గొంగళిపురుగుకు అందమైన రెక్కలుండగానే విలువ ఎలా వస్తుంది?"

తేలికగా నవ్వేశాడు రవి. "నిజమే, మాధవీ. ఇహ ఈ అనవసర విషయాన్ని వదిలేద్దాం. అయినా నువ్వు ముందే చెప్పావుగా, ఇటువంటి సంఘటనలవల్ల మనోనైర్మల్యం చెడు తుందని? తెలిసి పొరపాటుగా ప్రవర్తించాను. మరచిపో, మాధవీ."

క్లబ్బుకు వెళ్ళడానికి తయారై మేడ దిగబోతున్న నిర్మలకు భర్త ఎదురువడ్డాడు.

"ఎక్కడికో వెళ్ళిపోతున్నట్టున్నావ్. నే చెప్పిన సంగతి మరిచిపోయావా నిర్మలా!" అంటూ గదిలోకి పోయి దుస్తులు మార్చుకుంటున్నాడు చక్రవర్తి. విసుక్కుంటూ భర్త వెనకనే గదిలోకి వెళ్ళి కుర్చీలో కూర్చుంది నిర్మల "ఆ రవీంద్ర ఇంటికి వెళ్దామనేనా? చెప్పానుగా నేను రానని?"

"వాళ్ళ నొక్కసారి చూచావో లేదో, గర్భశత్రుత్వ మున్నట్లు మాట్లాడతావేమిటి? ఎందు కిష్టంలేదు!"

"అయిందిగా మర్యాద తోటలో? మహా నేనమ్మాకై చదువుకున్న దానను, సంగీత మొచ్చిన దానను అన్నట్లు బింకంగా ఎవరితోనూ మాట్లాడకుండా కూర్చుంటే వెతుక్కుంటూ ఆవిడింటికి వెళ్ళడంకూడా దేనికి?"

నవ్వాడు చక్రవర్తి. "మరీ తేలికగా అభిప్రాయా లేర్ప రచుకొంటావు. ఆవిడది అతిగా మాట్లాడే స్వభావం కాదేమో? పోనీ, మన కేం? రవీంద్ర కలిసి మెలిసి లేడూ? అలాగే రెండు సార్లు మాట్లాడితే ఆ ఎడతో కూడా చనువేర్పడుతుంది. మనలాగే ఉంటుంది."

"ఇంతకూ ఆవిడేమైనా దేవుడా, దేవతా, అంత ప్రయత్నించి ఆవిడ చనువు, దయ సంపాదించుకోటానికి? తీరా వెళ్తే మొన్న తోటలోలాగే ఆవిడో పుస్తకం చదువుకుంటూ

కూర్చుంటే ఏదీ గతి?" చిరాకుగా అడిగింది నిర్మల. "ఊఁ." నిట్టూర్చాడు చక్రవర్తి. "నీకు ప్రతీది చెడే కాని అర్థంకాదు. పోనీ, అసలిష్టం లేదని సూటిగా చెప్పరాదూ?"

"నా కెందు కిష్టంలేదు? నడవండి. పోనీ, అదీ తేలిపోతుంది."

కార్లోంచి దిగుతూన్న నిర్మలనూ, చక్రవర్తినీ సాదరంగా ఆహ్వానించింది మాధవి. కాని లోలోన ఆశ్చర్యపోయింది. నామ మాత్రపు ఆహ్వానానికే వారలా వచ్చేస్తారని ఆమె అనుకోలేదు. డ్రాయింగ్ రూమ్‌లో కూర్చోబెట్టి రేడియో ఆన్ చేసి, కాఫీ చెయ్యడానికి లోనికి వెళ్ళబోయింది. "మా గురించేమీ ఆర్భాటం వద్దు. ఇహ రోజూ వచ్చే వాళ్ళమేగా కాస్సేపు కూర్చుని కబుర్లు చెప్పండి" అన్నాడు డాక్టరు.

"మీ స్నేహితులకు కూడా తయారుచేసి ఉంచాలిగా? ఆఫీసునుండి వచ్చే వేళవుతోంది." నవ్వుతూ జవాబిచ్చి లోనికి వెళ్ళింది మాధవి.

అంతవరకు నిర్మల ఒక్క మాటకూడా మాట్లాడలేదు. డేగకళ్ళతో పరీక్షిస్తూంది, ఆ యింటి అలంకరణ అంతనూ. స్టౌమీద నీళ్లుపడేసి వచ్చిన మాధవి, "ఇల్లు చూద్దురుగాని రండి" అంది.

డ్రాయింగురూమ్, లివింగ్‌రూమ్, రెండు పడకగదులు, భోజనాలగది, స్నానాలగది, వంటిల్లు ప్రతిదీ పొందికగా శుభ్రంగా వుంది. ఎందుకూ లోటులేనంత సామాను వుంది.

మేడమీాదకు వెళ్ళారు. అక్కడో డ్రాయింగ్‌రూమ్ క్రింద గదికంటే బాగుంది. అక్కడ రేడియోగ్రామ్ వుంది.

"రెండు రేడియోలా?" అంది ఆశ్చర్యంగా నిర్మల.

"మూడు. ట్రాన్సిస్టర్ కూడా వుంది" అంది మాధవి నవ్వుతూ.

"వంటా అదీ మీరే చేసుకుంటానంటే నేను మరోలా అనుకున్నాను. మీరు బాగా ధనవంతులేనే" అంది నిర్మల విస్మయంగా.

"గృహిణీధర్మం తెలిసినవాళ్ళకు ధన ప్ర మే య ం వుండదు. అంతా నీమాదిరేననుకుంటావ్" అన్నాడు చక్రవర్తి నువ్వుతూనే. అయినా నిర్మలముఖం మాడిపోయింది.

సంభాషణధోరణి మార్చే ఉద్దేశ్యంతో రీడింగు రూమ్‌లోకి దారితీసింది మాధవి. టేబుల్‌మీాద సగం సగం వ్రాసిన కాగితాలనేకం ఉన్నాయి. ఆ ప్రక్కనే బీరువా నిండా వ్రాత ప్రతుల దొంతర్లు అనేకం ఉన్నాయి.

"ఇది మీా గదిని స్పష్టంగా తెలుస్తూంది. అవన్నీ మీారు వ్రాసినవే కదూ?" అడిగాడు చక్రవర్తి.

అవునని తలూపింది మాధవి. "నాగది – అనికాదు. రీడింగ్‌రూమ్. కాని ఎక్కువ ఉపయోగించేది నేను."

అనేక గ్రంథాలున్న ఒక చిన్న బీరువా చూపుతూ, "ఇవన్నీ తెలుగు నవలలు. కొన్ని అనువాదాలు. బెంగాలీవి కూడా ఉన్నాయనుకోండి" అంది. మరో బీర్వా చూపి, "అందులో అంతా ఇంగ్లీష్ అండ్ రష్యన్ లిటరేచర్." ఆ నాల్గో

బీర్వానిండా పత్రికలు. నా రచనలు పడినవీ, ఏమైనా మంచి నచ్చిన కథలున్నవీ జాగ్రత్త చేస్తూంటాను" అన్నది. ఆశ్చర్య పోయాడు, చక్రవర్తి. "ఇంతమందిని చూశాను కానీ, ఇలా ఇంట గ్రంథాలయం పెట్టుకొన్న వాళ్ళను, ముఖ్యంగా ఆడవాళ్ళను అసలు చూడలేదు. నిజంగా మీవంటి స్నేహితులుండటం నా అదృష్టం. ఇందులో నాల్గోవంతు పుస్తకాలైనా నేను చదవలేదు" అన్నాడు.

"ప్రాణాలను మరమ్మత్తుచేసే మీరు పుస్తక పఠనం చేస్తే ఎలా ? ఎవరి అభిరుచి వారిదిలెండి" అంది మాధవి.

"ఆ పటాలెక్కడ కొన్నారండి?" అంది నిర్మల గోడలు చూస్తూ.

చక్రవర్తికూడా చూశాడటు. అందమైన వాటర్ కలర్ చిత్రలేఖనాలు చక్కటి ఫ్రేములలో బిగించి ఉన్నాయి. దగ్గరగా వెళ్ళాడు. అన్నీ మధుపేరిటే ఉన్నాయి. "గొప్ప కళ!" అన్నాడు ముగ్ధుడైపోతూ. ఒకపటం గోడనుంచి తీసి ఏదో సందేహంతో అటు ఇటు త్రిప్పుతూండగా మాధవి నవ్వుతూ చెప్పింది: "మీ చేతిలోది ఎంబ్రాయిడరీ వర్కు. చిత్రలేఖనంలాగే కనిపిస్తుంది. వీటిలో కొన్ని చిత్రలేఖనాలు కూడా ఉన్నాయనుకోండి." చిత్రంగా చూసింది నిర్మల. "చిత్రలేఖనం వంటి అల్లిక!"

"మధు అంటే..."అర్థోక్తిలో ఉన్న చక్రవర్తి సందేహాన్ని "నేనే" అంటూ నివృత్తిచేసింది మాధవి. "కొంతకాలం అవి సరదాగా ఉండేవి. ఆఖరికి ఈ సాహిత్యంలో పడిపోయాను మిగతవన్నీ మానేసి."

"చదువు, సంగీతం, చిత్రలేఖనం, అల్లికలు, కథారచన-అబ్బో ఇక మీాకు రాని విద్యేమిటి?" కొంత ఆశ్చర్యంగా, కొంత సంతోషంగా అడిగాడు చక్రవర్తి.

"ఒకటే! అతిశయం, ఆడంబరమూాను. ఆ విద్యలే లేవు" అంటూ ప్రవేశించాడు అప్పుడే ఆఫీసునుంచి వచ్చిన రవీంద్ర. భార్యపై గౌరవం, అనురాగం తొణికిసలాడి పోతున్నాయి అతడి నేత్రాలలో. అంతా నవ్వేశారు.

"కూర్చోండి కాఫీ తెస్తాను" అంటూ వెళ్ళిపోయింది మాధవి. దుస్తులు మార్చడానికి రవీంద్ర క్రిందకు వెళ్ళాడు.

"అన్నిటికంటే ఎక్కువగా ఉన్నది ఆ అతిశయమే. లేదనుకొంటే సరా!" అంది నిర్మల మెల్లగా.

"మితభాషిత్వాన్ని గర్వంగా అంచానా వెయ్యకూడదు. అయినా అది మనకెందుకుగానీ ఇల్లంతా ఎంత అందంగా అలంకరించిందో, ఎంత శుభ్రంగా ఉంచిందో చూసి నేర్చుకో కూడదూ?" సన్న సన్నగా మందలించాడు చక్రవర్తి.

"మీారుకూడా అతడిలా భార్యను గౌరవించడం నేర్చుకుంటే బాగుంటుంది." పెంకెగా సమాధానమిచ్చింది నిర్మల.

కాఫీలయ్యాక చాలాసేపు కబుర్లలో పడ్డారు. అందరికంటే అధికంగా మాట్లాడేవ్యక్తి రవీంద్ర. అతడికి ఒకోసారి ఆవేశం వచ్చిందంటే ఎవరి ఎదుటనైనా స్వంత విషయాలు కూడా నిస్సంకోచంగా మాట్లాడేస్తాడు. మాధవి అందాన్నీ కథలనూ తాను ఎంతగా ప్రేమించి వివాహం చేసుకున్నదీ, ఆదిలో ఆమెపట్ల తమ కుటుంబంలో కలిగిన భయాలు,

రాను రాను మాధవి సత్ప్రవర్తనవల్ల ఎట్లా మారిపోయినదీ రవీంద్ర హాస్యంగా వర్ణిస్తుంటే కుతూహలంగా వినే చక్రవర్తిని చూచి ఈర్ష్యతో క్రుంగిపోయింది నిర్మల.

అంతా విన్న చక్రవర్తి, "ఎవరి ప్రతిభైనా పైకి రావాలంటే ప్రోత్సాహమిస్తూ చేదోడు వాదోడుగా ఉండే జీవిత భాగస్వామి ఉండాలంటాను. ఏమంటారు, మాధవీలత గారూ? ఒక కళనుగానీ, సరదానుగాని ఉత్సాహంగా పైకి తెచ్చే భార్యగానీ, భర్తగానీ ఉంటేనే రాణింపు. లేకపోతే ఆ కళా, ఉత్సాహమూ నామరూపాలు లేకుండా పోతాయి. కథారచయిత్రిగా మీకింత పేరు ప్రతిష్ఠ లున్నాయంటే — ఆ ఘనత శ్రీ రవీంద్ర విశాల హృదయానికి దక్కుతుంది" అన్నాడు.

ఫక్కున నవ్వాడు రవీంద్ర. "మన మేదో పక్షపాతంతో పొగుడుకొంటున్నామనుకోగలరు ఈ ఆడవాళ్ళు" మాధవి నవ్వి ఊరుకొంది.

వెళ్ళేటప్పుడు చక్రవర్తి, మాధవిని, "మీ రచనలు ఏమైనా ఇటీవల ప్రచురితమైనవి ఉంటే యివ్వండి" అన్నాడు.

మాధవికి అసలు ఎవ్వరికీ ఏ వస్తువూ ఇచ్చే అలవాటు లేదు. అంత్యనిష్ఠురంకంటే ఆదినిష్ఠురం మేలంటుంది. కాని ఇప్పుడామె కవగాశమివ్వకుండానే రవీంద్ర. "దానికేం? తీసుకెళ్ళండి" అంటూ రెండు నవలలు, కొన్ని పత్రికలు తీసి ఇచ్చాడు. అంతతో ఊరుకోక డ్రాయర్ అరలోఉన్న వ్రాత ప్రతి తీసి, "ఇది వారపత్రిక పోటీకి పంపిన కథ. చిత్తుప్రతి అనుకోండి. సరదావుంటే చదవచ్చు" అన్నాడు.

"సంతోషంగా" అంటూ అందుకున్నాడు, చక్రవర్తి. మాధవికి కోపం, చీకాకు పెనవేసుకు వచ్చాయి. ఇంట్లోతల్లికి, దగ్గరి స్నేహితులకుకూడా ఆమె ఎప్పుడూ కథల వ్రాతప్రతు లివ్వలేదు; అచ్చయితే చదవవలసిందేకాని. అతనికున్న శ్రద్ధా సక్తులు చూచి రవీంద్రకు మాత్రం ప్రతి కథా వ్రాయగానే చూపుతుంది. ఆ చనువు పురస్కరించుకునే అత డివాళ ఇంత పని చేశాడు. అయిష్టమైతే మాత్రం భర్త ఇన్తుండగా ఎదుటే వద్దని వారించడ మెలా ? ఎట్లాగో నిర్మలా, చక్రవర్తీ వెళ్ళేవరకూ ఊరుకుని, తర్వాత భర్తకు సన్నసన్నగా చీవాట్లు పెట్టింది.

"నువ్వు ఎందుకో అతడి ననవసరంగా ఛీదరించుకుంటు న్నావ్, మాధవీ. అతడిది వెన్నవంటి హృదయం. స్నేహానికి ప్రాణమిస్తాడు. మనమంటే ఎంత గౌరవమో తెలిస్తే నువ్విలా మాటాడవు."

"మీకూ, మీకూ స్నేహాలు అభిమానాలు ఉంటే ఉండనీయండి. నావరకూ ఎందుకు ? అందరి ఎదుటా వారించ డం ఇష్టంలేక ఊరుకున్నాను. నా రచనలు నేను ప్రాణపదంగా చూచుకుంటానని తెలిసే ఎందుకిలా చేశారు?" నిట్టూర్చుతూ మెల్లగాఅన్నాడు రవీంద్ర : "విలువ తెలిసినవాడని ఇచ్చాను. నువ్వింత కష్టపెట్టుకుంటావని అనుకోలేదు. తిరిగి పదిలంగా ఇచ్చేస్తాడు. ఫర్వాలేదు"

కొంతసేపు మౌనంగా కూర్చుని లేచి లోపలికి వెళ్ళు తూంటే రవీంద్ర తిరిగి వెనక్కి పిలిచాడు. "ఆవిడేమిటి నీతో వాదిస్తోంది ?"

"ఆ నిర్మలేనా? ఏముంది? ఏవో పైపై శుష్క ప్రియాలు తప్ప వట్టి అసూయాపరురాలల్లే కన్పిస్తుంది. వాళ్ళ క్లబ్బులో చేరమంటుంది. నాకంత శ్రద్ధలేదని చెప్పాను."

"బాగుంది వరుస. అతడి అతి చనువుచూస్తే చిరాకు – ఈవిడ అసూయ చూచినా చికాకు. కాని నువ్వేమనుకోనంటే ఒక్క సలహా మాధవీ."

"ఏమిటది?" మామూలుగానే అడిగింది.

"పూర్తిగా ఇలా ఇంట్లో కూర్చునేకంటే ఏదో కాస్త నలుగురిలోనూ అలా తిరుగుతూంటేనే బాగుంటుందేమో? గృహభారాన్నంతనూ కొద్దిసేపైనా మరచిపోయే అవకాశం ఉంటుంది. ప్రపంచంలో ఏ ఒక్కరూ మనకు నచ్చరు పూర్తిగా. మనుష్యుల్ని వాళ్ళ లోపాలతో కలిపే గౌరవించడం నేర్చుకోవాలి."

"పోనిద్దురూ. నా పిచ్చిధోరణి నాది." అంటూ లేచి పోయింది మాధవి.

౬

ఆదివారం మధ్యాహ్నం మూడు గంటలకు వస్తున్నానని రవీంద్రకు ఫోన్ చేశాడు, డాక్టర్ చక్రవర్తి.

"చాల సంతోషం. అందరం ఇక్కడే టీ తీసుకుందాం. తప్పకరండి" అని జవాబిచ్చాడు రవీంద్ర.

చక్రవర్తి వస్తూనే కథ కాగితాలు మాధవికి ఇస్తూ, "మీ చాతుర్యాన్ని ఏమని స్తుతించాలో తెలియకుండా ఉంది. తప్పక మీకు బహుమానం వస్తుంది. నే చెప్తాను చూచుకోండి" అన్నాడు.

"సరే. వస్తుందనుకుందాం, మీనోటి చలువవల్ల. మరి రాకపోతే?" కనుకొసల చివర కొంటెతనం చిందిస్తూ అడిగాడు రవి. కాని గంభీరంగా సమాధాన మిచ్చాడు చక్రవర్తి: "రాకపోతే అది నిర్ణయాధికారుల తెలివితక్కువ అనాలి. ఏదైనా గొప్ప విషయాల్ని అర్థంచేసుకోడానికి కూడా తగిన మేధస్సు ఉండాలి."

"అయితే మీరు మహా మేధావంతులని మేం గ్రహించాలంటారు!" మాధవి గంభీర స్వభావం కూడా పొగడ్తకు కొంచెం సడలింది. నవ్వుతూ అన్నదే కాని, తీరా అన్నాక అలా అని ఉండకూడదనిపించింది ఆమెకు.

ఆ మాటలకు కొంచెం చకితుడైన చక్రవర్తి వెంటనే సర్దుకొని తేలికగా నవ్వేశాడు. రవీంద్ర ప్రక్కన కూర్చుంటూ, "క్షమించండి, ఆదివారం మీరేమీ ప్రోగ్రామ్ వేసుకోలేదు కదా?" అనడిగాడు.

"లేదు, లేదు. మాకు సాధారణంగా ఎక్కడికీ వెళ్ళే అలవాటు లేదు. సినిమాలైనా అంతగా చూడం. ఈ పాటికి మీకు మాధవి తత్వం బోధపడే ఉంటుంది. ఒక్క ఆఫీసు మినహాగా ఆమెతోడిదే నాకూ ప్రపంచం. ఆమె కథలు వ్రాస్తుంది—నేను చదువుతాను. నేను కబుర్లు చెప్తాను—ఆవిడ వింటుంది. ఆమె పాడగలదు–నే నానందించగలను. చదరంగం,

టేబుల్ టెన్నిస్, పేక ఆడుకుంటాం. అప్పుడప్పుడు బీచ్ కి మాత్రం పోతూంటాం" అన్నాడు రవీంద్ర, మాధవిని ఓరకంట చూస్తూ.

"అదృష్టవంతులు!" అన్నాడు చక్రవర్తి. "ఇద్దరూ విద్యావంతులు, సహృదయులు. ఒకరి నొకరు అర్థం చేసుకో గలరు."

"చదువు సంతగా అభిమానించేవారు మరి చదువు లేనావిడ నెలా వివాహం చేసుకున్నారు, డాక్టర్ ?" అంది మాధవి. నవ్వుతూన్న డాక్టర్ ముఖం వెలవెలబోయింది. ఏదో చెప్పబోయాడు కానీ చెప్పలేనట్లు తలవంచేశాడు.

"అప్పుడే కట్న కానుకలకో ఆశపడి చేసుకొంటారు. తర్వాత బాధపడతారు." ఛెళ్ళుమన్నట్లుగా అడిగాననుకుంది.

కాని రవీంద్ర మాత్రం లోలోన చాలా నొచ్చు కున్నాడు. డాక్టర్ మనస్సు తేలికపరచడానికి, "నిర్మలగారు రాలేదేం ?" అనడిగాడు.

నవ్వాడు డాక్టర్. "మూడయ్యేటప్పటికి ఆవిడ విధిగా క్లబ్బుకు వెళ్ళిపోవలసిందే. ఏడింటికే పునర్దర్శనం."

టీ తీసుకున్నాక, వెళ్తానంటూ లేచి డ్రైవర్ని కేకేశాడు చక్రవర్తి. అతడు తెచ్చిన పొట్లం తీసుకుని విప్పి బల్లమీదుంచుతూ, "మా తోటలో పూలు, తీసుకోండి" అన్నాడు మాధవిని. ఆకులతో త్రుంచిన తెల్ల గులాబీలు, సువాసనలు వెదజల్లుతూన్న పసిడిరంగు సంపంగి పూలు.

"థాంక్యూ" అన్నాడు రవీంద్ర, పూలనుతీసి ఆఘ్రా ణిస్తూ.

మాధవి మాత్రం గతుక్కుమంది. "ఏమి టీ వ్యక్తి అతిచొరవ ! ఈ చనువును యిక మితిమీరకుండా త్రుంచి వెయ్యాలి. కానీ రవీంద్ర ఎదుట అది అసాధ్యం. అతడు లేని సమయమే అందుకు అనుకూలం" అనుకుని ముభావంగా ఊరుకుంది.

"నే నున్నా లేకపోయినా మీరేమీ సంకోచించ నవసరంలేదు. బుద్ధిపుట్టినప్పుడు తోటలోకి వెళ్ళివస్తూండండి రవీంద్రా. మనః క్లేశాలన్నీ వదలిపోతాయి ఆ పూలమొక్కల మధ్య కూర్చుంటే" అంటూ సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు చక్రవర్తి.

"చూశావా, మాధవీ, అతడెంత ఉత్తముడో" అన్నాడు రవీంద్ర, చక్రవర్తి వెళ్ళిన దిక్కే చూస్తూ.

"ఊ" పరధ్యానంగా లోనికిపోయింది మాధవి.

రాత్రి పనంతా ముగించుకొని కాస్సేపు వ్రాసుకొందా మని రీడింగ్‌రూమ్‌లోకి వెళ్ళింది మాధవి. మధ్యాహ్నం చక్ర వర్తి యిచ్చేసిన కథ కాగితాలు బీరువాలో దాచివేయబోతూ అప్రయత్నంగా విప్పిచూసింది. ఆశ్చర్యపోయింది ! భయంతో కూడిన కోపం ఆవరించింది.

రెండు నీలికాగితాల నిండుగా అందమైన దస్తూరీతో మాధవి వ్రాసిన 'ఆరాధన' కథపై డాక్టర్ చక్రవర్తి విమర్శ ! 'చించి పారేద్దాం, చదవద్దు' అనుకొంటూనే శ్రద్ధగా చివరి వరకూ చదివింది. ఆశ్చర్యం, సంతోషంకూడా కలిగాయి. కథలోని ప్రతిసంఘటననూ అతడు పరిశీలించిన విధం, ప్రతి

పాత్రశీలాన్ని తర్కించుతూ విమర్శించిన ఆ శైలీ ఆమెను ముగ్ధురాల్ని చేసినవి. విమర్శనా వ్యాసాన్ని ముగించుతూ చక్రవర్తి చేసిన సూచన మాధవికి కొంత ఆలోచన కలిగించింది.

"శ్రీమతి మాధవీ,

మీరు వ్రాసిన 'ఆరాధన' నాకు బాగా నచ్చింది. నేను రచయితను కాను. కాని ప్రతి పాఠకునికి విమర్శించే హక్కు ఉందనుకుంటాను. 'ఆరాధన' కథపై నా విమర్శ చదవడానికి మీ కభ్యంతరం ఉండదు కదూ!

ఒక నాయికి, ఇద్దరు నాయకుల జీవితాలను ప్రతిబింబపచేసిన ఈ కథ అతి సామాన్యంగా ముగియటం రచయిత్రి పేరు ప్రతిష్ఠలకు తగినట్లు లేదు. కథానాయకి పద్మలో గల అందాన్ని, ఆకర్షణనూ ప్రేమించి వివాహమాడుతాడు మురళి. ఆమెలోగల నాట్యకళను ఆరాధించి సన్నిహితుడయ్యాడు శ్యామ్. మురళిది దైహిక ప్రేమ; శ్యాం ప్రేమాభిమానాలు నిష్కామమైనవి. ప్రేమారాధనకూ, కళారాధనకూ జరిగిన సంఘర్షణలో నలిగిపోయిన పద్మలోని నాట్యకళ వాడిన పుష్పసుగంధంలా హరించిపోయింది. మురళిచే అవమానించబడిన పద్మ ఆత్మహత్య చేసుకొంటుంది. మనోవ్యథతో క్రుంగిపోయిన శ్యాం 'పద్మకళానికేతన్' స్థాపించి బాలికలకు ఉచితంగా నాట్యం నేర్పుతూ తా నారాధించిన నాట్యరాణి పద్మకు ఆత్మశాంతి కలిగిస్తాడు. భారతదేశంలోని అందరి పురుషులమాదిరే మురళి తిరిగి వివాహం చేసుకుని సుఖంగా ఉంటాడు.

కాలక్షేపానికి పైపైన చదివితే బాగుందనిపించే కథ; హృదయాన్ని కదిలించే సన్నివేశాలు; సరళ శైలితో మనోహరంగా ఉంది. కాని పురుషునిలో కళ ఉండటం వేరు; స్త్రీలో కళానైపుణ్యం వేరు. ఆమె కళకు దోహద మిచ్చే పురుషుడు లేనప్పుడు ఆ కళానైపుణ్యం హారతి కర్పూరంలా హరించి పోతుంది. హిందూదేశంలో సాధారణంగా జరుగుతున్నట్లే; సాధారణ రచయితలందరు చూసినట్లే, ఒక కళా కుసుమం ఈ సనాతన దేశంలోని కుసంస్కారుల చేతిలో ఎట్లా వాడి, నశించి పోయిందో చిత్రించారే కాని ఈ జాడ్యానికి పరిష్కార మార్గం చూప ప్రయత్నించలేదు. చివరి దశలోనైనా మురళి హృదయంలో సంస్కారజ్ఞానాలు వెల్లివిరిసి, శ్యాం పవిత్ర హృదయాన్ని, పద్మ నిష్కళంకతను గుర్తించి, ఆమెలో గల కళానైపుణ్యాన్ని వృద్ధిచేయ బూనినట్లు కథను మలిచి, సుఖమయ జీవిత సూచికగా ఉదయించిన ఆ పరివర్తనకు ఆశారేఖగా నామకరణం చేస్తే దివ్యంగా ఉండేది. అది చదివిన అందరికీ కాకపోయినా బహు కొద్ది మందికైనా – అటువంటి స్వార్థపరులకు, కుసంస్కారులకు – కనువిప్పు కలిగి ఉండేది. మానవ హృదయాలలో పరివర్తన తీసుకురాగలశక్తి గలిగినవీ, అనుమాన జాడ్యపీడిత హృదయాలకు ఆరోగ్యం చేకూర్చేవీ వుత్తమ కథలూ, చిత్రాలే కదా!"

క్లుప్తంగా వున్న ఆ విమర్శ అంతా చదివిన మాధవికి అతడి సూచన చాలా నచ్చింది. 'చదివి బాగుందనే వారేకాని తనకు ఇదివరకు ఇలా సూచన లిచ్చినవారు లేరు. గొప్ప పనిని మెచ్చుకోవటానికికూడా తగిన తెలివి ఉండాలనే చక్రవర్తి

మాటలు అక్షరాలా నిజం! శ్రమపడి ఇంత సద్విమర్శ చేసిన యితడు ఎన్ని తెలిసినవాడై ఉండాలి! బహుశా ఎవరైనా అజ్ఞాన రచయితేమో! లేకుంటే కథల్పై ఇంత శ్రద్ధ ఏమిటి? ప్రోత్సాహం లేక అణగారిపోయే స్త్రీలకోసం అతడి హృదయంలో ఎంత తపన! ఆ వెనుక ఏదో బాధ ఉండి ఉండాలి. పాపం, అతను మంచివాడేనేమో! తానే అపార్థం చేసుకుంటున్నదేమో! మంచివాడైతే రవీంద్ర ఎదుట కథ బాగుందనే అన్నాడు కాని, దానిపై 'విమర్శ' ఉంది. – చదవమని ఎందుకు చెప్పలేదు? ఇంతకూ యిది రవీంద్రకు చూపడమా? మానడమా?' ఎటూ తేల్చుకోలేకపోయింది. మొత్తంమీద చించివేయాలనుకుంటూ చేతికి తీసుకున్న ఆ చక్రవర్తి స్వహస్త లిఖిత వ్యాసాన్ని కథతో బాటుగా రోజ్‌వుడ్ బీర్వాలో భద్రపరిచింది.

ఆ తర్వాత మాధవి, చక్రవర్తిపట్ల అంత కఠినంగా ప్రవర్తించలేక పోయింది. కాని, ఎక్కువ చనువు కూడా యివ్వలేకపోయింది. పూర్వంవలె ముభావంగా కాక రవీంద్రలా స్వేచ్ఛగా నిస్సంకోచంగా మాట్లాడుతూంది.

ఒకనాడు మాటలలో, "నిర్మలగారు పూర్తిగా రావడం మానేశారేం?" అనడిగింది మాధవి, చక్రవర్తిని.

బిగ్గరగా నవ్వాడు చక్రవర్తి. "మీరు క్లబ్బులో చేరనందుకు ఆవిడకు కోపం. పోనీ మీరు ఓసారి రాకూడదూ? వస్తూ పోతూంటేనే కదా స్నేహాలూ, బంధుత్వాలూను!"

రవీంద్ర తాళం వేశాడు. "అవును. నువ్వే యెందుకు వెళ్ళకూడదూ?" మాధవి నవ్వి ఊరుకుంది.

"ఊరికే రానక్కరలేదండీ! రేపు నిర్మల పుట్టినరోజు. మీాకు ఆహ్వానం పంపలేదూ?" అన్నాడు చక్రవర్తి.

"పంపారు" అంది మాధవి.

"అయితే తప్పక రండి. మీారూ రావాలి, రవీంద్రా. మిమ్మల్ని నేను ఆహ్వానిస్తున్నాను" అన్నాడు చక్రవర్తి.

"మీా పుట్టినరోజు పండుగ విందుకు వస్తానండి నేను" అన్నాడు రవి నవ్వుతూ.

చక్రవర్తి నవ్వలేక పోయాడు. "సారీ, మిస్టర్ రవీంద్రా. నా కటువంటి సరదా లేమీా లేవు. ఒకరి సరదాలను మాత్రం నేను కాదనలేను. అందుకే నిర్మలకు అంత స్వేచ్ఛ. ఈ సమావేశాలవల్ల అంతగా ఒరిగేదేమీా ఉండదని నాకు తెలుసు. కాని నిర్మలకు అదే లోకం. ఆవిడ సరదాలను నా అభిప్రాయాలతో బాధించను, విమర్శించను. అసలు నే నెవర్నీ విమర్శించను. పోనీండి, దానికేంగాని, మీా రిద్దరూ రేపు తప్పక వస్తారు కదూ!" అంటూ లేచి వెళ్ళి పోయాడు.

మాధవీ రవీంద్ర లిద్దరూ విస్తుపోయారు. మాట్లాడుతూ మాట్లాడుతూనే అతడలా ఎందుకు లేచి వెళ్ళి పోయాడో, అతడి మాటల మాటున దాగిన బాధ ఏమిటో వారి కర్థం కాలేదు

విందు ముగిసి అతిథు లందర్నీ సాగనంపే టప్పటికి రాత్రి పద కొండు దాటింది.

పడక గదిలో కిటికీ దగ్గర నిల్చుని సిగరెట్ పీలుస్తున్న చక్రవర్తి, సుడిగాలిలా వచ్చి పడుకున్న నిర్మలను చూచికూడ మాట్లాడ లేదు.

ఆమె అంత దురుసుగా వచ్చిందంటే ఏదో అగ్ని పర్వతం బ్రద్దలవ్వడానికి ముందు జరిగే సన్నాహమని అతడ్ని తెలుసు.

నిర్మల కొంచెం సేపు అటూ యిటూ దొర్లి, "ఎవరి నయినా అభిమానించటానికైనా ఓ హద్దు పద్దూ ఉండాలి" అంది స్వగతంలాగా.

చక్రవర్తి విన్నాడుగాని మాట్లాడ లేదు.

"మనకు గడ్డిపరకంత విలువకూడా యివ్వని వాళ్ళ చుట్టూ ఎందుకు తిరగాలో బోధపడడం లేదు" అంది నిర్మల కొంచెం గట్టిగా.

అప్పటికీ చక్రవర్తి మాట్లాడ లేదు.

"ఓ ప్రక్క అతిశయం లేదని చాటుకుంటూ ఎంత గర్వం !"

ఈసారికూడా సమాధానం రాకపోయే సరికి ఒళ్ళు మండింది నిర్మలకు.

"ఏం, నిల్చునే నిద్రపోతున్నారా ?" అంది గట్టిగా, విసుగు కనబరుస్తూ.

"నిద్రా ? యింకా రావడం లేదు." ఆ అడ్డు సమాధానంతో మరీ అరికాలి మంట నెత్తికెక్కి పోయింది నిర్మలకు.

"అందరితోనూ అమృతం చిలికిస్తూ మాట్లాడటం, నాతో యిదీ వరస. ఇంతకూ నాలో నేను వాగుకోవటమే కాని, మాట్లాడలేక పోతున్నా రేం అలా ?"

"నీలో నువ్వేదో అనుకుంటున్నావు, నేనేం మాట్లాడను ?"

"నాలో నేనే అనుకొనేంత పిచ్చెక్క లేదులెండి నాకు. మీతోనే అంటున్నాను. మీరంతగా ఆరాధిస్తారే - చదువుకొన్నదీ, తెలివైనదీ అంటూ. ఏదీ, మరి యింతగా పిలిస్తే. రాలేదేం ?"

గాలి ఎటు తిరగబోతూందో అర్థమైంది చక్రవర్తికి, అయినా అర్థం కానట్లు "ఎవరు?" అన్నాడు.

"ఎవరా ? మొన్న రాత్రంతా నిద్రలేకుండా చదివారే, ఆవిడ కథలు తెచ్చి ? — ఆవిడ. ఆ మాధవి. కారు పంపిస్తే కూడ రాలేనని కబురంపింది. ఆ రవీంద్రకైనా బుద్ధి లేదూ ? మీరైతే వూరుకొంటారా ? బలవంతంగా తీసుకెళ్లురు నన్ను."

"ఎందుకు, నిర్మలా, అలా అనుకోవడం ? ఏ కారణం వల్లనైనా పీలుపడలేదేమో? మరోసా రొస్తారులే."

"మరో సారి ! మరోసారి పిలవడం కూడానా యిక ? నాకు తెలుసు ఎందుకు రాలేదో. తాను చదువుకొన్న దాననీ, అందమైనదాననీ అహంకారం. నేను, నా స్నేహితులు తనతో మాట్లాడ తగనివాళ్ళమని ఆమె భావం. చదువుకోగానే సరా, మర్యాదలు తెలియవద్దూ ? నూతిలో కప్పలా యిల్లే స్వర్గమట. అమ్మమ్మ కబుర్లు. మీలాంటి వాళ్ళంతా అంతటిది వుండదు. వుండబోదని ఆరాధించడం. ఛీ."

సిగరెట్ విసిరేసి వచ్చి పడుకున్నాడు చక్రవర్తి. "నోటికి ఎంతవస్తే అంత మాట్లాడడం నీ నైజం. చదువునూ, తెలివినీ మెచ్చుకొంటే నీ కసూయ దేనికి? అయినా, నే నందర్నీ గౌరవిస్తాను ఎవర్నీ తేలికపరచను. అందుకే నువ్వంత హద్దులు మీరి మాట్లాడుతున్నావ్. భర్తను నిరసించడం నీకే తగింది. ఎందరినో పిలుస్తాం. రావడానికి, రాకపోవడానికి అనేక కారణా లుంటాయి. మనకు అతి ముఖ్యంగా కన్పించింది మరొకరి కంత ముఖ్యం కాకపోవచ్చు. అంతకంటే ముఖ్యమైన పను లుండి వుండవచ్చు."

"అవును. మనకు మాత్రం ఏ పనిలేక వాళ్ళచుట్టూ తిరుగుతాం. ఇష్టమైతే ఎన్ని విధాలనైనా సరిపెట్టుకోవచ్చు." ఖంగుమంది నిర్మల గొంతు.

"అసలు నీకేదో కారణం దొరుకుతుంటుంది ఒక్కో గాలివాన సృష్టించడానికి. నాపై తగని అనుమానం, నిర్లక్ష్యం. నీ విలాసాలు, నీ వినోదాలు, నీ సుఖమేకాని పగలంతా పది మందిలో తిరిగి, పలురకాల అలసిపోయిన మగవాడికి, ఇంటి కొచ్చేసరికి కాస్త ఆదరణా, ప్రశాంతతా అవసరమని యేనాడైనా గుర్తించావా? భర్తకు వంటవాడిచేత తిండి పారేయించే నువ్వూ ఒక ఆడదానివేనా? ఒకసారి కాదు. వంద సార్లు చెబుతున్నాను—ఆ మాధవి కాలిగోటికి పోలరు నువ్వూ, నీ స్నేహితులూను. ఆవిడ శుశ్రూష చెయ్యా—యిల్లాలంటే ఎలాగుండాలో అర్థమాతుంది." ఛీత్కారం చేస్తూ ఆగదిలోంచి నిష్క్రమించాడు చక్రవర్తి.

౮

సాయం సమయం. పిక్చరుకు వెళ్దామంటూ రవీంద్ర, మాధవిని బయల్దేర తీశాడు.

"ఏం పిక్చర్‌కి ?" అంది మాధవి మోటార్ సైకిల్‌పై కూర్చుంటూ.

"ఏదో ఒకటి. అలా కాస్సేపు నాలుగు వీధులు తిరిగి నచ్చిన థియేటర్‌లోకి పోదాం" అన్నాడు రవీంద్ర స్టార్టుచేస్తూ.

"చాలా బాగుంది. ఫలానా పిక్చర్ చూద్దామూ అని లేదన్న మాట! ఏం మనిషండీ ?" అంది మాధవి కొంటెగా.

"ఆ మనిషంతేలే. ఇహ బాగుపడడు. ఏం చేస్తాం మరి!" అన్నాడు రవి గంభీరంగా. ఇద్దరూ నవ్వుకొన్నారు.

దారిలో ఒక హోటల్ ముందు ఆగి యిద్దరూలోనికి వెళ్ళారు. కాఫీ త్రాగుతూ. "ఇంత అందమైన సాయంత్రం సినిమా హాల్లో గడపట మేమిటి? బీచ్‌కి వెళ్దాం. ఏమంటావ్?" అన్నాడు రవీంద్ర.

"నే నేమీ అనలేదు. మీ యిష్టం. నడవండి" అంది కుర్చీలోంచి లేస్తూ.

"మా మాధవి చాల బుద్ధిమంతురాలు. అయితే మరో ప్రతిపాదన. ఈ సుందర సంధ్యలో, అందమైన పూదోటలో – ఎలా వుంటుంది?" అన్నాడు రవి సగం బెదురుతూనే.

"పూదోటా ? అ దెక్కడ ?" అంది కను బొమలు ముడివేస్తూ.

"చక్రవర్తి..." అని అర్ధోక్తిలో ఆపేశాడు రవీంద్ర.

మాధవి ముఖంలో నవ్వు మాయమైంది. "బావుంది వరస. ఓ నిశ్చయమంటూ లేకుండా బయల్దేరితే ఇలాగే వుంటుంది. తోచకపోతే హాయిగా వెనక్కి పోదాం రండి. మన డాబా మీద కూర్చోవచ్చు" అంది చిరుకోపంతో.

"పోనీ వెళ్తేనేం మాధవీ ? అతడే వెళ్ళమన్నాడుగా తోటలోకి?"

"అతను రమ్మంటారు. దొరికిందే చాలని మీరు వెళ్ళి పోతారు. నేను మాత్రం రాను నాకీ అతిచనువు లేమీ ఇష్టం లేదు."

మోటార్ సైకిల్ సిమెంట్ రోడ్ దిగి తారు రోడ్డు పట్టింది.

"ఇదేమిటి ? ఊరు చివరి కొచ్చేశాం ? ఇంకా యింటికే అనుకుంటున్నాను" అంది మాధవి రవీంద్రుని భుజం పట్టి కుదుపుతూ.

"చెప్పానుగా ఎక్కడికో" అన్నాడు రవీంద్ర నిదానంగా పోనిస్తూ.

"నేనూ చెప్పానుగా, రానని ? దూకేస్తానంతే."

"బెదిరింపా ? ఏది దూకు చూద్దాం. అప్పుడైనా కట్లు కట్టమని చక్రవర్తి డిస్పెన్సరీకి తీసుకువెళ్ళాల్సి వుంటుంది. అంతకంటె తోట నయంకాదూ?"

ఈసారి మాధవికూడా నవ్వకుండా ఉండలేకపోయింది.

గేటుదాటి మోటార్ సైకిల్ ఒక ప్రక్కగా పెట్టి లోపలికి నడవసాగారు. ఎడమ చేతిప్రక్క మామిడి చెట్టు క్రింద చక్రవర్తి కారు వుంది!

"డాక్టర్ యిక్కడే వున్నట్లుందే!" అన్నాడు రవీంద్ర ఆ కారు చూస్తూ. తోటను కలయ జూస్తున్న మాధవి మాటాడలేదు.

"పువ్వులను చూస్తే ఆడవాళ్ళు మైమరచి పోతారుస్మీ. కోపెయ్యకూ!" అంటూ హాస్యం చేశాడు రవీంద్ర.

"మహా చెప్పారు లెండి. నా కామాత్రం మర్యాద తెలియదా!" అంటూనే దూరానికి దృష్టి నిగిడ్చి చూస్తూ మాటలు ఆపేసింది మాధవి. రవీంద్ర దృష్టికూడా అటు తిరిగింది. ఆశ్చర్యపోతూ చూశారు. తామర కొలను ఒడ్డున పూలమొక్కల మధ్య తిన్నెపై చక్రవర్తి సితార్ వాయిస్తూ గొంతెత్తి పాడుతున్నాడు. ఎప్పుడూ ఖరీదైన సూటులో మెడలో నెక్ టైతో పాటు స్టెతస్కోప్‌తో ఉండే అతను నేడు తెల్లటి సిల్కు లాల్చీ, పైజమాలతో నిరాడంబరంగా ఇనుమడించిన అందంతో హుందాగా ఉన్నాడు పరిసరాలను గమనించే స్థితిలో లేనేలేడు. అర్ధనిమీలిత నేత్రాలతో గానంలో లీనమైపోయాడు గాలికి భుజంపై ఎగిరే వుత్తరీయం ఆ గానానికి లయ వేస్తున్నట్లుంది. పురివిప్పి నాట్యమాడే నెమలిలా.

మాట్లాడవద్దని భర్తకు కంటితోనే సైగజేసింది మాధవి. మౌనంగా మరికొంత దూరం నడిచి చక్రవర్తికి కన్పించకుండా అతడికి కొద్ది దూరంలో నాగమల్లి చెట్టుక్రింద కూర్చున్నారు.

భూపాల రాగంలో సాగిపోతూంది గానం. చక్రవర్తి వ్రేళ్ళు తంత్రులను అందంగా మీటుతున్నాయి. ఆ మనోహర గాన తరంగాలకు లయ వేస్తున్నట్లు అందాలు చిందే పూల బాలలు, లే చిగుళ్లు సుందరంగా కదులుతున్నాయి. భావ భరిత తమై, శ్రుతిబద్ధమై విషాద మిళితమై, మనోరంజకమైన ఆ రసపూరిత సంగీతం హృదయాంతరాళంలోని మధుర స్మృతులను స్పృశించి, అవ్యక్త అనురాగాలనూ, అనిర్వచనీయానందాన్నీ సృష్టిస్తూంది. ఆ అమృతగానంలో ప్రకృతీ పరవశించి వనమంతా సోలిపోయినట్లుంది. ఏదో చిత్రమైన సంజ్ఞా రూపంలో వున్న అనూహ్యమైన అవ్యక్తానుభూతి అనుభవమైనది మాధవీ, రవీంద్రులకు, అది మాటలకు అతీతం. విచిత్ర శాంతి గంభీరత లలముకొన్న పరిసరాలు! అందులోనే అస్పష్టంగా దోబూచులాడుచున్న విషాదచ్ఛాయ! అనంతత్వమూ అనిర్వచనీయతా నింపుకొన్న అతీత పరిస్థితి అది.

తారస్థాయి నందుకున్న గానం స్వర్గపు టంచులను చుట్టివచ్చి మెల్లగా ముగిసింది. గానాంబుధిలో మునిగిపోయి స్తబ్ధమైన ప్రకృతి చైతన్యవంతమైనట్లు ఒక్కసారి సుడిగాలి రేగింది. గాలికి రేగిపోతున్న ముంగురులను సవరించుకొంటున్న మాధవి చేతిగాజుల గలగలలు విని తీగల శ్రుతి సరిజూస్తున్న చక్రవర్తి వులిక్కిపడి, ప్రక్కకు తిరిగి చూచాడు.

"హల్లో! గుడీవినింగ్!" అంటూ సంతోషంగా సితార్ ప్రక్కకు నెట్టి లేవబోతూండగా, "ప్లీజ్, లేవకండి. మేమే దగ్గరకు వస్తాం" అంటూ లేచింది మాధవి.

"నేను గొప్ప విద్వాంసుణ్ణి కాకపోయినా చెబుతున్నాను. చాలా బాగుంది మీ గానం" – అన్నాడు రవీంద్ర, చక్రవర్తి ప్రక్కన కూర్చుంటూ, మాట్లాడకుండా శ్రుతి బిగిస్తున్నాడు చక్రవర్తి.

"మరొక్కటి పాడండి" అంది మాధవి చిరునవ్వుతో అర్థిస్తున్నట్లు. చక్రవర్తి మాట మార్చాడు "నేను గమనించ లేదు. మీరు చాలాసేపై వచ్చారా?"

"అప్పుడే మీరు పాట మొదలెట్టారు. మేమూ వచ్చాం. మీ ఏకాంతాన్ని చెదరగొట్టలేదు కదా !" అంది మాధవి.

"ఎంతమాట ! ఇంత ప్రశాంత సమయంలో మీవంటి సహృదయులతో సంభాషించే అదృష్టం సామాన్యులకా ? అన్నట్టు నిన్న విందుకు రాలేదేం మీరు ?"

రవీంద్ర అన్నాడు: "ఆమె తత్వం తెలుసుకదా, చక్రవర్తి, మీకు ! ఇటువంటి సామాజిక కార్యక్రమాలలో ఆవిడ ఎక్కడా కన్పించదు."

"పోనీ మీరు ?"

ఫక్కున నవ్వాడు రవి. "మైడియర్ చక్రవర్తీ, చెప్పానుగా యిదివరకే. నాకూ ఆమెతోనే లోకమని ! ఆమె గాయకి – నేను శ్రోతను. ఆమె రచయిత్రి – నేను విమర్శ కుడను. ఇంకా చెప్పాలంటే ఆమె పాకశాస్త్ర ప్రావీణ్య – నేను భోక్తను, ఇన్నింటిలో యితరాలేమీ అంతగా జ్ఞాపకం ఉండవు మిస్టర్ చక్రవర్తీ" అని యింకా బిగ్గరగా నవ్వుతూ, "మరేమనుకోకండి. మనం సన్నిహితులమైన స్నేహితులం గనుక చెప్పాను" అన్నాడు.

చక్రవర్తి నవ్వలేకపోయాడు. భర్త మాటలకు సిగ్గు పడుతూ తలవాల్చి కూర్చున్న మాధవిని చూస్తూ దీర్ఘంగా నిట్టూర్చాడు. అది మాధవీ రవీంద్ర లిద్దరూ గమనించలేదు.

"రానందుకు మీరు బాగా 'అఫెండ'య్యా రనుకుంటా. ఈసారెప్పుడైనా వస్తాలెండి డాక్టర్. ఇంతకూ ఈ సమయంలో యిక్కడుంటే పేషెంట్లగతేంగాను చక్రవర్తీ!" అనడిగాడు రవీంద్ర.

నీరసంగా నవ్వాడు చక్రవర్తి. "ప్రొద్దున్న ఏడు - తొమ్మిది మధ్య రౌండ్సు పూర్తిచేస్తాను. మళ్ళీ భోజనానంతరం పదినుంచి ఒంటిగంటవరకు డిస్పెన్సరీలో ఉంటాను. టిఫిన్ తీసుకోగానే యిక్కడకు వచ్చేస్తాను. ఇక్కడ నా ఆశ్రమం చూశారుగా ? అయిదారు గంటలవరకు యిక్కడే కాలక్షేపం. ఇప్పుడు మళ్ళీ రౌండ్సు, డిస్పెన్సరీలో తొమ్మిదింటి వరకు ఆ తర్వాత భోజనం; క్లబ్బో, పిక్చరో ఏదో. ఏదో నామకార్థం అవన్నీ కాని, నాకీ తోటలో ఉన్న సుఖశాంతు లెక్కడా వుండవు. చూశారా, యిక్కడే నా సితార్, నా పడక, నవలలు ఇవన్నీని !"

ఆశ్చర్యంగా చూసింది మాధవి. "నిర్మలగారి కిదంతా తెలుసా ?"

"ఇందులో రహస్యంగా ఉంచేదేముంది ? అయినా ఆవిడ సినిమాలకూ, క్లబ్బు విహారాలకూ అడ్డులేక పోవటమే ఆవిడకు కావాలి" అంటూ నిట్టూర్చాడు చక్రవర్తి.

చక్రవర్తిపై అమితమైన జాలికలిగింది మాధవికి, రవీంద్రకుకూడా. ఆతడి బాధలేమిటో, తమ దాంపత్యాన్నత డెందుకంత మెచ్చుకుంటాడో ఇప్పటికి అర్థమైంది వారికి.

"ఆవిడేమో చదువుకోలేదేమో ?" అన్నాడు రవి సంశయిస్తూ.

బలహీనంగా నవ్వాడు చక్రవర్తి. "అక్కడే బ్రదర్, మనం పొరబడుతున్నాం. విరగబాటులో విద్యా ప్రసక్తి లేదు. చదువుంటేనే కాస్తైనా నన్నర్థం చేసుకోగల ఓపికుండేదేమో! అయినా స్వభావాలను చదువులు మార్చగలవా ? ఇంత చదివిన మాధవిగారెలా ఉంటారు?" బాధగా ఎటో చూస్తూ చెప్పుకుపోతున్న చక్రవర్తిగాని, జాలిగా వింటూన్న మాధవికాని, రవీంద్ర కనుబొమ లొక్కసారి ముడివడడం గమనించలేదు.

"ఇంత ఛలాకీగా, సంతోషంగా తిరిగే మీలో యింతటి మనఃక్లేశం దాగివుందనుకోలేదు" అంది సానుభూతిగా మాధవి.

దీర్ఘంగా నిట్టూర్చాడు చక్రవర్తి. "పోనిండి. ఈ బాధలు జీవితాంతం ఉండేవే. మీరు ఒక్క కీర్తన, లేకపోతే ఏదైనా "లైట్ మ్యూజిక్" ఏదైనా సరే పాడండి" అన్నాడు మాధవిని ఉద్దేశించి.

మాధవి మాట్లాడలేదు.

"ఏం రవీంద్రా, మీరు పాడించాలి" అన్నాడు రవీంద్రను చూస్తూ.

నవ్వాడు రవీంద్ర. "ఆవిడచేత ఎవరూ పాడించలేరు. 'మూడ్' కుదిరితే తనంతతానే పాడుతుంది" అన్నాడు మాధవిని ఓరగా చూస్తూ.

తిరిగి "మీ రింకొకటి పాడండి. వినాలనుంది. ఇంతవరకూ మీకు సంగీతం వచ్చునని నాకు తెలియదు" అన్నాడు రవి.

"ఆ సంగతి మన మిత్రు లెవరికీ తెలియదు. కాని ఎందుచేతనో యిప్పుడిహ పాడలేను రవీంద్రా. ఏమనుకోకండి."

"పాడండి నాకూ వినాలనుంది. చాల కృషి చేసి ఉంటారు సంగీతంలో" అంది మాధవి.

నిస్సహాయంగా చూస్తూ "సరే" అని సితార్ చేతిలోకి తీసుకున్నాడు. "ఏం పాట పాడమంటారు?"

"నా కన్నీ యిష్టమే. ఏ రాగం అందమైనా స్వర సాహిత్యాలు పలికించే నేర్పులో ఉందంటాను నేను. ఉత్తమ గాయకుని గాన విషాదమైనా ఆనంద మిళితంగానే ఉంటుంది. చక్కటి సంతోష రాగం కూడ విషాదపు టంచులు తాకుతుంది. ఉత్తమ గానంలో సంతోష విషాదాలు ప్రక్క ప్రక్కల ఉంటాయి."

తృప్తిగా నవ్వాడు చక్రవర్తి. "నిజం చెప్పారు. సంగీతంలో ఇంత జ్ఞానమున్నా మీరు నన్ను మెచ్చుకుంటున్నారా? తప్పక మీ పాట వినాల్సిందే."

కాంభోజి రాగాలాపనచేసి పల్లవి అందుకున్నాడు. "మా జానకి చెట్ట బట్టగా మహారాజు వైతివి" అని పాడుతూ తన్మయుడై పోయాడు చక్రవర్తి. కొద్దిగా విషాద మిళితమైన రాగం, చక్కటి సాహిత్యం. వాటిని చక్రవర్తి స్పష్టంగా ఆలాపించే తీరు చెవులకు ఇంపుగా ఉంది.

"రాజరాజవరా - రాజీవాక్ష..." అనుపల్లవి మధ్య లోనే ఆగిపోయింది. చక్కటి గాత్రం బొంగురుపోయింది. చేతి వేళ్ళు మాత్రం సితార్‌పై తాండవిస్తూనే ఉన్నాయి. చటుక్కున తలెత్తి చూచిన మాధవి నిర్ఘాంతపోతూ రవీంద్రవైపు చూచింది. అతడూ విస్తుపోతున్నాడు, చక్రవర్తి కనుకొలకుల లోని ముత్యాలవంటి నీటి బిందువులను చూచి.

"క్షమించండి" అంటూ సితార్ ప్రక్కన పెట్టి లేచి వెళ్ళిపోయాడు చక్రవర్తి. అది అవధులు దాటిన భక్తి పరవశతా ? లేక ఏదైనా బాధా ? ఎటూ నిర్ణయించుకోలేక పోయారు.

పది నిమిషాల్లో తిరిగి వచ్చాడు చక్రవర్తి, మామిడి కాయలు, సపోటాలు ఉన్న సెజ్జతో, "తీసుకోండి" అన్నాడు చిరునవ్వుతో, వారి ముందుంచి. పూర్వపు విషాదం అతడి ముఖంలో ఛాయామాత్రంగానైనా లేదు ! తిరిగి కూజా కోసం వెళ్ళబోతూంటే "మీరు కూర్చోండి." అంటూ మాధవి లేచి షెడ్‌లోని కూజా తెచ్చి చెరువులో మంచినీళ్ళు ముంచుకు వచ్చింది. మామిడికాయలు తానే ముక్కలు కోసిపెట్టింది. సపోటాలు జాగ్రత్తగా ఒలిచి పెట్టింది.

ఆమె పనులు చూస్తూ, "మీకెన్ని తెలుసు ! ఎంత సేవకైనా హద్దు వుండవద్దూ?" అన్నాడు చక్రవర్తి.

"లేదండీ బాబూ, ఆ హద్దే లేదు. అందుకే నేనానాటి కానాడు ఇలా ఊరిపోతున్నాను. నెలకు పది పౌనులైనా ఎక్కువవుతున్నానేమో యీవిడ వచ్చిన దగ్గర్నుంచీ, మీరు

డాక్టర్ గదా! ఇది తగదని చెప్పండి" అన్నాడు రవీంద్ర సపోటా పళ్ళు తింటూ.

పకపకా నవ్వేశాడు చక్రవర్తి.

"చాల్లెద్దురూ" అంది మాధవి రవీంద్రను మందలింపుగా.

చేతులు చెరువులో కడుక్కుని రెండు అరవిచ్చిన తెల్ల కలువలూ, రెండు తామర పద్మాలూ కోసి తెచ్చుకొంది మాధవి.

"కోసేశావా? ఊఁ, మనచేతు లూరుకోవు" అన్నాడు రవీంద్ర.

"ఫర్వాలేదు. అది ఆడవాళ్ళ జన్మహక్కు" అని చక్రవర్తి నవ్వుతూ తోటమాలిని కేకేశాడు.

"మంచి గులాబీలు, సన్నజాజులు కోసి కార్లో పెట్టరా" అన్నాడు.

"కోసి అమ్మగారికి ఇచ్చే వచ్చాను బాబూ. తల్లో ఎట్టుకుని క్లబ్బుకూడ ఎల్లిపోయారు" అన్నాడు మాలి సవినయంగా.

"తెలుసులేరా, ఈ అమ్మగారికోసం. కోసి కార్లోఉంచు" అన్నాడు చక్రవర్తి నవ్వుతూ.

అప్పుడుగాని తెలియలేదు మాధవికి తనెంత తొందర పని చేసిందో! అతడంటేనే మొదట్లో సద్భావంలేదు. అతడి తోటకు రావడం యిష్టంలేదు. ఒకనాడు అతడు పువ్వులు యిస్తే కోపం తెచ్చుకొన్న తను ఇప్పుడు స్వతంత్రంగా కోసేసింది. ఆ చనువు తీసుకొని అతడింకా ముందుకు పోతే?

"వద్దు డాక్టరుగారూ, అవి చెట్లనుంటేనే అందం. నా కంత మోజులే దా పువ్వులంటే, కోయ్యద్దని చెప్పండి" అంది, కంగారుగా.

"పోనీండి. అంత కంగారు దేనికి? వాజ్‌లో అమర్చుకోందరుగాని, అయినా పువ్వులంటే, నగలంటే యిష్టంలేని ఆడవాళ్ళు కూడానా! నేను 'ఊ' అంటే ఈ తోటలో పువ్వులన్నీ ఒక్కనాడే సింగారం చేసుకుంటుంది మా నిర్మల" అన్నారు డాక్టర్ నవ్వుతూ.

ఇసుకలో ఒత్తిగిలి పడుకోని కలువ పువ్వుతో ఆడుకోంటున్న రవీంద్రకూడా నవ్వేశాడు మాధవితో బాటు.

"ఇహ వెళ్దామా?" అన్నాడు రవీంద్ర, మాధవిని.

"పాట పాడించకుండానే తీసుకువెళ్తారా?" అన్నాడు చక్రవర్తి.

రవీంద్ర మాధవి వైపు చూశాడు. 'హుఁ బొత్తిగా పట్టింపులు లేని మనిషి' అని లోలోన విసుక్కుంది భర్తపై. ఇహ బ్రతిమాలించుకోకుండానే తన శ్రావ్య కంఠంతో పాడడం మొదలెట్టింది.

సంధ్యాసానువులు సాగివస్తున్నాయి. దినిచర్యలో అలసి విశ్రమించబోతున్న భాస్కరునికి జోలపాటలా సాగిపోయింది గానం. హిందూస్థానీ కాఫీరాగం చల్లని పిల్లవాయువులా బయలుదేరి, ఉరకలు వేసే సెలయేరులా సాగిపోయి, కొండల నుండి క్రిందికి జాలువారే జలపాతంలా ముగిసింది. కోయిల కంఠం, వీణలమీటు మేళవించిన కంఠంనుండి ఆవిర్భవించిన ఆ శ్రావ్యగానం వింటూ మైమరచిన చక్రవర్తి, అప్రయత్నంగానే

సితార్ అందుకొని పాట కనుగుణంగా శ్రుతి బిగించి మాధవి గాత్రానుగుణంగా వాయించడం పాటలో లీనమైపోయిన మాధవికూడా గమనించలేదు. కాని రవీంద్ర అది చూచి సహించలేక పోయాడు. ఒక్కసారిగా అతడి మేను ఉలిక్కి పడింది. కాని వెంటనే తనను తాను తమాయించుకొన్నాడు. తనకు చక్రవర్తి సంగతి తెలియనిది కాదుగా! అతడికి భావా వేశం ఎక్కువ, అదీగాక యిద్దరూ సంగీత శాస్త్రం తెలిసిన వాళ్ళు. సాధారణులకే శాస్త్ర తెలిసిన పాట చెవిని పడగానే కూనిరాగం దానంతటదే వచ్చేస్తుందికదా! ఇహ ఇటువంటి వాళ్ళ విషయం చెప్పాలా? ఇంత మాత్రానికే ఇన్ని ఆలో చించిన తను, పెళ్ళయిన క్రొత్తలో 'గానసభలు చేస్తే తప్పే మిటి? కథలు వ్రాయడం వంటిదేకదా!' అని వాదించేవాడు భార్యతో. అనుభవంతో కాని ఏదీ తెలియదంటారు. ఇదే కాబోలు! రవీంద్ర తన ఆవేశానికి తానే చాలా నొచ్చు కొన్నాడు, లోలోన. తన భావాలు ఎక్కడ ముఖంపై వెల్లడవు తాయో నన్న భయంతో ప్రయత్నపూర్వకంగా మందహాసం కొని తెచ్చుకున్నాడు ముఖంపైకి. వద్దను కొంటున్నా వచ్చే చెడు ఆలోచనలను బలవంతంగా అణగద్రొక్కుతూ పాట అయ్యే వరకూ నిగ్రహించుకు కూర్చున్నాడు.

"అద్భుతంగా పాడారు" అని అభినందించాడు చక్రవర్తి. "ముకుళిత హృదయాన్ని వికసింపజేసేదీ జీవనరాగాన్ని తేనె సొనలతో రంగరింప జేసేదీ, భగవంతుని ప్రీతి పరచేదికూడా గానం అనే విషయాన్ని అక్షరాలా ఋజువు చేశారు."

"ఇహ వెళ్దాం" అని త్వరగా లేచాడు రవీంద్ర.

"అవునండీ. ఇహ వెళ్తాం" అంటూ లేచి నమస్కరించింది మాధవి.

"పదండి. నాకూ టైమైంది" అని లేచాడు చక్రవర్తి.

సంధ్యచీకట్లు మెల్లగా అలుముకుంటున్నాయి. పక్షులన్నీ గూళ్ళు చేరుకున్నాయి. అసలే జనసంచారం తక్కువైన బాట మరింత నిర్మానుష్యంగా ఉంది.

మోటార్ సైకిల్ వైపు నడుస్తూన్న రవీంద్ర భుజంపై చెయ్యి వేస్తూ "మిస్టర్, బైక్ మీద నేను వెళ్ళగలను కానీ, చీకటిపడుతోంది. మీరు డ్రైవ్ చేయగలరుగా? కారుమీద వెళ్ళిపోండి" అన్నాడు చక్రవర్తి కారు తాళాలు అందిస్తూ.

"అహ ఎందుకులెండి? వెళ్ళిపోగలం" అన్నాడు రవీంద్ర తాళాలు అందుకోకుండానే చక్రవర్తి అతి మర్యాదకు తట్టుకోలేకుండా ఉన్నాడతడు.

"సందేహించకండి. మనలో మనకు మొహమాటమేమిటి? శ్రీమతితో కలిసి లక్షణంగా కార్లో వెళ్ళండి. అసలు మీకో కారు-డాలి రవీంద్రా కొనేయకూడదూ?"

"నేనూ అదే ఆలోచిస్తున్నాను" అంటూ తాళాలు తీసుకుని కారుఎక్కాడు రవీంద్ర. మాధవి మౌనంగా వెళ్ళి అతడి ప్రక్కన కూర్చుంది.

"పూలపొట్లం, పళ్లు కారుడాష్‌బోర్డులో ఉన్నాయి" అని చెబుతూ తాను మోటార్‌సైకిలెక్కి స్టార్టుచేశాడు చక్రవర్తి

తారురోడ్డుపై కారూ, సైకిలూ ఒకదాని వెనుక ఒకటి సాగిపోయి టౌను ప్రవేశించగానే చెరోవైపుకూ చీలిపోయాయి.

రాత్రి భోజన మవగానే పడుకున్నాడు రవీంద్ర. ఎదురుగా గోడవార డ్రెస్సింగ్ టేబుల్ దగ్గర కూర్చొని సన్నజాజులు తలలో అమర్చుకుంటూంది మాధవి. అంతలో టెలిఫోన్ బెల్ మ్రోగింది. మాధవి లేచి రిసీవర్ అందుకొంది. అటువైపు చక్రవర్తి కంఠం పలికింది. మాధవి మాట్లాడకుండా రవీంద్రతో చెప్పింది, చక్రవర్తి పిలుస్తున్నాడని

"హుఁ ఇంతవరకూ కలిసే వున్నాంగా ? అప్పుడే యేమొచ్చింది ?" విసుక్కొంటూ ప్రక్కమీంచి లేచాడు రవీంద్ర.

చక్రవర్తి నామం వినగానే పొంగిపోయే రవీంద్రలో ఈ మార్పేమిటో గ్రహించలేక విస్తుపోయింది మాధవి.

"హల్లో భోజనమైందా!" అని అడిగాడు రవీంద్ర.

ఫోన్‌లోనే బిగ్గరగా నవ్వాడు డాక్టర్. "అయితే మీరు భోంచేసి హాయిగా శయనించారన్నమాట ! డాక్టర్లకి తిండీ, నిద్రా యేమిటి మిష్టర్ ? నేనింకా డిస్పెన్సరీలోనే ఉన్నాను. ఇప్పుడొక ఆపరేషన్ ఉంది. అందుచేత నా 'స్టాఫ్' అంతాకూడా తీరికలేకుండా ఉంటారు. ఎవర్నీ పంపించలేను. కాస్త మీ కాంపౌండ్‌లో వుంచేయండి. ఉదయమే తీసుకుంటాను."

"సారీ! యింకా పనిచేస్తూనే ఉన్నారన్నమాట ! పోనీ. అవసరమైతే చెప్పండి, నేనే కాస్త తీసుకు వస్తాను. యింకా పడుకోలేదు.

"వద్దు, వద్దు. మీరు శ్రమపడకండి గుడ్‌నైట్."

"గుడ్‌నైట్."

౬

మర్నాడు ఉదయమే దిగాడు చక్రవర్తి. మోటార్ సైకిల్ మెట్లకు ఆన్చి, బూట్ టకటక లాడించుకొంటూ, చేతిలో హేట్ ఊపుతూ ఠీవిగా నడిచి వస్తూన్న ఆ విగ్రహాన్ని. ఫ్లవర్ వేజ్ సర్దుతూన్న మాధవి చూస్తూ ఉండిపోయింది. అతడి నిన్నటి వాలకానికి, ఈ వేషానికీ ఎంత తేడా! నీలిరంగు ఫుల్ ట్వీడ్ సూట్‌లో ఉన్నాడు. మందార రంగు టై, అతని నొక్కుల జుట్టుతో బాటు గాలికి చలిస్తూంది. అందమైన విశాల నేత్రాలలో నిన్నటి విషాదం ఛాయామాత్రంగా కూడా లేదు.

"మిస్టర్ రవీ!" అని పిలుస్తూ హాల్లో అడుగుపెట్టిన చక్రవర్తి. సోఫాలో క్రొత్త మనిషిని చూచి ఆగిపోయాడు.

"వచ్చి కూర్చోండి డాక్టర్. ఆయన స్నానం చేస్తున్నారు" అంది మాధవి.

ఒక్కక్షణం పరికాయించి చూచి, "హల్లో శ్రీధర్, ఇక్కడున్నావేమిటి?" అన్నాడు డాక్టర్ ఆ క్రొత్త వ్యక్తితో కరచాలనం చేస్తూ.

"ఓ, చక్రవర్తీ! రా. కూర్చో" అంటూ శ్రీధర్ మర్యాద చేశాడు.

"ఇంతకూ నువ్వు..." అని ప్రశ్నార్థకంగా చూచాడు. చక్రవర్తి.

"ఓ! నీకు తెలియదా? మధూ, నీకూ తెలియదా ఈయనెవరో?" అన్నాడు శ్రీధర్.

"అదేమిటన్నయ్యా ? మీ బావగారికి ముఖ్య స్నేహితులు" అంది మాధవి వింతగా చూస్తూ.

బిగ్గరగా నవ్వాడు శ్రీధర్. "స్నేహాలు సరేనమ్మా. మనం బంధువులం కూడా. మీ వదినా, నిర్మలా అక్కాచెల్లెళ్ళు అవుతారు తెలుసా ? మీ వదిన పినతండ్రి కూతురే నిర్మల."

"అలాగా!" అంది ఆశ్చర్యపోతూ మాధవి. "నీ పెళ్ళి కావిడి రానట్లుంది. నా పెళ్ళయిన తర్వాత మళ్ళీ నేనసలు అక్కడికి రానేలేదు. అందుచేత నాకీ బంధుత్వా లేమీ తెలియవు."

"అలాగా ! అయితే మనం చాలా దగ్గర బంధువుల మన్నమాట!" అంటూ అప్పుడే హాల్లోకి వస్తూన్న రవీంద్రను చూచి, "రావోయ్, బావా, రా, ఇంత దగ్గరగా ఉండికూడ తెలుసుకోలేక పోయాం. ఇహ యీ అండీ గిండీలు కొట్టిపారెయ్యాలి" అన్నాడు చక్రవర్తి. విషయం తెలుసుకొన్న రవీంద్రకూడా చాలా సంతోషించాడు.

"అయితే శ్రీధరం బావ రాకవల్ల మనం మరింత సన్నిహితులయ్యా మన్నమాట !" అన్నాడు రవి, డాక్టర్ భుజం తట్టుతూ.

అందరికీ కాఫీ టిఫిన్‌లు యిచ్చింది మాధవి.

"భోజనాలు మాయింట్లో ఏర్పాటు చేస్తాను. అందరూ అక్కడకే వచ్చెయ్యాలి శ్రీధర్. వింటున్నావా రవీంద్రా ?" అన్నాడు చక్రవర్తి.

"అదేమిటి ? రాక రాక అన్నయ్య వస్తే మీా యింటికి పంపగలనా ?" అంది మాధవి.

"నేనూ అన్నయ్యనేగా ?" అని మళ్ళీ నాలుక కరచుకొన్నాడు చక్రవర్తి. కాని మాటల సందడిలో అదెవరూ గమనించలేదు.

"ఏమనుకోకు చక్రవర్తీ, నాకు సెలవులేదు. ఈరోజే వెళ్ళిపోవాలనుకొంటున్నాను. మరెప్పుడైనా తీరిగ్గావచ్చి మీా యింట్లోనే తిష్ట వేసేస్తాను" అన్నాడు శ్రీధర్ నవ్వుతూ.

"ఇంత త్వరగా వెళ్ళిపోవట మేమిటి ? ఏం పనిమీాద వచ్చా వసలు ?" అనడిగాడు చక్రవర్తి.

నవ్వాడు శ్రీధర్. "పనేం లేదయ్యా. మధు పెళ్ళయిన తర్వాత మళ్ళీ యిదే చూడ్డం దాన్ని. ఒంట్లో బాగుండటం లేదని ఆమధ్య వ్రాసింది రాలేకపోయాను. తీసికెళ్ళి ఓ నెల పోయాక పంపిద్దామనుకుంటే, బావగారు ఒప్పుకోవడం లేదు. ఏడో నెలను ఏకంగా పురిటికే తీసుకెళ్ళ మంటున్నారు. స్నేహితుడవుకదా; కాస్త నచ్చచెప్పుదూ."

ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేశాడు చక్రవర్తి. "అలాగా ! అయితే మాష్టర్ రవీంద్ర అవతరించబోతున్నాడన్నమాట ! ఇంతటి శుభవార్త యిన్నాళ్ళు రహస్యంగా ఎలా ఉంచారయ్యా రవీంద్రా, మాకో టీపార్టీ అయినా లేకుండా ? ఇవ్వాళ నాకు సర్వాధికారాలూ ఉన్నాయైతే, మరో కప్పు కాఫీ డిమాండ్ చేస్తున్నాను."

అంతా నవ్వారు. "పోనీ కూజాతో తీసుకురా మాధవీ ! చక్రవర్తిది కాస్త పెద్ద పట్టు" అన్నాడు రవీంద్ర.

నవ్వుతూ లేచింది మాధవి. కాఫీ అందిస్తూ, "నిర్మల గారిని తీసుకుని భోజనాల కిక్కడికే వచ్చేయ్యండి. అంతా సరదాగా గడపవచ్చు. సాయంత్రం అన్నయ్య వెళ్ళిపోతాడట" అంది మాధవి.

"అలాగే. అయితే మీరు వెళ్ళడం లేదా ?"

నవ్వి ఊరుకుంది మాధవి.

"ఇప్పుడు సరేసరి. పురిటికైనా వస్తుందనే నమ్మకం లేదు నాకు. బావగారు సక్రమంగా ఆఫీసుకు వెళ్తున్నట్లేనా ?" అన్నాడు శ్రీధర్ హాస్యంగా.

చక్రవర్తి బిగ్గరగా నవ్వేస్తూ, "అదృష్టవంతులు. పోనీ. వాళ్ళని విడదీసే పాపం మన కెందుకు ? ఎక్కడైనా సుఖంగా ఉండడమేగా కావాలి !" అని లేచాడు.

"భోజనాని కిక్కడికే రావాలి" అని సాగనంపి వచ్చాడు రవీంద్ర.

భోజనాలకు వచ్చిన నిర్మలను ఆహ్వానిస్తూ, "మీ పుట్టిన రోజు పండుగ విందుకు రానందుకేమీ అనుకోలేదు కదా !" అంది మాధవి.

"ఎవరు మాత్రం అనుకోరు ? ఇప్పుడొచ్చానంటే మా బావగారి కోసం రావలిసొచ్చింది" అంది నిర్మల నిర్మొహ మాటంగా. ఆ జవాబుకు అంతా విస్తుపోయారు. చక్రవర్తి ముఖం సిగ్గుతో కందగడ్డ అయింది. నిర్మల ఉన్నంతసేపూ చాలావరకు శ్రీధర్‌తోనే బంధువుల విషయాలూ అవీ మాట్లాడుతూ గడిపింది.

సాయంకాలం శ్రీధర్‌ను స్టేషన్‌కు సాగనంపి తిరుగు ముఖం పట్టారు అందరూ.

"ఇంటికి వెళ్ళి యిప్పుడు చేసేదేముంది? ఏ పిక్చర్‌కైనా పోతే బాగుండును. అంది నిర్మల.

"పోనీ తోటకు పోదామా?" అన్నాడు చక్రవర్తి.

"తోటలో ఏం తోస్తుంది? చెత్త" అంది నిర్మల.

రవీంద్ర అందుకున్నాడు. "న్యూథియేటర్‌లో డ్యాన్సుకు మనందరికీ ఉదయమే టికెట్లు రిజర్వ్ చేయించాను. అక్కడికి పోదాం."

నిర్మల చాలా సంతోషంగా ఒప్పుకొంది.

"మీ పాపాయి చాలా మంచివా డన్నమాట! మాకు యిప్పుడే పార్టీలు, వినోదాలు కల్పిస్తున్నాడు" అని హాస్యం చేస్తూ పరాకుగా నిల్చున్న మాధవిని, "కారు ఎక్కండి" అని హెచ్చరిస్తూ తలుపు తీశాడు చక్రవర్తి.

మాధవి, "నన్ను ఇంటిదగ్గర దింపేసి, మీరంతా వెళ్ళండి డాక్టర్‌గారూ" అంది. మిగతా ముగ్గురూ ఆమె వంక అదో మాదిరిగా చూశారు. చక్రవర్తికి మాధవి ముఖంలో స్పష్టంగా అలసత్వం కన్పించింది. ఏదో అనబోతుండగా రవీంద్ర కటువుగా "ఎందుచేత?" అన్నాడు.

"నాకు కొంచెం నీరసంగా వుంది" అంది మాధవి. కంఠం నీరసంగానే పలికింది. కాని అతడది గమనించ లేకపోయాడు.

"నాకు తెలుసు. నువ్వసలు నలుగురితో కలిసి తిరగ లేవు. అదే నీ నీరసం."

భర్త కటు వచనాలకు మాధవి నిర్వేరబోయింది వచ్చే నవ్వు ఆపుకొంటూ నిర్మల ఎటో చూస్తూ కూర్చుంది. ఏమో చెప్పబోయి మళ్ళీ తటపటాయిస్తూ ఆగిపోయాడు చక్రవర్తి. ఒక్కసారి మాధవిని జాలిగా చూస్తూ కారు స్టార్టు చేశాడు.

చక్రవర్తి అనేక విధాలుగా పరిస్థితిని సరస మార్గానికి తేవాలని ప్రయత్నించి, విఫలుడయ్యాడు. డ్యాన్సు కార్యక్రమం జరిగిన మూడు గంటలకాలంకూడా మాధవి కుర్చీ వెనుకకు వాలి మౌనంగా కూర్చుంది. ఆమె కోపంతో మాట్లాడటం లేదని భావించి రవి మౌనం దాల్చాడు.

"ఇంత అనుకూలమైన జంట అంత ఎడ మొహం పెడ మొహాలుగా వున్నారేం?" అంది నిర్మల మెల్లగా చక్రవర్తి చెవిలో.

"కట్టిపెట్టు నీ ధోరణి. బొత్తిగా సమయ సందర్భాలు తెలియవు." కోపంగా మందలించాడు చక్రవర్తి.

కాఫీలు తెప్పించాడు రవీంద్ర. మాధవి వద్దని మెల్లగా చెప్పింది. అది చూచిన చక్రవర్తి బయటకు వెళ్ళి కూల్‌డ్రింక్ పట్టించుకు వచ్చాడు. మౌనంగా స్వీకరించింది మాధవి. రవి ముఖం త్రిప్పుకున్నాడు.

రవీంద్రతో కబుర్లు చెబుతూ కారు దగ్గరకు నడుస్తూ ఉన్న చక్రవర్తి, త్వరగా ముందుకు పరుగెత్తి, తూలి పడిపోబోతూన్న మాధవిని బలంగా పట్టుకొని ఆపాడు. రవీంద్ర కూడా ఆతురతగా పరుగెట్టుకొచ్చాడు—"ఏమైంది?" అంటూ

"ఏం లేదు. కొద్దిగా కళ్ళు తిరిగాయి" అంది నీరసంగా మాధవి. కారువరకు చక్రవర్తే పట్టుకు నడిపించి, వెనక తలుపు తీసి పడుకోబెట్టాడు. ప్రక్కనేవున్న రెస్టారెంటులో నీళ్లు తెచ్చి ముఖం తుడిచాడు. మెల్లగా లేవబోయింది మాధవి.

"లేవద్దు, పడుకోండి" అంటూ కర్చీఫ్‌తో మాధవి ముఖం ఒత్తుతూ, "రా, నిర్మలా, కొంచెం సర్దుకు కూర్చో, జాగ్రత్తగా చూడు" అంటూ నిర్మలను ఎక్కించి తలుపు వేసే శాడు చక్రవర్తి.

రవీంద్ర భుజం తట్టుతూ, "ఫర్వాలేదోయ్. కొంచెం నీరసం - అంతే. రా, త్వరగా ఎక్కు" అంటూ స్టీరింగ్ ముందు కూర్చున్నాడు డాక్టర్. రవీంద్ర మౌనంగా చక్రవర్తి ప్రక్కన కూర్చున్నాడు. అతని మనస్సేమిటో అతనికే తెలియని స్థితిలో వుంది. ఏవో భావాలు, ఉద్రేకాలు పోటీ పడు తున్నాయి.

ట్రాఫిక్ రూల్సుకూడ లెక్కచేయకుండా ఎనభై మైళ్ళ వేగంలో పరుగెడుతూ కారు డిస్పెన్సరీ ముందు ఆగింది.

"ఒకసారి దిగి రాగలరా ? ఇంజెక్షన్ చేస్తాను" అన్నాడు చక్రవర్తి మాధవితో.

"వద్దండీ. ఇప్పుడే మవసరంలేదు. ఇంటిదగ్గర దిగబెట్టే యండి త్వరగా" అంది మాధవి.

"పోనీ, ఇప్పుడే వస్తాను. ఒక క్షణం ఆగండి" అని లోనికి వెళుతూ, ఇంట్లోకి వెళ్ళిపోతున్న నిర్మలను, "వెళ్ళి పోకు నిర్మలా. వాళ్ళను దిగబెట్టి వచ్చేద్దాం" అన్నాడు.

"నాకు పనుంది. అయినా నే నెందుకు ?" అని విసురుగా వెళ్ళిపోయింది లోపలకు నిర్మల. చక్రవర్తి మాట్లాడలేదు. లోపలినుండి ఒక నర్సునూ, కాంపౌడరునూ వెంటబెట్టుకొని వచ్చాడు కారు దగ్గరకు. లేవబోతున్న మాధవిని వద్దని వారిస్తూ గ్లూకోజ్ ఇంజెక్షనిచ్చేసి, సిరెంజి కాంపౌడరుకు ఇచ్చేశాడు. నర్సునుగూడా కారెక్కమని, ఇంజన్ స్టార్టుచేస్తూ, "ఇప్పుడే వచ్చేస్తాను" అని కాంపౌడరుకు చెప్పి బయల్దేరదీశాడు కారు.

రవీంద్ర ఇంటి కాంపౌండులో ఆగింది కారు. మౌనంగా దిగి తాళాలుతీసి, లైట్లువేసి హాల్లోకి వచ్చాడు రవీంద్ర. నర్సు సహాయంతో లోపలికి వెళ్ళిపోయింది మాధవి.

చక్రవర్తి గదిలోకివస్తూ, "సుఖంగా నిద్రపోండి. గాభరా లేదు ఇటువంటి లక్షణాలు మామూలే. అవసరమైతే నర్సును మీకు తోడు ఉంచుతాను" అన్నాడు.

నీరసంగా నవ్వింది మాధవి. "థాంక్స్. నర్సు అవసరం లేదులెండి. మీకీవాళ చాల శ్రమ కలిగించాను."

"లేదు, లేదు. అది నా వృత్తి ధర్మం. అందులోనూ చెల్లెలి విషయంలో...శ్రమ ఏమిటి ?" అంటూ మెల్లగా బయటికి నడిచాడు.

హాల్లోనుంచి యీ సంభాషణ అంతా విన్న రవీంద్ర గతుక్కుమన్నాడు. మేఘాచ్ఛాదితమైన మనస్సు తేలికైనట్లయింది కారు వరకూ చక్రవర్తి వెంట వెళ్ళాడు.

కారెక్కబోతున్న చక్రవర్తి రవీంద్ర భుజంపై చేయి వేస్తూ, "చూడు, రవీంద్రా, చనువు తీసుకుని చెబుతున్నానని

ఏమీ అనుకోవద్దు. ఈవేళ నీ మనస్సెందుకు బాగుండలేదో నాకు తెలియదు. కాని, ఇటువంటి ఆవేశాలు ఆరోగ్యకరం కాదు. ఈస్థితిలో ఆమెను ఎంత సంతోషంగా ఉంచగలిగితే అంత మంచిది. రకరకాల కోరికలు కలుగుతాయి. లేదా యిష్టమైన రీతిగా ఉండాలనుంటుంది అది సహజం. వీలైనంత వరకూ నొప్పించకుండా ప్రవర్తించడం నీవిధి. ఇంతగా చెప్పినందుకు ఏమీ అనుకోవని తలుస్తాను."

బరువుగా ఊపిరి పీల్చాడు రవి "అవును, చక్రవర్తీ. క్షమించు. నా ప్రవర్తన నాకే సిగ్గుగా వుంది. అలాగే ప్రయత్నిస్తాను" అంటూ డాక్టర్ చేయి చేతిలోనికి తీసుకొని నొక్కాడు.

చక్రవర్తి ముఖం విప్పారింది. "సంతోషం. నేను మళ్ళీ ఉదయం వచ్చి చూస్తాను. గుడ్ నైట్."

"గుడ్ నైట్".

తల నిమురుతున్న స్పర్శకు నీరసంగా కళ్ళెత్తి చూచింది మాధవి. రవీంద్ర ప్రక్కన కూర్చుని వున్నాడు.

"మాధవీ, ఎలా వుందిపుడు?" మెల్లగా ప్రశ్నించాడు.

"బాగానే వుంది. చాలా ప్రొద్దుపోయింది. మీరు భోజనం చేయరూ?"

"హుఁ! నాభోజనం, నాబ్రతుకే నాకు ముఖ్యమనుకొన్నావా మాధవీ? ఇవాళ నాప్రవర్తనతో ఒక్కొక పశువుగా జమకట్టి వుంటావు."

"లేదు, లేదు" నొచ్చుకుంటూ అంది "ఒక్కొకరోజు లేచిన వేళావిశేషం అటువంటిది. మీరేం చేశారు గనుక? మరిచిపోదాం."

"నువ్వెంత మంచిదానవు మాధవీ? ఎప్పటి కప్పుడు నేనే నిన్నర్థం చేసుకోకుండా ఉన్నాను". లేచి శాలువా కప్పి వెళ్ళబోతూ "మరి నువ్వు? కొంచం కాఫీ యివ్వనా?" అని అడిగాడు.

"వద్దు వద్దు. కాఫీ చూస్తేనే వికారంగా ఉంది నాకు. ఇలాగే పడుకొంటాను."

ఇందాక కాఫీ త్రాగని కారణం తెలిసి మరింత పశ్చాత్తాప పడ్డాడు రవీంద్ర. "పోనీ కొద్దిగా పళ్ళ రసమైనా తీసుకో"మని బలవంతంగా త్రాగించాడు రవీంద్ర. "సమయానికి చక్రవర్తి ఉండకపోతే ఈవేళ ఏం జరిగేదో, ఎంత దెబ్బ తగులునో!" అని మాధవి నుదురు నిమురుతూ ఆమె చెంతనే కూర్చుండిపోయాడు. పసిపిల్లలా నిద్రపోయింది మాధవి. కాని రవీంద్ర నిశ్చింతగా పడుకోలేకపోయాడు. ఆ రోజు జరిగిన సంగతులన్నీ అతడి మనస్సును చీకాకు పెట్టే స్తున్నాయి. చక్రవర్తి, మాధవి రెండు భుజాలూ పట్టి పడ కుండా ఆపుచేయడం, ఆమెకు శ్రద్ధగా చేసిన సేవాదృశ్యాలు, అతడిని వద్దనుకొన్నా, తేళ్ళూ, జెర్రులూ కుట్టినట్లు బాధ పెడుతున్నాయి. అతడి సహృదయం సరిపెట్టుకో జూచినా పురుషాహంకారం మండిపడుతూంది.



అనేకమైన కలతలనూ, బాధలనూ మరపింపజేసే నిద్ర—మాన వులకు ప్రకృతి ప్రసాదించిన దివ్యౌషధం. పగలంతా పలు

రకాలుగా కలత బారిన సరస్సు, ప్రాతఃకాలానికి కలక దేరి, ప్రశాంతంగా నిర్మలంగా నిలచి ఉన్నట్టే, రకరకాల ఆలోచనలతో, బాధలతో సతమతమై, నిద్రాదేవి ఒడిలో విశ్రాంతి నొందిన మానవులు సాధారణ బాధలు, కలకలు కడుక్కుపోయి, నిర్మల హృదయాలతో నిద్ర లేస్తారు. ఉదయం రవీంద్ర నిద్ర లేచేసరికే మాధవి తన దినచర్యలలో లీనమై ఉంది. భర్తకు చిరునవ్వుతో కాఫీ అందించింది. ఆమెను చేయి పట్టుకు కూర్చొబెడుతూ, "కులాసాగా వుందా?" అనడిగాడు రవీంద్ర. సిగ్గుతో తల ఊపింది మాధవి.

"ఒక వంటమనిషిని కుదుర్చుదా మనుకొంటున్నాను మాధవీ. ఇక నువ్వింత శ్రమపడటం నాకిష్టంలేదు."

ఆశ్చర్యంగా చూచింది. "ఎందుకు? నాకేం శ్రమలేదు. అయినా వాళ్ళకు చెప్పి చెప్పి చేయించుకోవడం, దుబారా కాకుండా చూచుకోవడం యింతకంటె శ్రమ. చేసుకోవడమే తేలిక నాకు !"

"సరే, నీయిష్టం" అంటూండగానే క్రింద చక్రవర్తి కారు హారన్ విన్పించింది.

ఇద్దరూ లేచి వెళ్ళి చక్రవర్తిని చిరునవ్వుతో ఆహ్వానించారు.

"నీరసం తగ్గిందా? బాగా నిద్రపోయారా రాత్రి?" అన్న చక్రవర్తి ప్రశ్నకు చిరునవ్వుతో సమాధానం ఇచ్చింది, మాధవి.

"మీ శ్రమ ఊరికే పోతుందా?" అన్నాడు రవీంద్ర నవ్వుతూ.

"నాదేముంది కాని, ఇహ అంతగా శ్రమ పడటం మంచిది కాదు. పళ్ళరసం ఎక్కువగా తీసుకోవాలి. కథలు కావ్యాలు వ్రాస్తూ రకరకాల ఆలోచనలు కల్పించుకోక విశ్రాంతి ఎక్కువగా తీసుకోవాలి" అన్నాడు చక్రవర్తి మందహాసంతో.

రవీంద్ర నవ్వుతూ "మాధవీ చూశావా? పాపాయి యిప్పుడే నీ పనుల కడ్డువచ్చి విసిగిస్తున్నాడు!" అన్నాడు.

మాధవి సిగ్గుతో ముడుచుకుపోయింది. చక్రవర్తి బిగ్గరగా నవ్వుతూ, "బలే చతురుడవయ్యా బావా! మరి నేను వస్తాను" అంటూ లేచాడు.

"కూర్చో చక్రవర్తి. నీతో విషయం చెప్పాలి" అని డాక్టర్ని ఆపుచేశాడు రవీంద్ర. "మాధవీ, డాక్టరికి కాఫీ తీసుకురా" అని పంపేశాడు.

"సంగ తేమిటి రవీంద్రా?" అని అడిగాడు చక్రవర్తి.

"మా ఆఫీసు హెడ్ క్వార్టర్సునుంచి రాత్రి వైరు వచ్చింది. అక్కడ కొన్ని ఫైల్సు నేను స్వయంగా తనిఖీ చేయవలసి ఉంది. నా అసిస్టెంటుతో సహా యీ సాయంత్రమే వెళ్ళిపోవాలి నేను" అని ఆగాడు రవీంద్ర.

"అయితే?"

"మాధవి విషయమే నాకేం తోచటంలేదు, నేనక్కడెన్నాళ్ళుండాలో నాకే తెలియదు. పది పదిహేను రోజులు కూడా పట్టవచ్చు. ఇదివరకెక్కడి కెళ్ళినా ఇద్దరం వెళ్ళిపోయే వాళ్ళం. సరదాగా ఊళ్ళన్నీ చూచి వచ్చేవాళ్ళం. మరి యిప్పుడామె ప్రయాణం చేయగల స్థితిలో ఉందంటావా?"

"వద్దు. ఆ పని మాత్రం చేయకు. ఇప్పుడామె ఏమాత్రం శ్రమను ఓర్చుకోలేదు. ఇక్కడుంచేస్తే రేం?"

"అసలే మొహమాటం మనిషి. ఏ బాధా పైకి చెప్పుకోదు. ఒక్క రాత్రిసీ విడిచి ఎలా వెళ్ళను? నిన్న వాళ్ళన్నయ్యతో కూడా పంపక పోవడం చాలా పొరపాటైపోయింది."

"పంపకపోవడమే మేలైంది. ఈ నీరసం ట్రెయిన్‌లో వచ్చిఉంటే ఏది దారి? కానీ, రవీంద్రా, నువ్వేమనుకోనంటే ఒక విషయం. ఆమె ఒంటరి దెలాగవుతుంది ? నేనుమాత్రం పరాయివాడినా ?"

"సారీ, క్షమించాలి. నిర్మలకూ మాధవికీ అంత సఖ్యత లేదనుకుంటాను!" అన్నాడు రవీంద్ర తల వంచుకొని.

ఒక్కక్షణం చక్రవర్తి ముఖం వాడిపోయి తేరుకుంది.

"నిర్మల ప్రమేయ మేముంది రవీంద్రా? నేనున్నాను. నా నర్సులు ఉన్నారు. నువ్వుతిరిగి వచ్చాక ఆమెను పదిలంగా అప్పజెప్పే బాధ్యత నాది. సంతోషంగా వెళ్ళిరా" అని రవీంద్ర భుజం తట్టుతూ లేచాడు చక్రవర్తి.

"థాంక్స్. అయితే ఇహ నాకేం భయమూలేదు." చక్రవర్తిని సాగనంపి వచ్చి సూట్‌కేస్ సర్దుకుంటున్నాడు రవీంద్ర.

మాధవి వచ్చి వెనుక నిల్చోవడం అతను గమనించలేదు.

"కాఫీ ఇవ్వకుండానే డాక్టర్ని సాగనంపేశారేమిటి?" అంది మాధవి అయోమయంగా.

"స్. అరెరే! మాటల్లో నేనూ మరచిపోయాను" అన్నాడు రవీంద్ర, నాలుక కరచుకుంటూ.

"పోనీండి కాని, ఈసర్దుబాటంతా దేనికి?" అనడిగింది ఆశ్చర్యంగా.

పెట్టె తాళంవేసి సోఫాలో కూర్చుంటూ చెప్పాడు విషయం. ఆశ్చర్యం, అనుమానం కలిసి ఆమె కళ్ళు చలించాయి. "ఇంతవరకూ నాకు తెలియదే మరి!"

"అవును. రాత్రి టెలిగ్రాం వచ్చేటప్పటికి నువ్వు మంచి నిద్రలో ఉన్నావు."

అయితే త్వరగా పనులు ముగించి నేను కూడా తయారౌతాను" అంటూ లేచిన మాధవిని పట్టుకుని కూర్చో బెట్టాడు రవీంద్ర.

"నువ్వెలా వస్తావు. మాధవీ, ఈ స్థితిలో! ఏమైనా ఆలోచించావా !"

"మరెలా?"

"ఫర్వాలేదు. ఒకవారం పదిరోజుల్లో వచ్చేయనూ? వెళ్ళగానే ఉత్తరం వ్రాస్తాను వివరంగా. నువ్విక్కడ జాగ్రత్తగా వుండు."

"అమ్మొయ్యో ! నేనొక్కర్తెనూ వుండడమే ? ఫర్వాలేదు. నేనూ రాగలను."

జాలిగా చూచాడు రవి. "అలా మంకుపట్టు పట్టకు మాధవీ. నిన్నొదిలి వెళ్ళడం నాకు మాత్రం యిష్టమా! కాని పరిస్థితి అటువంటిది. చక్రవర్తితో చెప్పాను. నీకేం

భయంలేదు. వచ్చి చూస్తూంటాడు. పనిమనిషి తోడుగా అట్టిపెట్టుకో రాత్రిళ్ళు. ఆఫీస్ ప్ల్యాన్‌ను కూడా నేనొచ్చే వరకూ యిక్కడే పడుకోమని చెప్తాను."

"ఏమో నా కేమిటో భయంగా ఉంది."

"ఎప్పుడూ వదిలి ఉండకపోబట్టి అలాగే ఉంటుంది మరి. రెండురోజులకు అదే అలవాటైపోతుంది. ఇదివరకంత స్వేచ్ఛగా తిరగ్గలమా చెప్పు ? అంతకంతకు సంసారం పెద్ద దౌతుంది!" అన్నాడు బుగ్గమీద చిటికెవేస్తూ చిరునవ్వుతో.

మాధవి నవ్వలేదు. అక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది భారంగా.

స్టేషన్‌కు వెళ్ళేముందు చక్రవర్తికి ఫోన్ చేశాడు రవీంద్ర, మాధవి విషయమై హెచ్చరిస్తూ. "నేనే వస్తున్నాను. ఆగు" అన్నాడు చక్రవర్తి.

"చక్రవర్తి వస్తున్నాడట. కార్లో వెళ్ళిపోదాం స్టేషనుకు. నువ్వూరా" అన్నాడు భార్యతో రవీంద్ర.

"వచ్చేస్తాడో మరి?" అంది మాధవి సంశయంగా.

"ఏం ? కారు నేపట్టుకుపోతానా ?" అన్నాడు విసుగ్గా.

"అది కాదండీ..."

"ఏది కాదు? అన్నీ అనుమానాలే. ముద్దుగా రమ్మంటే అర్థం చేసుకోవు."

"పోనిద్దురూ, నా కసలు ఓపికా లేదు. జాగ్రత్తగా వెళ్ళిరండి" అంది చేరుమాలు అందిస్తూ.

"ఇక్కడికే రాలేని దానవు అక్కడ కెలా వస్తానన్నావ్? పోనీ, నీ యిష్టం. కానీ నువ్వు నీ ఆరోగ్యం శ్రద్ధగా చూచుకోవాలి. ఏ మాత్రం నిర్లక్ష్యం పనికిరాదు. ఏమన్నా ఉంటే చక్రవర్తితో చెప్ప సిగ్గుపడకు."

క్రింద చక్రవర్తి కారు హారన్ విన్పించింది. వెనుక సీట్‌లో చక్రవర్తి ఉన్నాడు. స్టీరింగ్ దగ్గర డ్రైవర్ ఉన్నాడు.

"టాక్సీలో పోదునుగదా చక్రవర్తీ?" అన్నాడు రవీంద్ర స్నేహం ఉట్టిపడే కంఠంతో.

"ఇంత మహా పట్టణంలో బంధువులమంటూ ఉండి యింకెందుకు గావా మరి?" చక్రవర్తి మాటలకు రవీంద్ర హృదయం ద్రవించి పోయింది.

మాధవిని మరోకసారి హెచ్చరిస్తూ కారెక్కాడు రవీంద్ర.

"మీరు రారా?" అనడిగాడు చక్రవర్తి మాధవిని.

"రాలేను" అంటూండగానే కారు బయలుదేరింది. "వెళ్ళగానే ఉత్తరం వ్రాయండి." అన్నది.

ట్రెయిన్ కదలబోతుండగా చక్రవర్తి దిగిపోయాడు. "మాధవిది చాలా సిగ్గుపడే స్వభావం. జాగ్రత్తగా చూచుకుంటావ్ కదూ? నిన్ను చాలా శ్రమ పెడుతున్నాను" అన్నాడు రవీంద్ర, చక్రవర్తి చెయ్యిపట్టుకుని.

"నిశ్చింతగా ఉండు. నేను వ్రాస్తూంటానుగా?" చక్రవర్తి అంటూండగానే ట్రెయిన్ కదిలింది.

"మాధవితో వెళ్ళానని చెప్పు." చెయ్యి ఊపాడు రవీంద్ర.

చిరునవ్వుతో తల ఊపాడు చక్రవర్తి. 'ఏమి అనో న్యత!' తలుచుకొంటేనే అతడి కళ్లు చెమర్చుతున్నాయి.

కారు వచ్చేటప్పటికి గేటులోనే ఎదురైంది మాధవి. "ఇంకా యిక్కడే నిల్చునారా? రవీంద్రను రైలెక్కించి వచ్చాను" అన్నాడు చక్రవర్తి.

"థాంక్స్" అంది. సిగ్గు మిళితమైన చిరునవ్వుతో.

తలుపు తీయబోతున్న చక్రవర్తి చెయ్యి ఆగిపోయింది. "సెలవు" అంటూ కారు బోనిమ్మన్నాడు డ్రైవరుతో. అతడి ముఖంలో నవ్వు మాయం కావడం మాధవి గమనించింది. 'దిగమనడం బాగుంటుందా మరి?'

రాత్రి ఎనిమిది గంటలకు డాక్టర్ ఫోన్ చేశాడు మాధవికి. "హల్లో, భోజనం చేశారా? బాగుందా ఒంట్లో?"

"ఆఁ. బాగానే వుంది" మాధవి జవాబు.

"మీకెవరైనా సాయం వున్నారా?"

"పనిమనిషి, ఆఫీస్ నౌకరు వున్నారు."

"నా నర్సును పంపుతున్నాను. చాలమంచిది. మీకు కాలక్షేపం కూడా ఔతుంది. ఉదయమే పంపించెయ్యండి."

"థాంక్స్, కాని అవసరం లేదండీ. మీరేమీ యిబ్బంది పడకండి."

పెద్ద నవ్వునవ్వాడు డాక్టర్. "తెలుసు మీరలా అంటా రని. కాని రవీంద్ర ప్రాణాన్ని అతడు తిరిగొచ్చేవరకు కంటికి

రెప్పలా కాపాడవలసిన బాధ్యత నాపై వుంది" మళ్ళీ బిగ్గంగా నవ్వి ఫోన్ పెట్టేశాడు.

'చిత్రమైన మనిషి' అనుకొంది మాధవి డాక్టర్ని గురించి మొట్టమొదటి సారిగా.

౧౧

సినిమా నుంచి టాక్సీలో వచ్చిన నిర్మల వస్తూనే నౌకర్లందరినీ హాడల గొట్టేసింది.

"ఏం, యింట్లో అంతా బ్రతికున్నారా, చచ్చిపోయారా? క్లబ్బునుంచి సినిమాకు వెళ్ళాను, కారు పంపించమని చెప్పి వెళ్ళాను గదా ? ఒక్కడికీ జ్ఞాపకం లేదా ?"

"చిత్తం. ఉండండి. కాని అయ్యగారు రా సమయానికే ఎక్కడికో వెళ్ళారు కారుమీద" అన్నాడు వంటమనిషి చేతులు నలుపుకుంటూ.

"ఏడీ, ఆ డ్రైవర్ వెధవ నిలా పిలు."

డ్రైవర్ వస్తూనే వినయంగా చెప్పేశాడు. "మీకోసం తెద్దామనే కారు షెడ్లోంచి బయటికి తీశానండి. అప్పుడే సరిగా అయ్యగారు, రవీంద్రబాబుగారింటికి పోనిమ్మన్నారు. అక్కడినుంచి ఆ బాబును కూడా ఎక్కించుకుని స్టేషన్కు దిగబెట్టాము. వారిని దిగబెట్టి వచ్చేసరికి సినిమాటైము దాటిపోయిందండి. ఏ టాక్సీలోనో వెళ్తారు లెమ్మన్నారు అయ్యగారు."

మండిపోయింది నిర్మల. "నా పనికంటె ముఖ్యమైనదా. అడ్డమైన వాడిని కారులో దిగబెట్టటం ? ఆయనకు మతిలేక పోతే నీకు బుద్ధి లేదూ?"

"ఇంతకూ వాడు మన కేమౌతారమ్మా?" తోటమాలి సందేహంగా అడిగాడు.

"దార్లో ఎదురౌతారు, ఛస్తే బూడిదౌతారు. ఏమౌతారు? ఏదో దూరపు సంబంధ మున్నంత మాత్రాన అంత పూసుకు తిరగాలా?"

"మొన్నొకనాడు..." అంటూ ఆగిపోయాడు వాడు.

"ఊ! ఏమిటి, చెప్పు?"

"ఆమధ్య ఓనాడు ఆ రిద్దరు తోటలో కొచ్చారండి, సాయంత్ర వేళ. అప్పటికి మన బాబుగారూ అక్కడే వున్నారండి. ఇరో రెండుపాటలు పాడితే ఆయమ్మగారో పాట పాడారు. ఆవిడ భర్తే పాడించారు. అయ్యగారు పూలూ, పళ్ళూ యిచ్చి మన కార్లోనే సాగసంపేరండి, ఆయన బైసికీలు ఈయన పుచ్చుకుని. నే నడిగితే 'నాకు సెల్లె లవుతుంది, చానా మంచిది' అని చెప్పారండి."

యజమానుల మధ్య కలతలు నౌకర్లకు లాభకరం. అది గమనించని నిర్మల యింకా గ్రుచ్చి గ్రుచ్చి అడిగి వివరాలు తెలుసుకొంది. "అంతవరకూ వచ్చిందన్నమాట ! ఎక్కడికీ రావడం యిష్టం లేదనేది, అంతటి పనులు చేస్తోందా ? చెల్లెలట, చెల్లెలు !" పళ్ళు పట పట కొరకింది.

అగ్నిలో ఆజ్యంపోసినట్లు నర్సు పద్మవచ్చింది. "అమ్మా, నేను ప్రొద్దున్నే వస్తాను. యిక్కడ పడుకోను."

"ఏం?" అంది ఆశ్చర్యంగా నిర్మల. ఆమె ఒక దిక్కూ లేనిది. అనాథాశ్రమంలో పెరిగి చదువుకొని, యిప్పుడు చక్రవర్తి దయవల్ల నర్సుగా బ్రతుకుతూంది. దయార్ద్ర హృదయుడైన చక్రవర్తి ఆమె తన యింట్లోనే నివసించడానికి అనుమతిచ్చాడు.

పద్మ చెప్పింది. "రవీంద్రబాబు ఊరెళ్ళారట. ఆయన వచ్చేవరకు భార్యకు రాత్రిళ్ళు తోడు ఉండమన్నారు అయ్యగారు."

నిర్మల ఆగ్రహం అవధులు దాటిపోయింది. "ఏం, లేకపోతే పిల్లెత్తుకుపోతుందా? ఎవడో ఎక్కడికో పోతే మధ్యన మన కెందు కీ జిడ్డు?"

"అయ్యగారు వెళ్ళమన్నారమ్మా మరి" అంటూ నర్సు వెళ్ళిపోయింది. "హుః! స్వంత అత్త, ఆడబిడ్డ లేకపోయినా యిది దాపురించింది నా ప్రాణాలకు, ఆడబిడ్డ లాంఛనాలు జరుపుకోడానికి." ముఖం కొట్టుకుంది.

౧౨

ఎన్నడూ అలవాటులేని ఒంటరి తనాన్ని, భయాన్ని పద్మ వల్ల మరిచిపోగలిగింది మాధవి. నిద్ర పట్టేవరకు చదరంగం ఆడుతూ కూర్చున్న మాధవీ పద్మలు ఆ కొద్ది గడియల సేపటిలోనే అత్యంత సన్నిహితురాలైపోయారు. పద్మ సరళ స్వభావమూ, మాట పొందికా మాధవిని తృప్తి పరిచాయి.

సంపన్న గృహిణి, ఉత్తమ వంశజ, విద్యావతి, సౌందర్య నిధి అయిన మాధవి నిరాడంబరత్వమూ, నిగహంకారమూ పద్మను మెప్పించాయి. సంసార విషయాలు, కష్ట సుఖాలు, అభి రుచాలు అరమరికలేని అత్యంత సన్నిహితులవలె మాట్లాడు కున్నారు. స్వంత విషయాలైన తర్వాత సంభాషణ స్నేహితులు, బంధువులు అయినవారిపైకి పోవడం సహజం. చక్రవర్తి సుగు ణాలు, తోట పెంపకం వచ్చాయి ప్రసంగంలోకి.

"డాక్టర్లలో యింతటి జాలి, సద్గుణాలు గల మనిషిని నే నెక్కడా చూడలేదమ్మా. ఏ విధంగానూ ఆయనలో లోప మెన్నలేం. వారి ఉప్పు తినేదాన్ని నే ననకూడదు కానీ, ఒక్క అందంలో మినహా ఆ నిర్మలమ్మగారు ఆయనకే విష యంలోనూ సరిపోదు. ఎప్పుడూ కీచులాటలే. డాక్టర్ గారే సర్దుకుపోతుంటారు" అన్నది పద్మ.

"పాపం!" అంది సానుభూతితో మాధవి.

"నా ఊహ మాత్రం..." అని ఏదో చెప్పబోయి సంశ యిస్తూ ఆగిపోయింది పద్మ.

"ఊఁ ఏమిటి, ఆగిపోయావేం?"

"నా కెవ్వరూ లేరు. దిక్కుమాలిన స్థితిలో నన్నాదరించి ఈపని నేర్పి పోషిస్తున్నారు డాక్టర్ గారు. రాత్రింబవళ్ళు ఇంట్లో పనులుకూడ చూస్తూ అక్కడే ఉండిపోతాను నేను నా పోష ణంతా వారిదే."

"అదీ సంగతి. అందుకే నిర్మల అంత నిశ్చింతగా షికార్లు తిరుగుతుంటుంది" అంది మాధవి, పెద్ద ఏదో కని పెట్టినట్లు.

నవ్వింది పద్మ. "ఇంట్లో చూసేవాళ్ళెవరూ లేక పోయినా ఆవి డలాగే తిరగ్గలదు. అటువంటి బాధ్యతేమీ లేదావిడకు."

"పోనీ, కాని, నువ్వు చెప్పబోయిన సంగతేమిటి?" అంది మాధవి తిరిగి విషయానికి వస్తూ.

"వారింట్లో మనిషిలా చూచుకుంటున్న నేనువారి గుట్టు బయట పెట్టకూడదు. కాని మీరూ వారి బంధువులు, మంచి వారు. చెవుతున్నాను, విని మర్చిపోవాలి...డాక్టర్ గారి పడక గదిలో ఒక అందమైన అమ్మాయి ఫోటో 'లైఫ్‌సైజ్'లో ఉంది. అది ఇంట్లో ఉండడమే అరిష్టమంటారు నిర్మలమ్మగారు. అందుకే పిల్లలు కలగడం లేదనికూడ ఆవిడ నమ్మకం. 'అదొక్కటే నేను తీర్చలేని నీ కోరిక నిర్మలా. నువ్వెంత పట్టుబట్టినా లాభం లేదు. అందులో నాకు నా సుధ జీవంతో నిలిచి ఉన్నట్లే కన్పిస్తుంది' అని నిట్టూర్చుతుంటారు డాక్టర్ గారు. కాని ఆ సుధ ఎవరో అడిగి తెలుసుకునే ధైర్యం నా కెప్పుడూ లేదు. స్వంత విషయాలలో జోక్యం కలిగించుకుంటే నా మనుగడకే మోసం తేగలంత కోపిష్టి ఆ నిర్మలమ్మ" అని ముగించింది పద్మ. "నిద్రలేవగానే ఆ ముఖంచూస్తే కాని ఆయన బ్రతకలేరట."

అంతా విన్న మాధవికి డాక్టర్‌పై అదివరకున్న సాను భూతి గాలిలో దూదిలా ఎగిరిపోయింది. "సందేహ మెందుకు ? మొదటి భార్యో, ప్రియురాలో అయ్యుంటుంది. లేకపోతే నిర్మ లకు అంత ద్వేషం దేనికి ?" అంది మాధవి.

"నేనూ అదే అనుకుంటానమ్మా. ఆవిడ నెవర్నో ఈయన ప్రేమించి ఉంటారు" అంది పద్మ, మాధవి ఊహాకు బలమిస్తూ.

"పాటి ఆడవాళ్ళమైఉండి నిర్మలను అపార్థం చేసుకో కూడదు. భర్త పరస్త్రీ నారాధించడం, అహర్నిశలూ—అభి మానమున్న ఏ ఆడది సహించగలదు? ఏం చేసినా ఈ మగ జాతికే చెల్లింది. ఛీ" అని అసహ్యించుకొంది మాధవి.

ఉదయమే "ఏం చేస్తున్నారు?" అని పలుకరిస్తూ లోనికి వచ్చిన చక్రవర్తిని హృదయ పూర్వకంగా ఆహ్వానించలేక పోయింది మాధవి. ఆమె ఇచ్చిన కాఫీ తీసుకుంటూ, "క్రొత్తగా ఒంటరితనం అనుభవిస్తున్నారు పాపం!" అని నవ్వుతూ, "రవీంద్ర ఈ పాటికి బెంగుళూరు చేరివుంటాడు" అన్నాడు. మాధవి మాట్లాడలేదు.

"అరె కూర్చోండి, నిల్చున్నారేం? ప్రొద్దున్నే మీకు పనివే శనుకుంటా" అన్నాడు చక్రవర్తి తిరిగి.

ఇహ మాట్లాడకపోతే బాగుండ దనిపించింది మాధవికి. "అబ్బే. పనేముంది? నిన్న మీరు స్టేషన్‌నుంచి వచ్చి దిగుతారను కున్నాను. వెళ్ళిపోయారేం?" అనడిగింది.

చక్రవర్తి ఒక్క క్షణం మాట్లాడలేదు "మీరు దిగమన లేదుగా? అదీకాక నాకోసం చాలమంది పేషంట్స్ వెయిట్ చేస్తున్నారు" అన్నాడు మరోవైపుకు చూస్తూ.

మాధవికి తెలిసిన కారణాలే. 'కాని భర్తయింట లేన ప్పుడు తనంత తాను ఎలా అతడి నాహ్వానించడం?'

కొద్దిసేపయ్యాక అతడే మాట్లాడాడు.

"క్రొత్త కథలేమైనా వ్రాశారా?"

"వ్రాశాను రెండు" అనేసింది మాధవి. కాని అలా చెప్పి ఉండకూడ దనిపించింది తర్వాత. ఇమ్మంటాడేమోనని భయ

పండిది. కాని అత డడుగలేదు. ఆమెకే వెనుకటి సంగతులు జ్ఞాపకం వచ్చాయి. "ఆ రోజు మీరు వ్రాసిన విమర్శ చాల బాగుంది. మీరూ అజ్ఞాత రచయితలేమో అనుకొంటున్నాను. ఔనా ?" అనడిగింది.

అదోక మాదిరిగా నవ్వాడు చక్రవర్తి. ఆ నవ్వులో జీవంలేదు; కళలేదు. "అంతటివాడిని కాదు. ఏవో తోచిన అభిప్రాయాలు వ్రాశాను. అంతే."

"మీ సూచన ప్రకారమే వ్రాస్తే బాగుండేదని నాకూ తోస్తూంది."

"ఎప్పుడైనా ఒకసారి మా ఇంటికి రాకూడదూ? ఇప్పుడు రవీంద్ర లేడు గనుక అంతగా పని ఉండదేమో !" అన్నాడు డాక్టర్ హఠాత్తుగా సంభాషణ మార్చేస్తూ.

"వస్తానండి" అంది మాధవి.

డాక్టర్ ఆమె ముఖం పరిశీలనగా చూస్తూ, "మీరేమీ అనుకోకుండా ఉంటే ఒక విషయం అడగాలనుంది" అన్నాడు.

'ఏమిటో అది ?' గతుక్కుమంది మాధవి. "అడగండి" అంది లేనినవ్వు తెచ్చుకుంటూ.

"మరేంలేదు. మీరు మరీ యింత ముదిగా యింటిలో పడి ఉండడం రవీంద్ర ఆజ్ఞానుసారమే అనుకుంటున్నాను. నలుగురితో తిరగాలని మీకు మాత్రం ఉండదూ?"

ఆశ్చర్యం స్పష్టంగా కన్పించింది మాధవి నేత్రాలలో. "మీ కసలెందు కీ అనుమాన మొచ్చింది ? ఆయనకు నేను ప్రాణాధికం" మాధవి కళ్ళు చిత్రంగా మెరిశాయి.

డాక్టర్ కూడా ఆశ్చర్యపడ్డాడు. "అదే నాకూ పరమ సంతోషం. మీ అంత అన్యోన్య దంపతు లెక్కడా వుండరనీ అనుకొనేవాడిని. కాని మొన్న శ్రీధర్ వచ్చిననాటి సాయంత్రం అతడి ప్రవ ర్తన చూ స్తే నా కా అనుమానం కలిగింది. అడిగి నందుకు మ రేం అనుకోకండి."

చిన్నగా నవ్వింది మాధవి. "అనుకునే దేముంది కాని —అటువంటి తెలివితక్కువ వాళ్ళం కాము. మా మధ్య ఎప్పుడూ అటువంటి కలతలురావు. ఆ రోజేదో కొద్ది చిరాకు పడ్డారాయన. అదంత లెక్కలోనిది కాదు. నా తత్వమే అంత. తిరగాలనుంటే ఒకళ్ళాపగల రేమిటి?" బెట్టుసరిగా అంది.

"అయి తే తెలివితక్కువవాళ్ళ సంసారాలలోనే కలతలు వస్తాయంటారు ? సంసారాలలో దుఃఖం కల్పించే కొన్ని కొన్ని బాధలు, లేమి, నీతి నియమాల ఉల్లంఘన, బాధ్యతా విస్మ రణ—ఇటువంటి వాటి గురించి ఆలోచించారా మీ రెప్పు డైనా ?" అనడిగాడు చక్రవ ర్తి బాధగా.

"ఆహా, ఆలోచించ కేం ? అన్నిటికీ ముఖ్యకారణం బుద్ధి హీన తే. నన్నెవ రేం చేయగలర నే అహంకారమున్న పురుషుడూ, భ ర్తను సంపాదనా యంత్రంగా చూచే భార్యావున్న కుటుం బాలే కలతలకు ఆలవాలం. ఆ అహంకారమే తెలివితక్కువ." ఖచ్చితంగా జవాబిచ్చింది మాధవి. పద్మ చెప్పిన విషయాలు మన సులో మెదులుతూండగా.

చక్రవ ర్తి మాట్లాడలేదు, తల పంకించాడు. కొద్ది క్షణాలు మౌనంగా గడిచిపోయాక లేస్తూ, "నేను వెళ్తాను మరి. నర్సును తిరిగి రాత్రి పంపిస్తాను" అన్నాడు.

మాధవి మౌనంగా అతడిని గుమ్మంవరకు సాగనంపింది.

"అన్నట్లు, మీఇంట్లో బాగానే ఉందికదూ?" అన్నాడు మెట్లమీద నిలబడి.

"బాగానేఉంది" అంది తలవంచుకొని మెల్లగా మాధవి.

ఒక్క-క్షణం అలాగేచూచి, "చూడండి. నేను డాక్టర్ని. ఏదైనా ఉంటే సిగ్గుపడకుండా చెప్పెయ్యాలి" అని కాస్పేపాగి; "పోనీ, పద్మతో చెప్పండి ఏమైనా ఉంటే. మొహమాటం వద్దు." అంటూ కారెక్కాడు, చక్రవర్తి.

## ౧౩

భోజనానంతరం దుస్తులు మార్చుతూన్న చక్రవర్తిని "ఎక్క-డికి తోటకేనా ప్రయాణం ?" అనడిగింది నిర్మల.

"ఔను. ఏం ?"

"ఏమీలేదు."

"లేకపోవడ మేమిటి ? ఏనాడైనా నా రాకపోకలు నీకు కావాలి సొచ్చాయా? ఏం సంగతి?"

"నేనూ వస్తాను."

ఆశ్చర్యపోయాడు. "ఏ దేవతలు కరుణించారో, ఇలా మారిపోయావు ! నువ్వు నాతో రావడంకంటే సంతోష మేమిటి ! ఊఁ రా. ఆలస్యం చెయ్యకు."

కొంచెంసేపు తటపటాయించి, "అబ్బే, రాను, ఊరికే అన్నాను" అన్నది. చక్రవర్తి ముఖం మాడిపోయింది. "ఎందు

కిలా ఆడుకుంటావ్ నిర్మలా నాతో! బహుశా క్రితం జన్మంలో ఉద్దాలకుడు, చండిక మనమే నేమో!"

"మీ రెందుకు యిప్పుడు తోటలోకి వెళ్ళడం?"

"ఏమి టివ్వాళ్లిదో క్రొత్త ధోరణు లొచ్చాయి? రోజూ వెళ్ళే తోటేగా? అదేమిటో వివరంగా చెప్ప కూడదూ?"

"చెప్పకేం జేస్తాను, తమరంత అమాయకుల్లా నటిస్తు న్నప్పుడు? ఇదివరకెప్పుడూ అనుకోలేదు కాని, యిప్పుడు మాత్రం అనుకుంటున్నాను. మీ ధోరణేమీ నచ్చలేదు నాకు."

చక్రవర్తి మాట్లాడలేదు. ఆమె వాగ్ధాటి కోసం మౌనంగానే ఎదురు చూస్తున్నాడు.

"ఆ మాధవి ఎవరు? మన మెవరం?"

"అంటే ?"

"నేనింటి కావస్తే రాకుండా, మీరు తోటలో ఉండగా వచ్చి అక్కడ పాటలు, పద్యాలు ఏమిటి? మన కార్లో వాళ్ళని త్రిప్పడ మేమిటి? మన నర్సులు వాళ్ళకు ఊడి గాలు చెయ్యడమేమిటి? ఏమిటిదంతా?"

అలాగే మాట్లాడకుండా చూస్తున్నాడు చక్రవర్తి.

"ఏం మాట్లాడరేం? నాకు చెప్పే దేమిటనా ?"

"నువ్వు చెప్పినవన్నీ నిజమే. అందులో అబద్ధం దోషం ఏమీ లేవు. దాపరికమూ లేదు. కాని చెప్పే అవకాశం రాలేదు. ఇంతకూ ఇవన్నీ యింత పూసగ్రుచ్చి నట్లెవరు చెప్పారు?"

"ఏం నాకు తెలియఁకూడదా?"

"తెలియవచ్చు. తెలియాలి కూడాను కాని నే నెటు వంటివాడనో నీకు తెలుసు. తెలిసే ఏదో అనుమాన మున్నట్లు నౌకర్లని ఆరా తీయడమెందుకు? వాళ్ళకు లోకువ కాదూ? నేనే చెప్పేవాడినిగా అడిగితే?"

"అవును నే నడగడం లోకువ. మీరు చేసేవి లోకువ కాదు."

"చూడు, నిర్మలా. నేను నీచుడినికాదు, నిన్నన్యాయం చేయడానికి. జడ పదార్థాన్నసలే కాదు, నీ పరిధుల్లో పడుండ డానికి. నీ షికార్లు గురించి నేనెప్పుడైనా అడిగానా? మరె అప్పుడూ యిలాటి పనులు చెయ్యకు. స్నేహితులం గనుక సాయంగా ఉండటం కూడా అపరాధం కాదు" అని వెళ్ళి పోయాడు.

౧౪

రవీంద్ర వ్రాసిన ఉత్తరం చదువుకుంటూ హాల్లో కూర్చున్న మాధవీలత కారు హారన్ విని లేచి గుమ్మంవద్దకు వచ్చింది. చక్రవర్తి కారు దిగుతూనే "రవీంద్ర వ్రాశాడు. మీకు వ్రాశాడా?" అంటూ వచ్చాడు.

"ఇప్పుడే అందింది. క్షేమంగా జేరాననీ, పది రోజు లుండాలనీ వ్రాశారు. ఇన్నాళ్ళెలా ఉండను!" దిగులుగా అంది మాధవి.

నవ్వుతూ అన్నాడు చక్రవర్తి: "భయమెందుకమ్మా! నేను లేనూ? అన్నీ తెలిసినవాళ్ళే అలా భయపడతారా!"

పన్నీటి జల్లు చిలకరించినట్లయింది మాధవికి. శ్రీధర్ మాటలకంటె ఆప్యాయంగా ఉన్నాయి చక్రవర్తి మాటలు.

"మిమ్మల్ని జాగ్రత్తగా చూస్తూండమని మరీ మరీ వ్రాశాడు రవీంద్ర. మీరిలా దిగులుపడితే ఎలా? చూడండి ఉత్తరం."

చదివి ఇచ్చేస్తూ, "మధ్యన మీకు చాలా శ్రమ కలిగిస్తున్నాం" అంది మాధవి.

"అలాగనకమ్మా. నా చెల్లెలే ఉంటే చూచుకోనే వాడిని కాదా? ఒక శ్రమేనా?" అంటూండగానే అతడి ముఖ కవళికలు మారిపోయాయి. చటుక్కున లేచి, "నేను వెళ్తాను. ఇదిగో, ఈ పుస్తకం మీకోసం తీసుకొచ్చాను. చదవండి తర్వాత" అన్నాడు టేబుల్ మీద దుంచుతూ. గర్భిణీ స్త్రీలు తీసుకోవలసిన జాగ్రత్తలు పొందుపరచిన పుస్తకమది.

ఆ ఒక్క నిమిషంలో మాధవి బెట్టుసరి తత్రమంతా పటాపంచలై పోయింది. అనిర్వచనీయాంతరంగిక బాధ యిమిడి ఉన్న అతడి వదనమూ, కంఠస్వరమూ మాధవి హృదయాన్ని ద్రవీభూతం చేశాయి. నొచ్చుకుంటూ అంది: "తర్వాత చదువుతాను లెండి. ఎండలో వచ్చిన మీకు మంచినీళ్ళయినా ఇవ్వకుండా మాట్లాడు తున్నాను" అని లోపలికి పోబోయింది.

"వద్దమ్మా, భోజనానికి వెళ్తూ యిలా వచ్చాను. ఉత్తరం సంగతి చెప్పడానికి. నే వెళ్తాను" అంటూ వారించాడు చక్రవర్తి.

"ఇక్కడ చెయ్యకూడదూ ? యింటికే వెళ్ళాలా ?"

అకస్మాత్తుగా ఆమెలో అంకురించిన ఈ ఆప్యాయతకు ఆశ్చర్యపోయాడు చక్రవర్తి. "ఆహా అమృతం పెడతానంటే అంతకంటేనా ?" అంటూ మాధవితో కూడా డైనింగు హాల్లోకి వచ్చాడు. మాధవి వడ్డిస్తూంటే కాళ్ళూ చేతులూ శుభ్రంగా కడుక్కు వచ్చాడు. ఆమె అందించిన తువ్వాలుతో చేతులు తుడుచుకొని భోజనానికి ఉపక్రమించాడు. దగ్గరే నిల్చుని నెయ్యి, కూరలు వడ్డిస్తూంది మాధవి.

హఠాత్తుగా తలెత్తిన చక్రవర్తి, "రోజూ ఈ సపర్యలు చేయించుకుంటూన్న రవీంద్ర ఎంత అదృష్టవంతుడు !" అన్నాడు.

చిన్నగా నవ్వి ఊరుకుంది మాధవి. "ఏ వంటవాడో వడ్డిస్తూంటే హోటలు మెతుకులు తిన్నట్లు తినిపోవడమే కాని, రుచైన పదార్థాలు యిలా ఆప్తులు దగ్గరుండి తినిపించి చాలా కాలమైంది" అన్నాడు నిట్టూర్చుతూ చక్రవర్తి.

"మీా రెప్పుడూ ఏదో దిగులుగా ఉన్నట్టుంటారు... నిర్మలగారు..." అని సంశయిస్తూ ఆగిపోయింది మాధవి.

"ఊఁ, ఏమిటి, నిర్మల !" పేలవంగా నవ్వాడు డాక్టర్. "మీా అనుమానం నా కర్థమైంది. ఆమెకు నే నంటే యిష్టం లేదా అనీ. అవునా ? ఆమె మీానుంచి చాలా నేర్చుకోవలసి ఉంది. కాని చూసి కూడా నేర్చుకోవడం చేతకాదు. కొందరికి వాళ్ళపై వాళ్ళకే గాని ఎంత ఆప్తుల మీాదైనా ప్రేమాభిమానా లుండవు. ఆ తరహాకు చెందిన స్వార్థపరు రాలు నిర్మల. నా హోదా, డబ్బు, డాక్టర్ భార్య ననే

లేవి—యివే ఆవిడకు కావలసింది. ఏం చేస్తాం? వికసించని స్త్రీ హృదయం. బలవంతాన నాకనుగుణంగా మార్చుకో వచ్చనుకోండి. కాని బలవంతాన వికసింపజేసిన పుష్పపరిమళం ఏపాటిది?" అతడి కండ్లలోని నైరాశ్యం చూచిన మాధవికి కండ్ల నీళ్ళు తిరిగాయి. పురుషులు బలశాలులు గనుక వాళ్ళు స్త్రీలను శారీరకంగా, మానసికంగా నరక బాధ పెడతారని ఆమె అనుకొనేది. కాని ఒక స్త్రీ కూడ పురుషుని చిత్రంగా హింసించగల దన్న మాట! కర్కశ హృదయులనబడే పురుషు లలో కూడ ఎంతటి కోమలస్వభావు లుంటారు! రవీంద్రకంటే ఉత్తము డెక్కడా ఉండబోడని అనుకుంటూన్న మాధవి చక్రవర్తి ఈ కాలపు పురుషు లందరికంటె ఎన్ని మెట్లు పైన నిలిచిఉన్నాడో అంచనా వేసూ పెరుగు ఎక్కువ వడ్డిం చేస్తూంది.

చక్రవర్తి తలెత్తి చూచి, "చాల్చాలు. ఏమంత పరధ్యానంగా ఉన్నారు?" అనడిగాడు.

దానితో ఆలోచనలు కట్టిపెట్టి మాటమార్చింది. "ఏం లేదు. కానీ, ఈ తెచ్చిపెట్టుకున్న 'మీరు', 'అండి' మర్యాదల కంటె యింతాకలా చనువుగా మాట్లాడితేనే బాగుంటుంది, మా శ్రీధరం అన్నయ్యలాగా."

నవ్వుతూన్న చక్రవర్తి ముఖ కవళికలు చూస్తూండ గానే మారిపోయాయి. భోజనం ముగించకుండానే చెయ్యి కడుక్కుని లేచిపోయాడు మాధవిని చూచి నిట్టూర్చుతూ: "నాకూ అలాగే పిలవాలనుంటుంది. కానీ, అలా పిలవలేను. అలా ఉండలేనమ్మా" అని చరచరా నడిచి వెళ్ళిపోయాడు.

'ఏమి టితడి తత్వం?' విస్తుపోతూ, ఆలోచిస్తూ, గుమ్మంవరకు వెళ్లిన మాధవి, "రవీంద్రకి త్వరగా వ్రాయండి మళ్ళీ బెంగ పెట్టుకోగలడు. నేను వ్రాసేశాను" అన్న చక్ర వర్తి మాటలకు విస్తుపోయింది. కారు వెళ్ళిపోయింది.

'హుఁ. అప్పుడే విచారం. అప్పుడే సంతోషం. ఏం మనిషి!' అనుకొంటూ లోనికి నడచింది.

'అత డప్పుడే వ్రాసేశాడట! పాపం, ఎంత మమకారం!' తానుకూడా భర్తకు ఉత్తరం వ్రాయడానికి కూర్చుంది.

ఉత్తరం అందిందనీ, తాను బాగానే వున్నాననీ, చక్రవర్తి ప్రాణప్రదంగా చూచుకొంటున్నాడనే, భయ మవసరం లేదనీ వ్రాసింది. ఆహార విహారాదులలో వేళ మించరాదనీ, క్రొత్త ప్రదేశంలో ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకోమనీ హెచ్చరిస్తూ సాధ్యమైనంత త్వరలో రమ్మని ముగించింది. తర్వాత డాక్టర్ ఇచ్చిన గ్రంథం చదువుతూ పడుకొంది. కానీ ఆమె మనసెక్కడా చదువుమీద లగ్నం కాలేదు. 'ఏమిటీ డాక్టర్ ధోరణి? సంతోషంగా వున్నట్లే వుంటాడు కాని ఏదో బాధ ననుభవిస్తూంటాడు. అందరిలో కలిసిపోయి వుండీ, ఏదో ఒంటరివాడిలా, నిస్సహాయుడులా విచారిస్తూంటాడు. ఎంత చనువుగా వుంటాడో అంత మర్యాదగా ప్రవర్తిస్తాడు. ఎక్కడా హద్దు మీరడు. అతడి స్వభావం తెలియక మొదట చాలా తప్పుగా ఊహించింది. కాని ఇప్పుడు? అతడు ఇప్పుడూ అర్థంకాని మనిషే తనకు అయినా అతడి నపార్థం చేసుకోకూడదని స్థిరంగా తెలిసింది

అత డెప్పుడో కోల్పోయిన ఆత్మీయతను ఈనాడు తనలో చూచుకొంటున్నట్లుగా ఆమె భావనా పటిమతో ఊహించింది. అయినా ఏమో ? త్వరపడి ఎటూ ఒక నిర్ణయానికి రాకూడదు. మానవ స్వభావం చిత్రాతి చిత్రమైనది. పురుష హృదయాల పోకడలు పలువిధాలు !'

రాత్రి తోడుపడుకోవటానికి కొచ్చిన పద్మ డాక్టర్‌గారిమ్మన్నారంటూ తెచ్చిన పూలను చూడగానే తిరిగి మాధవి మదిలో ఆలోచనా స్రవంతి బహు దారి అయ్యింది. పుష్ప సౌరభాన్ని విపరీతంగా ప్రేమించే ఈ కోమల స్వభావికి, సుకుమార కుసుమ సౌందర్యాన్నమితంగా ఆరాధించే ఈ నవనీత హృదయునికి ఎప్పుడో ఎందువల్లనో అంతరాంతరాలలో గాయమయింది. ఇప్పుడేదో సంఘటన లేక ఎవరో వ్యక్తి ఆ మానసిగాయాన్ని కెలికి పుండుగా మార్చారు. నిరంతరం రేగి బాధించుతూన్న ఆ పుండు పెట్టేయాతనకు చక్రవర్తి సున్నిత హృదయం తట్టుకోలేక పోతున్నది. ఆ కారణమేమిటో తెలియటానికి మరికొంతకాలం వేచిఉండాలి. రాత్రి నిద్రపోయే ముందు ఆ విషయమే డైరీలో వ్రాసుకుంది మాధవీలత.

## ౧౨

రాత్రి నిర్మల భోజనం చేస్తూండగా చక్రవర్తి వచ్చాడు.

వంటమనిషితో, "నాకుకూడా వడ్డించెయ్యరా" అంటూ చేతులు కడుక్కోవటానికి వరండాలోకి వెళ్ళాడు.

"అయ్యగారు ప్రొద్దున్న భోజనానికి రాలేదమ్మా"
అన్నాడు నిర్మలతో వంటమనిషి.

"ఏ స్నేహితు లింట్లోనైనా తిన్నారేమో? లేకపోతే ఏ హోటల్ కెళ్ళి ఏం తిన్నారో ? ఈ మహా పట్టణంలో భోజనానికే కరువా?" అంది అన్నం కలుపుకుంటూ.

చేతులు కడుక్కు- వస్తూన్న చక్రవర్తి ఆ నిర్లక్ష్యపు మాటలు విని ఉడికిపోయాడు.

"అవును. అనురాగానికి కరువుగాని అన్నానికి కరువా ? మొక్కుబడిగా పారేసే నాలుగు మెతుకు లెక్కడైనా దొరుకుతాయి."

నిర్మలకు కోపం వచ్చింది. "ఎప్పుడూ వండి వడిస్తూ వంటగదిలో వాడిపోవడం లేదనేనా మీ బాధంతా ? అందులోనూ అదెక్కడ దాపరించిందో, ఆ మాధవి, ఆ వంటింటి కుందేల్ని చూచిన దగ్గర్నుంచీ ఈ ధోరణి మరీ ఎక్కువైపోయింది. పోనీ అక్కడికే వెళ్ళలేకపోయారా? స్వహస్త పాకాలు రుచి చూపించును."

"అవును. అక్కడికే వెళ్ళాను. ఆప్యాయంగా అమృతం పెట్టింది. నా స్వంత చెల్లెలే అయితేనా, రోజూ అక్కడికే వెళ్లుదును. అయినా అంత అదృష్టం ఎంతటి వాళ్ళకు!" ఆవేశంగా అన్నాడు చక్రవర్తి.

ఆ మాటలు ఛెళ్లున కొట్టినట్లయ్యాయి నిర్మలకు. ఒళ్ళు తెలియని కోపంతో అంది: "వెళ్ళండి అక్కడికే వెళ్ళండి. బెదరింపా ? రవీంద్ర లేడుకూడ. మంచి అవకాశం."

కోపమే ఎరుగని చక్రవర్తి ఉగ్రుడై పోయాడు. "ఛీ, మూర్ఖురాలా. నోటికి హద్దూపద్దూ లేదు" తింటూన్న అన్నం పళ్ళెం నేలకేసికొట్టి వెళ్ళిపోయాడు.

౧౩

ఉదయం తొమ్మిదిన్నర అయింది. ఏమీ తోచకుండాఉంది మాధవికి. ఏపనీ చెయ్యబుద్ధి కావడంలేదు. ఏదైనా వ్రాయడానికీ, చదవడానికీ, అసలే మనస్కరించటంలేదు. ఇల్లంతా కలయదిరిగింది. మేడమీద గదులన్నీ చుట్టివచ్చింది. ఎక్కడా కాలు నిలువ లేదు. దేనిమీదా బుద్ధి నిలువడం లేదు.

'ఇదేమిటో, యిదొక క్రొత్త అనుభవం. ఇదివర కెప్పుడూ నా కిలా తోచకపోవడం, అన్యమనస్కతా లేవు. రవీంద్ర లేకనా?' నవ్వుకొంది. క్రింద తివాచీపైనున్న వీణ మీద ఆమె దృష్టి పడింది. నాలుగు రోజులు అయింది వీణ వాయించి. రవీంద్ర ప్రతిరోజూ బ్రతిమలాడో, పంతంపట్టో అధమం రెండు పాటలైనా వీణమీద పాడించుకోనిదే నిద్ర పోయేవాడు కాదు. అది వారి దిన చర్యలో ఒక ముఖ్యభాగం. మాధవికి ఇష్టమైతే అడిగించుకోకుండానే చక్కగా పాడు తుంది. ఆనందంతో రవీంద్ర, 'గాన సరస్వతివి కదూ!' అని మెచ్చుకుంటాడు. మాధవి నిందుగా నవ్వుతుంది, ఇష్టంలేక పోతేమాత్రం అధమం అరగంటసేపైనా బ్రతిమాలించుకుం టుంది. 'మీకు సంగీతజ్ఞానమేముంది?' అని కవ్వించుతుంది.

ఆఖరుకు దయతలచినట్లుగా వీణ చేతికి తీసుకుని భర్త కోరిన దానికి పూర్తిగా విరుద్ధమైంది పాడుతుంది. సంగతులన్నీ తగ్గించివేసి కీర్తనను కుదించి రెండు నిమిషాలలో ముగించి వేస్తుంది. అయినా రవీంద్రకు కోపంరాదు. 'సాక్షాత్తూ గానకోకిలవే' అంటూ కొంటెతనపు చిరునవ్వు దాచుకో ప్రయత్నిస్తాడు.

అందులో గర్భితమైవున్న హేళనా భావాన్ని గ్రహించిన మాధవికి కోపంవచ్చేస్తుంది. 'మీరు హేళన చేసినంత మాత్రాన నా నలుపు పోదులెండి. మహా అందంగా మెరిసి పోతున్నారు ! తెల్లగావుంటే సరా ! పెద్ద ముక్కు, చిన్న కళ్ళు' అంటుంది వెక్కిరింపుగా.

'ఊహు ! అలాగా !' అమాయకంగా పెడతాడు రవీంద్ర ముఖం. 'మాఅమ్మ యిప్పటికీ ముద్దులు మూట గట్టే ముఖం. మన్మధుడు మాబాబు అంటుందే?' ఆ మాటలతో ఇద్దరూ ఫక్కున నవ్వుకుంటారు.

'అటువంటి చిలిపి కయ్యాలు, పసిడి పంతాలు లేక ఈ ఏడు రోజులనుంచీ ఏమిటో అదోరక రకంగా వుందసలు. అక్కడ రవీంద్ర ఎలా వున్నారో! వచ్చాక ఈ విషయం చెప్తే ఏమంటారో ? నవ్వరు కదా?' ఆలోచిస్తూ అప్రయత్నంగా వీణ మీటింది మాధవి. అలవాటైన వ్రేళ్ళు తీగెలను కవ్విస్తూ అటుయిటు పరుగెత్తడం మొదలు పెట్టాయి. అనుశ్రుతానికి రంజిల్లే హృదయంలోనుండి అప్రయత్నంగా గానం వెలువడింది కిన్నెర కంఠం వీణానాదంతో మేళవించింది. శిశు పశు పక్ష్యాదుల సైతం ముగ్ధులను చేసే ఆ

గానాంబుధిలో పరిసర చేతనాచేతనములన్నీ తేలిపోయాయి. ప్రకృతే పరవశించింది. కాలగమనమే నిలిచిపోయింది.

కలువల రాణిని పలుకరించి, మాలతితో మంతనాలాడి, సంపంగి నధిగమించే సౌరభాలు వెదజల్లుతూ, గులాబి కన్నెను జేరి, సిగ్గుతో అరుణరాగ రంజితమై తలవాల్చింది, వసంతరాగ సాహిత్యం. స్తంభించిన ప్రకృతి మెల్లగా చైతన్యం పొందింది. గానంలో లీనమైపోయిన మాధవి కూడా క్రమంగా జాగ్రద వస్థకు వచ్చింది 'సిగరెట్ వాసన అపరిమితంగా వచ్చేస్తూంది! ఎక్కడ? ఎవరు వచ్చారు?' త్వరగా లేచి వెళ్ళింది. రీడింగ్ రూమ్‌లో సోఫాలో పరధ్యానంగా కాలుపై కాలు వేసు కొని సిగరెట్ త్రాగుతున్నాడు డాక్టర్ చక్రవర్తి చూచి చటుక్కున గడపదగ్గరే ఆగిపోయింది మాధవి. గాజుల సవ్వడిని విని తలయెత్తిచూచిన చక్రవర్తి సిగరెట్ విసిరేసి సరిగా సర్దుకు కూర్చున్నాడు.

చిరునవ్వుతో "రండి కూర్చోండి" అన్నాడు. "అద్భుతంగా పాడు తున్నారు. ఆ మైకంలో సోలిపోయి అలా శాశ్వత నిద్ర పోవాలన్పించింది."

మాధవి కొద్దిగా సిగ్గుపడుతూ, "మీరువచ్చి చాలా సేపైందా?" అంది.

"ఏమో, ఎంతసేపైందో! పాట విన్పించి పైకొచ్చాను. ఆరోజు తోటలోకంటే యివాళ బాగా పాడారు. వసంతరాగం కదూ? చాల ఇష్టం నాకు. మీరా రాగం ఆలపించుతుంటే మోళ్ళుకూడా చిగిర్చి వసంతోదయ మవుతుంది. వసంతా

గమనవేళ ఫల పుష్ప భరితమైన వృక్షాలతో కళకళలాడే ప్రకృతి కట్టెదుట సాక్షాత్కరించినట్లే ఉంటుంది."

"మీరు ప్రతిదానికీ అతిగా పొగుడుతారు."

"పొగడ్తా? మనస్సులో సంతోషం దాచుకోలేక పైకి వ్యక్తం చేశానంతే. పోనీండి, కానీ, ఆ పాట ఎక్కడిది మీకు? నే నిదివర కెక్కడా వినలేదు."

"నేనే వ్రాశాను. అప్పుడప్పుడు భావాలు కలుగుతుంటాయి. నేనే ఏదో ఒక రాగం కట్టి పాడుకుంటాను." మెల్లగా చెప్పింది.

"అయితే మీరు గేయాలు కూడా వ్రాస్తుంటారన్నమాట!"

"ఏదో అప్పుడప్పుడు! కాని అవెప్పుడూ అంతప్రచారం లోకి రాలేదు. కేవలం నా సంతోషం కోసం. అంతే."

"ఇప్పుడు మీరు పాడింది చాలా బాగుంది. వ్రాసి ఇవ్వగలరా?" తటపటాయిన్నూ అడిగాడు చక్రవర్తి.

"దానికేం? ఇప్పుడే యిస్తాను." టేబుల్ మీదున్న రవీంద్ర వాడుకునే లెటర్ హెడ్ బుక్‌లోని కాగితంతీసి వ్రాసి యిచ్చింది.

ఒకసారి చదివిచూచి "వసంతరాగం కదూ! వసంత పురుషునికి ప్రకృతికన్య ఆహ్వానం. బాగుంది" అని మడచి జేబులో దాచాడు. "ఇంత తీరుబాటుగా ఉన్నారేమిటి?" అన్నాడు మళ్ళీ నలుదిక్కులాచూస్తూ.

"తిరుబాటు కాక పనేముంది? ఒక్కతెనేగా?" నవ్వింది. మాధవి.

"భోజనమైందా ?"

"లేదు...ఆ. ఆ. అయ్యింది. చేశాను." అంది తొట్రుపడుతూ మాధవి.

పకపకా నవ్వేడు చక్రవర్తి. "అబద్ధా లాడటానికికూడా చాలా తెలివుండాలమ్మా. నేను క్రింది గదులన్నీ మీ కోసం వెతికే వచ్చాను. అసలివాళ వంట ప్రయత్నమే వున్నట్లు

దొరికిపోయినందుకు సిగ్గుపడింది మాధవి. "పెద్ద వంట ఎందుకు, నేనేగా? పాలు, పళ్ళు తీసుకుంటామనీ..."అంటూ నసిగింది.

మళ్ళీ నవ్వేశాడు డాక్టర్. "ఊ, ఇదంతా బావగారి మీద బెంగ. నాకు తెలుసులెండి." అంతలో గంభీరమైపోయింది చక్రవర్తి ముఖం. "ఊరికేనే హాస్యం చేశానుకానీ ఎవరిమీద వారికంత శ్రద్ధఉండదు, ఎక్కడో నిర్మల లాంటి వాళ్ళకు తప్ప భ ర, సంతానం లేక తలిదండ్రులలో, తోబుట్టువులో ఎవరో ఒకరి ధ్యాసలలో, సేవలలో మునిగిపోయి అదే జీవిత పరమావధిగా భావించి తమను తామే విస్మరించుతారు చాలామంది స్త్రీలు. ఆ జాతిలో మీరుప్రప్రథములని నేనేనాడో గ్రహించాను. ఆ పరిపక్వ స్త్రీ హృదయానికే నే నంజలి ఘటించేది. కాని, మాధవీ, ఒకవిషయం. మీ కేవిధమైన మనఃక్లేశమూ, నిర్లక్ష్యమూ నేను భరించలేను. మీ క్షేమాన్ని కోరుతూ నిరంతరం మీపై శ్రద్ధాభక్తులు చూపే

నేనున్నానని మరువకండి. ఇక్కడ మీ కొకరికీ దిగులుగా ఉంటే నేను లేనా ? మా యింటికి రండి భోజనానికి."

అతడి ఆవేశానికి విస్తుపోతూ. "అబ్బే, ఎందుకండీ. వద్దు" అంది.

"ఇదుగో, యిటు చూడండి." పర్సులోంచి ఒకఉత్తరం తీసి ఇచ్చాడు చక్రవర్తి. అది శ్రీధర్ చక్రవర్తికి వ్రాశాడు. చెల్లెల్ని జాగ్రత్తగా చూడమనీ, అవసరమైన మందులూ అవీ వెనుదీయకుండా వాడమనీ మరీ మరీ వ్రాశాడు. 'నాముద్దుల చెల్లెలు మాధవి. పెద్దవాళ్ళెవరూ దగ్గరలేని ఆ మహా పట్నంలో నా చెల్లెల్ని నాకంటె మిన్నగా చూచుకుంటావని ఆశిస్తున్నాను. మనిద్దరం బంధువులమేకాక స్నేహితులం కూడా అవడంవల్ల యింత చనువుగా అడగగలుగు తున్నాను' అని ముగించాడు ఉత్తరం శ్రీధర్.

"చూశారా? అన్నగారు. బావగారు - ఇద్దరుకూడా మిమ్మల్ని జాగ్రత్తగా చూచుకొనే బాధ్యత నాపైన పెట్టారు. అలాగని కేవలం యిదొక బాధ్యత అనుకోనేరు సుమా! నాకు మీపైన ఎంత అభిమానమో ఎలా వర్ణించేది!" మంచి తనం, మమకారం తొణికిసలాడే ఆ నేత్రాలలోని అభ్యర్థనను త్రోసిపుచ్చడం వెయ్యిమంది మాధవీలతలకుకూడా అసాధ్యం!

కారు దిగగానే పద్మ ఎదురువచ్చి లోపలికి తోడ్కొని పోయింది మాధవిని. మేడమీద రేడియో వింటూన్న నిర్మల మాధవిని చూడగానే లేచి ఎదురు వచ్చింది.

"మామీద చాలా దయగలిగింది. పిలిచిననాడు రాలేదు. పిలువకపోయినా సాక్షాత్కరించారు. ఏదో విశేష ముంది" అంది చిరునవ్వుతో.

ఆ మాటలలో ఎత్తి పొడుపు గ్రహించిన మాధవి కొంచెం బాధపడినా పైకి నవ్వుతూనే "ఏం చేస్తున్నారు? పనులయ్యాయా?" అనడిగింది.

నవ్వింది నిర్మల. "సాయంకాలం ఏ పిక్చర్‌కు వెళ్ళాలా అని ఆలోచిస్తున్నాను. నాకు పనులేమిటి?"

"ఆలోచిస్తున్నారా? అయితే వున్నవన్నీ ఓసారి చూసేసినట్టేనా?"

"ఒకసారేం ఖర్మం! మూడు నాలుగు సార్లుచూసినవి కూడా ఉన్నాయ్." నిర్లక్ష్యంగా నవ్వేసింది నిర్మల. "మీరు చూశారా?"

"ఆఁ ఏవో కొన్ని." గదిని పరిశీలిస్తూ పరధ్యానంగా సమాధాన మిచ్చింది మాధవి.

చక్రవర్తి ప్రవేశించాడు. "నిర్మలా, భోజనాల ఏర్పాట్లు చెయ్యి. మీ వదినని బలవంతంగా తీసుకొచ్చా నిప్పుడు భోజనానికి. ఎక్కడికీ రా ననే ఆ పంత మేమిటో యివ్వాళ తేల్చేశాను. ఎలాఉందండీ, మాధవీ, మా యిల్లు?"

ఏకధాటిగా మాట్లాడేస్తున్న చక్రవర్తి, నిర్మల కండ్ల లోని సంశయాన్ని గ్రహించలేదు. అది గమనించిన మాధవి, "మీ అన్నగారు ఊళ్ళో లేరు. అందుచేత అంత పనిలేదు. మీరిదివరలో రెండుసార్లు పిల్చి రానందుకు కోపగించారు. ఆ కోపం పోగొడదామని డాక్టర్‌గారు పిలవగానే వచ్చేశాను" అంది నవ్వుతూ.

నిర్మల నేత్రాలు అతి వేగంగా అటు యిటు చలించాయి "ఓ! అయితే యిప్పుడు వారితో వచ్చారన్నమాట

మీరు ! మీకు వంట్లో బాగుండులేదని విన్నాను. బాగానే వున్నారే !" అంది మళ్ళీ నిర్మల.

ఎవరో పిలువగా చక్రవర్తి లేచి వెళ్ళాడు.

అవకాశం దొరికిన పద్మ, "త్వరలో ఆవిడ పాపాయి నెత్తుకో బోతున్నారమ్మా. అదే బాగులేకపోవటం. అందుకే నన్ను రోజూ రాత్రిళ్లు సాయం పంపిస్తున్నారయ్యగారు" అని చెప్పింది.

నిర్మల ముఖంలో త్వరత్వరగా రంగులు మారిపోవడం జాగ్రత్తగా చూస్తున్న మాధవి దృష్టి అప్పుడే తిరిగి గదిలో ప్రవేశించిన చక్రవర్తిపైకి మళ్ళింది.

"మాధవిగా రిక్కడే భోంచేస్తారు. నాయర్‌తో చెప్పి వచ్చాను. రండి, మా యిల్లు చూద్దురుగాని. ఏం నిర్మలా, ఆవిడ రాక రాక వస్తే అలాకూర్చోబెట్టావ్ ?" గబగబా మాట్లాడేశాడు చక్రవర్తి.

నిర్మల లేని నవ్వు తెచ్చుకొని "రండి" అంటూ బయల్దేరింది. మాధవి మౌనంగా అనుసరించింది.

"మీఅంత నేర్పుగా యింటి నలంకరించడం మాకు రాదు. నవ్వకండి" అన్నాడు చక్రవర్తి.

"మీకు పొగడ్త బాగా వచ్చు. ఏం, మీ యింటికేం ? ఫస్టుగా ఉంది" అంది మాధవి.

"పొరుగింటి పుల్లకూర..." అంది నిర్మల మెల్లగా. అది విన్న చక్రవర్తి ముఖం భూమిలోకి క్రుంగిపోయింది. మాధవి మనస్సుకూడా చివుక్కుమంది. ఆమాటలో దాగిఉన్న మోటు అర్థం తెలిసే అందా, తెలియక అందా?

నిర్మలను పరీక్షగా చూచింది మాధవి. ఆమె మాటలలో వివేకంగాని, వినయ వినమ్రతలుగాని, కన్పించవు. ఆమె నవ్వులో మధురిమ, ఆహ్లాదం ద్యోతకం కావు. తగని నిర్లక్ష్యం, గర్వం కాంతివిస్తాయి ఎదుటివారిని మన్నించటం కాని, గౌరవించటం కాని తెలియని ఆ వ్యక్తి స్నేహబంధుత్వాలకు తగదనిపిస్తుంది. అందగత్తెలలోనే లెక్కకాని ఆ రూపానికొక విశిష్టత లేదు; ఆ అలంకరణకొక ప్రత్యేకత లేదు. అన్ని విధాలా ఉన్నతుడైన చక్రవర్తికి ఏ మాత్రమూ తగదనిఇష్టేస్ఫురిస్తుంది.

మాధవినీ, చక్రవర్తినీ తమ తమ ఆలోచనలలో వదిలేసి త్వరత్వరగా ఏదో పనున్నట్టు అక్కడినుంచి వెళ్ళిపోయింది నిర్మల. ఒక గదిలో నిలువెత్తు చిత్రపటం చూడగానే చవ్వున ఒకనాడు పద్మ చెప్పిన విషయం గుర్తు వచ్చింది మాధవికి. చాలాసేపు తన్మయమై చూసింది మాధవి ఆ చిత్రపటాన్ని. ఆ చిత్రంలోని స్త్రీ సౌందర్యం అసాధారణం, సాక్షాత్తూ కవులు వర్ణించినట్లు కలువ రేకులువంటి నేత్రాలు, సంపంగి బోలిననాసిక, శ్రీకారములవంటి చెవులు, దొండపండువంటి చిన్న మూతి, కొనదేలినగడ్డం, చెంపలను ఒత్తుగా ఆవరించిన తుమ్మెద రెక్కలవంటి జుత్తు, శంఖంవంటి మెడ, సన్నమూ లావుకాక, పొడుగూ పొట్టికాక నిండైన విగ్రహం, కళకళలాడుతూ జీవ కళతో ఉంది.

"ఎవరిదీ ఫోటో, డాక్టర్‌గారూ?" మెల్లగా అడిగింది మాధవి.

సమాధానం రాక వెనుదిరిగి చూచింది. చక్రవర్తి కూడా తదేకంగా ఆ చిత్రాన్నే చూస్తున్నాడు. మాధవి

అటు తిరగడంలో చటుక్కున ముఖం మరో ప్రక్కకు త్రిప్పు కున్నాడు. "ఒక అభాగిని. అంతకంటే యింకేమీ అడుగవద్దు" అంటూ మరో గదిలోకి సాగిపోయాడు తడిసి బరువుగా ఉన్న అతడి కనురెప్పలు చూచిన మాధవి మరేమీ ప్రశ్నించలేక పోయింది. కాని చక్రవర్తి పట్ల జాలితో కరుగుతూన్న హృదయం ఒక్కసారి గడ్డకట్టుకుపోయింది. 'ఛీ ! యిటువంటి వాడితో చనువుగా ఉండకూడదు. ఏ రహస్యమూ లేకుంటే ఎందు కంత దాపరికం ? పాపం నిర్మల ఎలా ఓర్చు కుంటూందో?'

భోజనాల వద్ద నిర్మల ముక్తసరిగా ఉంది. డాక్టర్ ఏదో పరధ్యానంగా విచారంగా ఉన్నాడు. మాధవికి చాలా ఇబ్బందిగా వుంది.

'చాలాపొరపాటు చేశాను అనాలోచితంగా వచ్చే శాను. ఇలా వచ్చివుండ కూడదు' అనుకొంది. మరీ అంత నిశ్శబ్దాన్ని భరించలేక తానే సంభాషణ ప్రారంభించింది. "మీరేమైనా కుట్లూ, అల్లికలు అవీ అల్లగలరా?" అడిగింది నిర్మలను.

"ఆఁ ! అంత శ్రద్ధ ఎవరికీ ? ఏ మహిళా నిలయంలోనో డబ్బు పారేస్తే వాళ్ళే తయారు చేస్తారు కావలసినన్నీ." నిర్లక్ష్యంగా అంది నిర్మల

"మీాకసలు శ్రద్ధ లేదన్నమాట! వుంటే అనేక రకాలు అల్లుకోవచ్చు. ఇష్టమైన కుట్లు కుట్టుకోవచ్చు. చాల సరదాగా కూడా వుంటుంది."

వెటకారంగా నవ్వింది నిర్మల. "ఎక్కడో యి కైలాసమనుకుంటూ, గుళ్ళో లింగాలల్లే కూర్చునే వాళ్ళకు అవన్నీని. సోషల్ లేడీస్‌కి కాదు. అయినా నాకు తెలియ కడుగుతాను మాధవిగారూ—ఎంతసేపూ ముసలమ్మల్లా ఆ పనీ ఈ పనీ చేసుకుంటూ కుట్టుకుంటూ కూర్చోవడం విసుగ్గా ఉండదూ? లేక యింత చదువుకున్న నొప్పదాన్ని, అందరితో కలిసి తిరగడ మేమిటనా!"

అంతవరకూ మౌనంగా భోజనం చేస్తున్న చక్రవర్తి కోపంగా తలెత్తాడు. "కొంచెం మర్యాదగా మాట్లాడడం నేర్చుకో నిర్మలా. నోటికెంతవస్తే అంతా అనేయడమేనా!" నిప్పులు కురుస్తున్నా యతడి కళ్ళలో, చక్రవర్తి కూడా అంత కోపం తెప్పించుకో గలగడం మాధవికి ఆశ్చర్యంగా ఉంది.

సహజంగా పెంకెదైన నిర్మలతో మరింత అభిమానం రేకెత్తింది. "మీా కనవసరం. మే మిద్దరం యేదో మాట్లాడు కునాం" అని మాధవివైపు తిరిగి "ఏమండీ క్లబ్ అంటే మీ కెందు కిష్టం లేదు?" అనడిగింది.

చక్రవర్తి జోక్యమే లేకపోతే నిర్మల మాటలకు సమా ధానమిచ్చి ఉండేదే కాదు మాధవి. నిర్మల ధోరణి ఆమె కెప్పుడూ అసహ్యాకరంగానే ఉంటుంది. కాని యిప్పుడు అనవస రంగా తన మూలాన భార్యాభర్త లిరువురి మధ్యా వాగ్వాదం పెరగడం తనకే సిగ్గనిపించిన మాధవి తప్పనిసరిగా ఏదో ఒకటి మాట్లాడవలసి వచ్చింది.

"చూడండి, నిర్మలా, మీారు నా గురించి అంత గర్వ మైన దాన్నని అనుకొంటే నే చేయగలిగిం దేమీా లేదు. కాని

అడిగారు, గనుక చెపుతున్నాను. అటువంటి విలక్షణమైన ఆలోచనలున్న పక్షంలో నేనూ తప్పకుండా వెనుకా ముందూ ఆలోచన లేకుండా షికార్లు తిరిగేదాన్నేమో? తిరగడమేం ఖర్మ? ఉద్యోగం కూడా చేద్దును కాని నా బుద్ధి, ఆలోచనా అంతవరకే పరిమితం కాలేదు. నేనేదైనా పనిచేసే ముందు నా బాధ్యతా, నా విలువా కూడా కొంచెం గుర్తుంచుకొని చేస్తాను. క్లబ్బులూ, వినోదాలూ నాకు తెలియవనుకున్నారేమో! చదువుకునే రోజుల్లో నేనూ ఆట పాటలలో కాలక్షేపం చేసిన దాననే. మీటింగులు ఉపన్యాసాలు అంటే అమితాసక్తి చూపించిన దాననే. బాధ్యతలు లేకుండా బంగారు కలలు కంటూ ఊహాలతో సామ్రాజ్యాలనే యేలిన రోజులవి. అలాగే యిప్పుడుకూడా ఉండాలనిమాత్రం నేను కోరను. ఇప్పుడు నాపైన బాధ్యతలున్నాయి. ఇంటిని దిద్దుకుంటూ, అలసివచ్చే భర్తగారి అవసరాలను తీర్చవలసిన గృహిణిని. స్త్రీగా నా ఉద్యోగాన్ని నేను నెర వేర్చకుండా మరో ఉద్యోగంకోసం, వినోదంకోసం పాకులాడటం అవివేకం. ఆర్థికస్థితి బాగులేనివారు చేస్తే చేసుకొంటారేమో? షికార్లు, సినిమాలలో పొందే ఆనందంకంటె నా యిల్లు నా సంసారం అనే బాధ్యతతో నా యింటిలో నేను సృష్టించుకునే స్వర్గమే నా కెక్కువ." ఎంత మెల్లగా చెప్పిందో అంత పదునుగా ఉన్నాయామాటలు. అందులో తన నెత్తి పొడుస్తూన్న గూఢార్థానికి నిర్మల ముఖం ఎంతగా వాడిపోయిందో చక్రవర్తి ముఖం అంత దేదీప్యమానంగా మెరియడం మాధవి గమనించలేదు.

తిరిగి మాధవే మెల్లగా అంది. "నేను సాధారణంగా ఎవరితోనూ వాదించను, నిర్మలా. ఉద్దేశ్య పూర్వకంగా అనకపోయినా కొన్ని మాటలు ఎదుటివారి వ్యక్తిగత విష యాలపైకి పోతాయి. నా మాటలలో ఏమైనా మిమ్మల్ని బాధించితే క్షమించండి" అంటూ డైనింగ్ టేబుల్ ముందు నుంచి లేచింది. కృత్రిమపు నవ్వు ఒకటి బలవంతాన అవతరిం చింది నిర్మల పెదవుల మీాద.

"దానికేముంది? అవిడేదో అడిగింది. మీారు తోచిన సమాధానం చెప్పారు" అంటూ లేచాడు చక్రవర్తి.

నిర్మల స్నేహితు రాండ్రిద్దరు రావడంతో ఆ సంభా షణ అంతటితో ఆగింది. అందరూ డ్రాయింగ్ రూమ్‌లో చేరి కబుర్లు చెప్పుకొంటూండగా పోస్టులో రవీంద్రవద్దనుంచి ఉత్తరం వచ్చింది చక్రవర్తికి.

"ప్రియమైన చక్రవర్తీ !

నీ ఉత్తరం అందింది. మా గురించి నీవు చాల శ్రమ పడుతున్నందుకు ఎలా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలియడం లేదు. మాధవి నీ గురించి చాలా వ్రాసింది. త్వరలో రావ టానికి ప్రయత్నిస్తాను. అంతవరకు నీకే శ్రమ తప్పదు. మాధవి ఆరోగ్యం జాగ్రత్త.

'బావా, చెల్లాయికోసం బెంగపెట్టుకోకు. క్షేమంగా వుం'దని వ్రాశావు. అందుకు సమాధానం నేవచ్చాక చెప్పా కుందువుగాని, హాస్యం చెయడంలో నువ్వు శ్రీధరం బావని కూడా మించి పోయావు. అన్నట్లు యిక్కడ ఎన్నిరకాల

పూల మొక్కలున్నాయను కొన్నావు! నిత్యం మాధవి నువ్వూ నీ తోటా నా నేత్రాలలో మెదలు తున్నారు. మాధవికి కూడ మొక్కలంటే చాల సరదా! అయితే నీ అంత పిచ్చి లేదనుకో! నే వచ్చేటప్పుడు మంచి మంచి మొక్కలు మన తోటలో లేని రకాలు తీసుకొస్తాను. ఇంకా యేమైనా యిక్కడ కావసినవివుంటే వ్రాయి. వుంటాను మరి

మాధవి జాగ్రత్త.

నీ బావ.

రవి."

ఆ లేఖ గురించీ, మాధవీ రవీంద్రుల దాంపత్యం గురించీ చక్రవర్తి కొంచెం హాస్యం జోడించి చెప్పే సరికి అందరూ 'రొమాంటిక్ పెయిర్' అంటూ ఎగతాళి పట్టించారు మాధవిని. ఈ సంఘటనతో అంతకు ముందావరించిన నీలి మేఘాలు చెల్లా చెదరై పోయినట్లు కన్పించాయి. అంతా కలిసి క్రొత్త పిక్చర్ మాటినీకి వెళ్దామని ప్రతిపాదించింది నిర్మల స్నేహితురాలు వనజ. అందరూ ఒప్పుకున్నారు. మాధవి మాత్రం ఒంట్లో బాగుండలేదనే సాకుతో తప్పుకుంది. మర్యాదకు మాత్రం, "సాయంకాలం అంతాటీకి మా యింటికి రండి." అని ఆహ్వానించింది.

ఇంటికి తిరిగి వచ్చిన మాధవికి ఏదో కృత్రిమ కల్మష వాతావరణం నుంచి బయటపడ్డట్లనిపించింది. తన సంసార మొక అమృతభాండంగా, తన గృహమొక అపర వైజయంతంగా, తాము ఆదర్శదంపతులుగా – లక్ష్మీనారాయణులుగా–

తోచి సంతోషించింది. కొద్దిగా గర్వంకూడా కలిగింది. పని మనిషి ఒక ఉత్తరం తెచ్చి యిచ్చింది. క్యాంపునుంచి రవీంద్ర వ్రాశాడు.

"ప్రియాతి ప్రియమైన మాధవీ,

క్షేమంగా ఉన్నాను. నీ ఉత్తరంలో యిచ్చిన హెచ్చరికలన్నీ తు. చ తప్పకుండా ఆచరిస్తున్నాను. చక్రవర్తికూడా వ్రాశాడు. అతడి మంచితనానికి ఎంతైనా కృతజ్ఞుడుని. అతడి వల్లనే యింత దూరాన ఉండికూడా నీ విషయంలో నిశ్చింతగా ఉండగలుగుతున్నాను.

"ఇక్కడ చలి కొంచెం ఎక్కువగా ఉంది. కాని పరిసరాలన్నీ చూడ ముచ్చటగా అందంగా ఉన్నాయి. హేమంత శోభ యిక్కడే యింత అందంగాఉంటే మన కాశ్మీర్ లో అక్కడా ఎంత బాగుంటుందో అన్పిస్తూంది. ఉదయమే లేచే సరికి ఎదురుగా కొండలపైన అందంగా కురిసే మంచు కన్పించగానే 'నువ్వేం జేస్తున్నావో!' అన్పిస్తూంది. బంగళా చుట్టూ ఉన్నతోటలో పూసిన రకరకాల పువ్వులు, వాటిపై ఎగిరే తుమ్మెదలు చూస్తే నువ్వు చాల సంతోషించే దానవు. ఎంత బాగున్నాయని ?

"నిన్న సాయంకాలం చాల దూరంలోఉన్న కొండల పైకి షికారు వెళ్ళాను, ఆకుపచ్చని చీరకట్టి, పసుపు పచ్చని పూలతో అలంకరణ చేసుకున్న కాంత హుందాగా నిలిచి నట్లుంది ఒకో పర్వతము. ఒక చోట అందమైన జలపాతం ఉన్నది. ఆ సాయంకాలపు నీరెండ శోభలో దాని అందమేమని

వర్ణించను! ఈలోయల సౌందర్యం వర్ణించడం నాకు తరమా ? ప్రక్కన నీవుంటే ఎంతో బాగుండుననిపించింది. నీకలానికి మంచి కావ్యవస్తువులు లభించి, క్రొత్త పోకడలతో చిందులు త్రొక్కే నూతన రచనా స్రవంతులు వెలువడివుండేవి.

“నవ్వుకొంటున్నావా, మాధవీ, నాధోరణిచూచి ? ఎప్పుడూ కలిసి తిరిగేవాళ్ళం, ఈసారి నువ్వురాలేదు. అందుచేత చూచిన అందాలన్నీ నీకు చెప్పాలనిపించింది. కాని అన్నీ చెప్పలేకపోయాను. ఆక్షేపించకేం ? నువ్వు సహజంగా కవయిత్రివి నీ అంత చక్కగా నేను వ్రాయలేను. అందులోనూ మనం లేఖలు వ్రాసుకోవడం యిదే ప్రథమం. అందుచేత చాలా జాగ్రత్తగా వ్రాస్తున్నాను. క్షంతవ్యుడిని, తప్పులుంటే.

నీ రవీంద్ర.”

నవ్వుకుంది మాధవి అతడి హాస్యధోరణికి. అమితోత్సాహంతో భర్త ఉత్తరానికి జవాబు వ్రాసి కాస్సేపు విశ్రమించింది.

## ౧౭

మంచి నిద్రలో ఉన్న మాధవి ఫోన్ కాల్ విని లేచింది. తాము వస్తున్నట్లుగా నిర్మల చెబుతూ ఉంది. ఆ సంగతి మరచిపోయిన మాధవి త్వర త్వరంగా లేచి ముఖం కడిగి, బట్టలు మార్చి, కాఫీ టిఫిన్ల తయారీలో లీనమైంది.

అంతా వచ్చాక హాల్లో కూర్చుని సరదాగా కబుర్లతో కాలక్షేపం చేశారు. కాఫీలైన తర్వాత సిగరెట్ పీలుస్తూ

చక్రవర్తి ఆడవాళ్ళకు దూరంగా వెళ్ళిపోయాడు. అందరూ లేచి యిల్లంతా చూడడం ప్రారంభించారు. మాధవి వేసిన చిత్రాలనూ, కుట్లనూ, అల్లికలనూ, గృహాలంకరణలో ఆవిడకు గల నేర్పునూ మెచ్చుకోకుండా ఉండలేకపోయారు. మేడమీాద గదిలో వీణను చూడగానే మాధవిని పాడమని కోరింది ఒకామె.

"ఇప్పుడు పాడక తప్పదంటారా?" జాలిగా చూచింది మాధవి.

"ఏం? తోటల్లోనే కాని మేమడిగితే పాడలేరా?" అంది నిర్మల నవ్వుతూనే.

ఆ మాటకు అర్థం వెంటనే స్ఫురించలేదు మాధవికి. తప్పని సరిగా ఒక కృతి పాడింది, వీణవాయిస్తూ, అందరూ ముక్త కంఠంతో ప్రశంసించారు మాధవి గానాన్ని. కాని ఏమీా మాట్లాడని వ్యక్తి ఒక్క నిర్మల మాత్రమే. ఆమె దృష్టిని టీపాయ్ మీాదున్న ఫ్లవర్ వేజ్ ఆకట్టేసింది. అందులో ఒకే కొమ్మకు అయిదురంగుల పువ్వులు పూసిన బొగేన్ విల్లా కొమ్మ అమర్చబడి ఉంది.

"ఇటువంటిది ఈప్రాంతాల ఎక్కడా లేదు. ఎక్కడి నుంచో తెప్పించి మావారు శ్రద్ధగా పెంచుతున్నారు. మరి మీాకెక్కడిది?" అనడిగింది మాధవిని.

సన్నగా నవ్వింది మాధవి. "గొప్ప ధర్మ సందేహమే! మీా తోటలోదే, సిన్న పద్మ తెచ్చింది."

ఇక అక్కడ నిలువలేక పోయింది నిర్మల. "ఇహ మనం పోదామా?" అంటూ చటుక్కున

"ఇంతకూ డాక్టర్‌గారేరీ? తోటలోకి వెళ్దామను కొన్నాం కదా?" అన్నది వనజ.

చూడగా, చక్రవర్తి రీడింగ్‌రూమ్‌లో కూర్చుని ఏదో కథ వ్రాత ప్రతిని తదేకధ్యానంతో చదువుతున్నాడు.

"నేను తోటలోకి రాను ఎక్కడికీ రాను. యింటికి పోదాం" అంది నిర్మల, రుసరుసలాడుతూ. కాని అది గ్రహించని చక్రవర్తి లేస్తూ-

"అదేం? ఆవిడ సినిమా కార్యక్రమం త్రోసేస్తే, నువ్వు షికారు కూడా పాడుచెయ్యి. అదేం వీలు లేదు. అందరూ తోటలోకి రావలసిందే. మాధవిగారూ, మీకూ చెప్తు న్నాను. కాదనకూడదు. నేను కారు దగ్గిరికెళ్తున్నాను. త్వరగా లెండీ" అన్నాడు.

ఇష్టంలేకున్నా మాధవి కూడా విధిగా అనుసరించవలసి వచ్చింది.

"మీరూ, డాక్టరుగారూ ఏమైనా బంధువులా?" అనడి గింది వనజ, మాధవిని గుచ్చి గుచ్చి చూస్తూ.

"ఏమలా ధర్మసందేహం హఠాత్తుగా కలిగింది?" ఎదురు ప్రశ్న వేసింది మాధవి.

"ఆఁ ఏంలేదు మీచనువుచూచి అడుగుతున్నాను."

నవ్వేసింది మాధవి. "మరి, నిర్మల చెప్పలేదా? మా వదినా, నిర్మలా అక్క చెల్లెళ్ళు అవుతారు. డాక్టరు నాకు అన్న వరుస."

నిర్మల మాట్లాడలేదు. బరువుగా నిట్టూర్చింది.

ధనుర్మాసపు శోభతో కళకళ లాడిపోతుంది పూల తోట. ఎటుచూచినా అందాలు ఒలకపోస్తూ ఆగవిచ్చిన పూలబాలలు, పువ్వు పువ్వునూ పలుకరిస్తూన్న రంగు రంగుల సీతాకోక చిలుకలు, సాయంకాలపు నీరెండలో మిల మిల లాడుతున్న తామలకొలను, పూలసౌరభంతో మైమరపించే చల్లనిగాలి, నేత్రపర్వంగా ఉన్న దృశ్యాలకు తోడు స్వేచ్ఛగా ఎగురుతూ వీనుల విందైన గానాన్ని విన్పించే శుక పిక శారి కాదులు. ఆ మనోహర వాతావరణంలో సహజంగా ఊహా కల్పనా శక్తిగల మాధవి మది భావతరంగితమై ఉప్పొంగింది.

"ఇటువంటి నందన వనంలో రోజూకాలం గడపగల మీారు అదృష్టవంతులు" అన్నది నిర్మలనూ, చక్రవర్తినీ ఉద్దేశించి.

"ఆ. అంతా అదృష్టమే. దానికయ్యే వేలకువేలు ఖర్చు కూడ అదృష్టమే" అంది నిర్మల.

"అదేమిటి నిర్మలా? ప్రతిదీ రూపాయణాలతో లెక్క జూచుకుంటామా? ఎంత డబ్బుంటేమాత్రం — ఇంత అంద మైన పనిజేయగల కళాత్మక హృదయం ఎక్కడుంది చెప్పండి" అన్నది మాధవి.

చక్రవర్తి కలుగజేసుకున్నాడు. "పోనివ్వండి, మాధవి. కొందరికంతే అర్థమవుతుంది. సహజంగా వుండాలి కాని, వాద నతో కళాదృష్టిని కలిగించలేం. ఎప్పుడైనా బలవంతం మీాద తప్పితే ఆవి డసలు ఇటుప్రక్కకు రానేరాదు. ఎంతసేపూ పువ్వులు అలంకరించుకోవడంలోనే శ్రద్ధంతా."

నిర్మలకు కోపం వచ్చింది. "అవును. మీరూ, మీరూ చదువుకొన్నారు గనుక తెలుస్తాయి ఆ అందాలన్నీ. నాలాటి మొద్దు కెలా తెలుస్తాయి?" అని విసురుగా అక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది, వెనుకనుంచి 'కలహకంఠి' అని చక్రవర్తి చేస్తూన్న పరిహాసాన్నికూడా లెక్క చేయకుండా.

'సరసంగా ఏం మాట్లాడబోయినా పెడర్థాలు తీసే అటువంటి నిర్మలతో ఎలా మాట్లాడటం? ఎప్పటి కప్పుడు వీళ్ళను తప్పించుకు తిరగబోయి మళ్ళీ వీళ్ళమధ్యకే వచ్చి పడు తున్నాను ఛీ' ఇదంతా రవీంద్ర లేకపోవడం మూలాన వస్తూంది. తనను ఒంటరిగా విడిచివెళ్ళేవాడు వెళ్ళక, ఆ చక్రవర్తికి ఒప్పచెప్పి వెళ్ళడం ఎందుకో?' అని తలపోయసాగింది బాధగా మాధవి.

ఆమె బాధపడిందన్న సంగతి గ్రహించిన చక్రవర్తి, "కొందరి తత్వమే అంత. ఏమనుకోకండి కాని, మీరు బొత్తిగా అంత పరాయివాళ్ళ మాదిరిగా ఉండకండి మరి. మీకు రావాలనుకున్నప్పుడు తోటలోకివచ్చి వెళ్ళుతూండమని చెప్పానుగా? అవసరమైతే నాకు ఫోన్ చేస్తూండండి. కారునీ, డ్రైవర్నీ కూడ పంపిస్తుంటాను" అని లేచి అన్నిటికీ నీళ్లు వెళ్ళాయో లేదో చూడటానికి బయలుదేరాడు.

'ఇతడి సహృదయానికే సంతోషించనా, నిర్మల నిరసనకే విచారించనా?' అనుకొంటూ లేచి మాధవి, సన్న జాజుల మాలకడుతూన్న వనజ దగ్గర కూర్చుంది. చక్రవర్తి వచ్చి, "అక్కడ కుటీరం దగ్గర కూర్చుందాం, రండి, అంద రూను" అన్నాడు.

"అంతకంటె ఈ చెరువు దగ్గరే బాగుంటుంది" అంది మాధవి. మారుమాట్లాడకుండా చక్రవర్తికూడ అక్కడే కూర్చున్నాడు. నిర్మలా, వనజా ముఖ ముఖాలు చూచు కున్నారు.

"ఒక పాట పాడండి" అంది వనజ, మాధవిని.

"ఎంతసేపూ నన్ను అంటారు కాని మీ రెవరూ పాడ రేం?" అందిమాధవి.

లక్ష్మి అనే మరొకావిడ చెప్పింది: మేమంతా పల్లె టూళ్ళలో పుట్టి పెరిగిన వాళ్ళమే. అక్కడ చదువు సంగీతా లేముంటాయి చెప్పండి?"

"అవునులెండి. కాని ఇప్పుడిప్పుడు పల్లెటూళ్ళనుంచి వచ్చి అంతా చదువు కుంటున్నారు. చాలా పల్లెటూళ్ళలో కూడా హైస్కూళ్ళు వచ్చాయి. వెనుకటంత పట్టింపులు లేవు" అంది మాధవి.

చక్రవర్తి నవ్వుతూ, "మానిర్మల పట్టణాల్లోనే పెరిగింది లెండి. ఎటొచ్చీ నాగరికతలేకాని, చదువుసంధ్య లామె దగ్గరకు రామన్నాయట" అన్నాడు. నిర్మల మూతి మూడు వంపులు త్రిప్పింది.

"ఊరుకుంటావేం నిర్మలా ? చదువు సంధ్యలుంటే డాక్టర్‌గారి ఆటలు సాగేదెలా ?' అని అడగవద్దూ నువ్వు?" అంది వనజ.

చక్రవర్తి నవ్వాడు. "స్నేహితురాలిపై పక్షపాతం కాని, నాకు ఆటలేమున్నాయండీ? ఏమో, నేను చాలా బుద్ధి మంతుణ్ణిట" అన్నాడు బుంగమూతిపెట్టి. ఈసారి నిర్మలతో

సహా అందరూ వచ్చారు. మళ్లీ వాతావరణం తేలిక అయింది. గులాబీలు తీసుకొచ్చిన తోటమాలితో, "కొంచెం ఆ మోటార్ ఆపెయ్యిబాబూ. మేం వెళ్ళాక వేసుకొందువు గాని" అన్నది మాధవి.

"ఇంకా అన్ని మొక్కలకూ నీరందలేదమ్మా" అన్నాడు వాడు చేతులు నలుపుకుంటూ.

"ఫర్వాలేదు. ఆపెయ్యి, ఆవిడకు చిరాగ్గా వున్నట్లుంది" అని ఆజ్ఞాపించాడు చక్రవర్తి.

వనజ కళ్లు విచిత్రంగా కదిలాయి. "అయితే డాక్టర్ గారిమీద స్వంత చెల్లెలుకంటె ఎక్కువ అధికారమే సంపాదించారే!" అంది సాలోచనగా చూస్తూ. హఠాత్తుగావచ్చిన ఆ విసురుకు విస్తుపోవడం తప్ప మాధవి ఏమీ సమాధానం చెప్పలేకపోయింది.

డాక్టర్ ముఖం ముడుచుకున్నాడు "మాధవిలాంటి చెల్లెలుగల అన్న చాలా ధన్యుడై ఉండాలి. నావంటివాడు కాదు" నిట్టూర్చి గబుక్కున లేచి, "ఇక పోదామా?" అన్నాడు. అంతకుముందే నిర్మల కారువైపు నడిచింది.

మాధవిని ఇంటిదగ్గర దిగుతూ, "చూడండీ మీ రీడింగ్‌రూమ్‌లో ఉన్న ఆ క్రొత్తకథ ఒకసారి ఇవ్వండి. ఇందాక సగంలో ఆగిపోయింది" అన్నాడు చక్రవర్తి.

మాధవి తెచ్చి ఇస్తూ, "నా హాండ్‌బాగ్ తోటలో మరచిపోయాననుకుంటాను డాక్టర్ గారూ" అన్నది సందేహిస్తూ.

"మరచిపోయారా? ఎక్కడికిపోదు. నేను రేపు వెళ్ళినప్పుడు తెస్తానులెండి."

"తప్పకుండా తేవాలి. అది ఒకసారి అన్నయ్య హైదరాబాద్‌నుంచి బహుమతిగా తెచ్చాడు. నాకెంతో అభిమానమదంటే" అన్నది.

"అలాగే." ముక్తసరిగా అని కారు పోనిచ్చాడు చక్రవర్తి. ఇంకా నిర్మలతో ఏమో మాట్లాడుదామనుకొన్న మాధవి విస్తుపోయింది.

## ౧౮

ఈ కాలంలో ఎన్నడూ లేనిది ఈ సంవత్సరం బలమైన గాలి వీస్తూంది. హోరుమనే చెట్ల కదలిక వినుగొస్తూంది.

కళ్ళు మూసుకుపడుకున్న చక్రవర్తిని, "నిద్రపోయారా?" అని పలుకరించింది నిర్మల.

"లేదు."

"ఒక విషయం అడగదల్చుకున్నాను"

"......"

"మాట్లాడరేం? విసుగ్గా ఉందా?" నిర్మల కంఠస్వరం హెచ్చింది.

"నా విసుగూ విరామాల విషయం ఒకనాడాలోచించావు గనుకనా? నీ ఇష్టం" అంటూ అటువైపు ఒత్తిగిల్లాడు చక్రవర్తి. కొద్దిసేపు ఎవరూ మాట్లాడలేదు.

మెల్లగా అందుకుంది నిర్మల. "మీ ప్రవర్తన అర్థం చేసుకోలేకుండా ఉన్నాను. ఆ మాధవితో అంత చనువేమిటి మీకు? ఆ వనజ వాళ్ళ ముందు సిగ్గుతో చచ్చిపోయాను."

చాల సేపటివరకు మాట్లాడలేదు చక్రవర్తి. కడకు అన్నాడు: "ఊఁ. ఇంతకూ ఈ పిచ్చి నీ కెక్కిందా? ఆ వనజ లాంటి వాళ్ళేమైనా ఎక్కిస్తున్నారా?"

"నాకు కళ్ళున్నాయి. చెవులున్నాయి." తీక్ష్ణంగా అని లేచి కూర్చుంది నిర్మల.

"అన్నీ వున్నాయి. ఉండవలసిన మెదడే లేదు. చూడు, నిర్మలా, చెప్పుడు మాటలు వినడమంత అనర్థం అదేకాని మరొకటి లేదు. అనుమాన జాడ్యం ఆవరించిందా— ఇహ సుఖశాంతులు మనవికావు. నిన్ను తప్ప నేను మరొక స్త్రీని ఎరుగను. నా కసలటువంటి చంచల గుణము, నీచపు కోరికలే లేవు. ఆ సంగతి నీకూ తెలుసు. నీకు నిజంగా నాపై అటువంటి అనుమాన మెప్పుడూ ఉండదు; నే నెరుగుదును. కాని నువ్వేమనుకున్నా సరే, ఒక్క విషయం చెప్పదలచు కున్నాను. నీ అసలు బాధ నాకు తెలుసు. నీ మనస్సంతా అసూయగుట్ట. ఎందులోనూ నిన్ను మించిన స్త్రీని చూచి నువ్వు ఓర్చలేవు. అందుకేగా మాధవిపై నీకంత అక్కసు!"

ఈ సూటి ప్రశ్నకు తట్టుకోలేక, వెంటనే జవాబివ్వలేక కన్నీరు ఒత్తుకుంటూ కూర్చుంది నిర్మల.

భార్య కంటనీరు చూడగానే కరిగిపోయాడు చక్రవర్తి. లేచి నిర్మల దగ్గరగా వెళ్ళాడు. చెక్కిళ్ళను తడిపేస్తూన్న అశ్రువులు ఒత్తుతూ, "చూడు నిర్మలా, నాపై నీకెంత నిర్లక్ష్య మున్నా నీపై నాకు కోపంలేదు. నువ్వు సుఖంగా సంతోషంగా ఉండడమే నాకు కావాలి. అనవసరమైన అపోహాలతో నువ్వు బాధపడి నన్ను బాధపెట్టకు. మాధవిపై నాకొక గౌరవం,

స్నేహాభావం. అంతే. ఒక్క విషయం ఆలోచించు. నాస్నే హితు లందరితో నువ్వు స్వేచ్ఛగా మాట్లాడతావు, ఆడతావు. నేనున్నా లేకపోయినా వాళ్ళతో సినిమాలకూ, షికార్లకూ వెళతావుకదా, నీ అంత అనుమానపు మనిషినైతే అలా తిరగనిచ్చే వాడినేనా?"

ఏడుపు మానేసి ఆశ్చర్యంగా కళ్ళెత్తింది నిర్మల. "చేసే పనులు చేస్తూనే ఎంత తియ్యగా మాట్లాడతారు ? నేను వాళ్ళతో ఎప్పుడూ హద్దులు మీరి ప్రవర్తించలేదు."

చేతులలో ఉన్న నిర్మలను వదిలేసి దూరంగా వెళ్ళాడు చక్రవర్తి. అయితే నేను హద్దులు మీరానంటావా ?"

"కాదనగలరా?"

"ఛీ. నోర్ముయ్."

మంచంమీదనుంచి లేచి డ్రాయర్ సొరుగులో ఉన్న ఒక కాగితం మడత తెచ్చింది నిర్మల.

"ఇదేమి టంటారు మరి? ఆవిడ స్వయంగా వ్రాసి ఇచ్చిన పాట, మీ జేబులోకి ఊరికే ఎగిరి వచ్చిందికదూ ? నా నోరు మూయించగలరుకాని, మరో నాలుగు రోజులు ఇలాగే జరిగితే ఎవరినోరూ మూయించలేరు."

ఆ కాగితం చూస్తూనే నీళ్ళు కారిపోయాడు చక్రవర్తి. 'తానడగగానే నిస్సంకోచంగా నిర్మల హృదయంతో మాధవి వ్రాసిన అంత మనోరంజకమైన పాట, ఇంత అసహ్యాకరమైన అనుమానానికి దారితీసిందా?'

భర్త మౌనం చూచిన నిర్మలకు మరింత ధైర్యం వచ్చింది. "మాట్లాడలేకపోతున్నారేం, పట్టుబడ్డాననా ?

అంతగా చదువూ సంగీతాలకోసం వెర్రెత్తిపోయేవారు నాలాటి మొద్దు నెందుకు చేసుకున్నారు ? ఆ రోజున నా కట్నాని కాశపడ్డారు. ఇవాళ కట్టుకున్న దెల్లాగైనా పడుం టుందన్న ధైర్యంతో—"

"ఆపు నిర్మలా" చక్రవర్తి గర్జనతో నిర్మల ఆగి పోయింది. "అంతతో ఆపు. ఔను. మొద్దువే. అక్షరాలా మొద్దువే. లేకపోతే నన్నర్థం చేసుకొని ఉండేదానవు. చదువ గలిగినవాళ్లు క్రొత్తపుస్తకం చూడగానే చదువుతారు. సంగీతం తెలిసినవాళ్ళు క్రొత్తపాట వినగానే పట్టుకోజూస్తారు. సంగీతంపై అభిమానంతో కాదూ, నీకు నేర్పిద్దామని ప్రయత్నించాను ? మొద్దువే గనుక కాకుంటే ఇంత వివరంగా చెప్పాక అయినా అర్థంజేసుకొందువు. మాధవినిచూస్తే నాకు సుధను చూచినట్లే ఉంటోంది. చచ్చిపోయిన సుధ ఆత్మసాక్షిగా చెబుతున్నాను! మాధవిపై అందుకే నా కభిమానం. ఇంకేమీ లేదు."

నిర్మల శాంతించకపోగా మరింత ఉగ్రురాలై పోయింది. "అవునూ, సుధ. నా పాలిట బ్రహ్మరాక్షసి, అయిన వాళ్ళందరికీ దూరంచేసింది. ఇప్పుడీ మాధవి. చచ్చిన దొకతె, బ్రతికిన దొకతె—నా జీవితాన్ని నరకం జేస్తున్నారు." రెండు చేతు లతో ముఖం కప్పుకొని రోదిస్తూన్న నిర్మలను చూచి అసహ్య పడ్డాడు చక్రవర్తి.

"ఛీ. ఛీ హృదయంలేని మట్టి బొమ్మ. విషపురాశి. నా సుఖశాంతులను గురించి నాకంటే ఎక్కువ ఆలోచించవలసిన భార్యవు—అనునిత్యం ఇలా రంపపుకోత పెడుతున్నావు. నిన్ను నేను క్షమిస్తున్నాను; కానీ భగవంతుడు క్షమించడు.

ఎంతమాత్రం క్షమించదు నిర్మలా." తలుపు తీసుకు వెళ్ళి పోతున్న చక్రవర్తికి గుమ్మం ప్రక్క నిల్చున్న పద్మ కన్పించి, "మాధవి గారింటికే పడుకోవటానికి వెళ్తున్నానుడాక్టర్" అంది.

"సరే. వెళ్ళు." మేడ దిగి వెళ్ళిపోయి క్రింద గదిలో కటిక నేలపై పడుకొన్నాడు చక్రవర్తి.



రాత్రి పన్నెండు గంటలకు డాక్టర్ చక్రవర్తి కారు రోడ్డు మీద దూసుకుపోతూంది. మెయిన్ రోడ్డుమీద తిన్నగా పోతున్న కారు హఠాత్తుగా సడన్ బ్రేక్‌తో ఆగిపోయి, రివర్సులో తిరిగి ప్రక్క వీధిలో ప్రవేశించింది.

"పద్మా. రవీంద్ర మేడలో ఆ లైట్లేమిటి, ఈ టైములో?" కంగారుగా అడిగాడు వెనుక సీట్లో ఉన్న నర్సు పద్మను.

"ఏమో డాక్టర్! అదే నేనూ చూస్తున్నాను" అంది పద్మ మెల్లగా.

"మరేం ప్రమాదం జరుగలేదు కదా ? మాధవి ఒక్కతీ పాపం..." అంటూండగానే కారు రవీంద్ర ఇంటిముందు ఆగింది. గేటు, తలుపులు అన్నీ తీసి ఉన్నాయి. ఇంటినిండా లైట్లు, కాంపౌండులో ఒక ప్రక్క ఏదో కారు ఆగి ఉంది.

"సిస్టర్ని తోడు పంపావు కదూ యివాళ!" అంటూనే కారు దిగి హడావుడిగా లోనికి పరుగెత్తాడు చక్రవర్తి పద్మ మాత్రం కారు దిగ లేదు.

"మాధవీ, మాధవీ! ఏం చేస్తున్నావమ్మా?" బిగ్గరగా అరుస్తూ వరండా దాటి హాల్లోకి వచ్చిన చక్రవర్తి సోఫాలో కూర్చుని జోళ్ళు విప్పుకుంటున్న రవీంద్రను చూచి ఆశ్చర్యపోయాడు.

"హల్లో! ఇదేనా రావడం? ఇంకా పదిరోజులకు కాని రానని వ్రాశావ్? పోనీలే, మాధవి బెంగతీరుతుంది. నా బాధ్యతా వదులుతుంది. ఇంకా ఏమిటింత రాత్రి వేళ లైట్లు వెలుగుతున్నాయని హడిలిపోయాను." సంతోషంగా మాట్లాడేస్తున్న చక్రవర్తి రవీంద్ర మాట్లాడక పోవడం చూచి ఆగిపోయాడు. "అదేమయ్యా, అలా ఉన్నావ్? ఒంట్లో బాగుందా?" అంటూ దగ్గరకు వెళ్ళి భుజంమీద చేయి వేశాడు.

మెల్లగా తలెత్తాడు రవీంద్ర. "ఒంట్లో బాగా? దానికేం బాగుండక?" ముఖం జేవురించి నేత్రాలు అరుణిమ దాల్చిన అతని రూపంచూచి విస్తుపోయాడు చక్రవర్తి.

"ప్రయాణంలో అలసి ఉన్నట్లున్నావ్. విశ్రాంతి తీసుకో. రేపు కలుద్దాం. నేనూ ప్రొద్దుటినుంచి ఒక సీరియస్ కేస్ అటెండయి విసిగిపోయాను. వస్తా. గుడ్ నైట్." రెండడుగులు వేసి మళ్ళీ వెనుతిరిగి, "నర్సును ఒకామెను సాయం పంపించాను. ఉందా?" అని ప్రశ్నించాడు.

"నేనొచ్చాక వెళ్ళిపోయింది" అన్నాడు రవీంద్ర, లేచి ప్రక్కగదిలోకి వెళ్ళిపోతూ. ఒక్క క్షణకాలం అలాగే నివ్వెరపోయి చూచి మెల్లగా వెళ్ళిపోయాడు చక్రవర్తి.

"రవీంద్ర వచ్చాడు. అనవసరంగా కంగారు పడ్డాను" అని పద్మతో చెప్పి కారు స్టార్టు చేశాడు.

చక్రవర్తి ఇంటికి చేరగానే సిస్టర్ ఎదురువచ్చింది. "రవీంద్ర బాబుగారొచ్చారని అమ్మగారు నన్ను పంపించే శారు" అని చెప్పింది.

"ఎలా వచ్చావ్?" ఆలోచిస్తూ అడిగాడు చక్రవర్తి.

"రిక్షామీద."

"అయితే దారిలో మాకెక్కడా కలియలేదేం?"

"గంటపైగా అవుతుంది డాక్టరుగారూ, నేనొచ్చి."

"గంటపైనా! అయితే." ఏదో ఆలోచించాడు. "అయితే రవీంద్ర వచ్చాక కొంతసేపున్నావా? వెంటనే వచ్చేశావా?"

ఏదో చెప్పబోయి సంకోచిస్తూ ఆగిపోయిందా నర్సు.

"ఫర్వాలేదు. చెప్పు."

"ఆయన రాగానే మంచినీళ్ళిస్తూ 'అప్పుడే వచ్చేశారే' మని అడిగారు మాధవిగారు. అందుకాయన "ఏం రాకూడ దనుకొన్నావా?" అని కోపంగా అంటూనే "నీకేం పనిక్కడ?" అనడిగారునన్ను. చెప్పాను, 'ఇక అవసరం లేదు. వెళ్ళవ' చ్చన్నారు, వచ్చేశానండి."

"మాధవి ఏమంది?"

"ఆగమని, డబ్బులిచ్చారు రిక్షామీద వెళ్ళమని."

ఒకక్షణం ఆలోచించి, "అయితే రవీంద్ర నాకేం కబురు చెప్పలేదా?" అన్నాడు.

"లేదండీ. అసలు మీమాటే ఎత్తలేదు."

"సరే. వెళ్ళు."

చక్రవర్తి పడుకున్నాడేగాని నిద్రపట్టలేదు. 'పాపం ప్రయాణంలో విసిగి వచ్చాడేమో? అంత తెలివైన మాధవి రాగానే ఎందుకలా అడిగింది? అయినా అదంత కోపం రావలసిన మాటా? పోనీ నాపై కోపం దేనికి? ఉత్తరాలలో అంత ఆప్యాయత ఒలికించాడు. ఎదురుపడితే మాట్లాడ్డంలేదు. నే వ్రాసిన ఉత్తరాలలో గాని ఏమైనా పొరపాట్లున్నాయా ? పది రోజులకుగాని రానని వ్రాసినవాడు, ఇంత హఠాత్తుగా రావడ మేమిటి?'

ఉదయం నిద్రలేవగానే తిరిగి అవేప్రశ్నలు మెదిలాయి చక్రవర్తి మనసులో. 'వాళ్ళలో వాళ్ళకేదో చిన్నకలహం రేగివుంటుంది. నాకెందుకింత కలత ? బహుశః ఉత్తరాలలో మాధవి ఏమైనా కోపం తెప్పించేటట్లు వ్రాసిందేమో!' త్వర త్వరగా స్నానం ముగించి బట్టలు వేసుకుని బయల్దేరాడు.

హాల్లోనే ప్రఫుల్లవదనంతో నవ్వుతూ ఎదురుపడిన మాధవిని చూడగానే చక్రవర్తి హృదయం తేలిక పడింది.

"మీ స్నేహితులు రాత్రి వచ్చేశారు డాక్టరుగారూ. నర్సు చెప్పిందా మీకు?" అంది విరిసిన కలువలా ముఖం పెట్టి.

చక్రవర్తి కనుబొమలు ముడిపడ్డాయి. రాత్రి తాను వచ్చిన సంగతి మాధవికి తెలియదన్నమాట! "ఏమైంది, వెళ్ళిన పని? ఏడీ రవీంద్ర?" అన్నాడు.

"ఇంకా లేవలేదు. రాత్రి రావడమే కాని ఏమీ మాట్లాడలేదు. భోజనమూ చెయ్యలేదు. కొంతసేపేదో ఆలో చిస్తూ కూర్చుని నిద్రపోయారు. ఆఫీసులో ఏమైనా గొడవ లొచ్చాయేమోనని నేనేమీ ప్రశ్నించి విసిగించలేదు."

"నేనూ అదే అనుకున్నాను. ఆఫీసు వ్యవహారాలేమైనా ఎక్కువగా ఉన్నాయేమో? నేను మళ్ళీ కలుసుకుంటాను లెండి. లేపద్దు పాపం" అని వెనుదిరగ బోయాడు.

"ఉండండి. కాఫీ తీసుకు వెళ్ళురుగాని."

కాఫీ అందుకుంటూ మెల్లగా చెప్పాడు చక్రవర్తి. "ప్రక్క ఊళ్ళో నిన్నరోజంతా ఒక సీరియస్ కేసు చూచుకుని రాత్రి బాగా ప్రొద్దుపోయి వస్తున్నాను. మీ ఇంట్లో ఇంకా లైట్లు వెలుగుతూండటం చూచి కారు ఇటు త్రిప్పాను. రవీంద్ర అన్యమనస్కంగా ఉన్నట్లు కన్పించాడు. సరే, తర్వాత కలుసు కోవచ్చుకదా అని వెళ్ళిపోయాను."

ఆశ్చర్యపోయింది మాధవి, "అయితే రాత్రి మీరిక్కడికి కొచ్చారా? తెలియదే నాకు?"

చక్రవర్తి లేచాడు. "సరే, నే వెళ్తానమ్మా. మీరుమళ్ళీ కొంచం నీరసంగా కన్పిస్తున్నారు!" అన్నాడు పరిశీలనగా చూస్తూ.

"అవును. నిన్న మీ నర్సు ఇంజక్షన్ చేసింది. మళ్ళీ రెండు రోజులనుండి బాగుండటం లేదు. నీరసంగా ఉంటోంది." తలవంచుకుంది.

కొంచెం సేపు ఆలోచించి, "సరే, అయితే నేను కొన్ని యింజెక్షన్లు, టానిక్కు తీసుకొస్తాలెండి. మళ్ళీ వస్తానుగా?" అన్నాడు.

కారెక్కుతూన్న చక్రవర్తి టెలిగ్రాఫ్‌ప్యూన్‌ను చూచి ఆగాడు. చదివేసి చిరునవ్వుతో చక్రవర్తి కందించింది

మాధవి. "చూశారా, మరి మీ కథ మొదటి బహుమతి కొట్టేసింది!?"

"తప్పకుండా మీ ఆశీర్వాదం వల్ల నే వచ్చింది. ఇదివర కెప్పుడూ పోటీలలో గెలుపురాలేదు నాకు" అంది హృదయ పూర్వకంగా మాధవి.

"అయితే నాకు బహుమాన మేపాటి? మంచి పార్టీయా?" ఆ బహుమానమేదో తనకే వచ్చినంత సంతోషంగా ఉంది చక్రవర్తికి.

"నిజంగా ఎంత సంతోషంగా ఉందో చెప్పలేనమ్మా. మళ్ళీవచ్చి బావగార్ని అభినందించాలి" అంటూ వెళ్ళి పోయాడు.

ఒక్క-ఉదుటున మేడమీదకు పరుగెత్తింది మాధవి. అలికిడికి మేల్కొన్న రవీంద్ర అప్పుడే కళ్ళు తెరిచాడు. "మొదటి బహుమతి కొట్టేశాను." రవీంద్ర రెండు చేతులూ పట్టుకుంటూ అంది. "మీ చేత్తో వ్రాయబట్టి వచ్చింది. చెప్పండి ఏం కావాలో!" అంది "మాట్లాడరేం? మీకు సంతోషంగా లేదూ?" అతడి రెండు భుజాలుపట్టి కుదిపింది. అప్పటికీ మాట్లాడలేదు రవీంద్ర. విసుగ్గా ఆమె చేతులనుంచి తప్పించు కుంటూ లేచి బాత్ రూంలోకి వెళ్ళిపోయాడు. నిర్ఘాంత పోయింది మాధవి. 'ఏమిటి ఇతడిలో మార్పు? రాత్రి ప్రయాణ బడలికేమో అనుకుంది. మరిప్పుడు? తనమీద కోపమా? ఎందుకు?'

ఆలోచిస్తూనే క్రిందికి వెళ్ళి కాఫీ కలిపి తీసుకువచ్చింది. "అలా ఉన్నారేం?" అంది కాఫీ అందిస్తూ. రవీంద్ర ఆ కాఫీ

అందుకోలేదు. మౌనంగా ఆఫీసు దుస్తులు వేసుకొంటున్నాడు. కాఫీకప్పు డ్రాయరుమీద ఉంచి భర్తకు దగ్గరగా వచ్చింది మాధవి. "ఏమిటో చెప్పరూ? నామీద కోపమా?" అంది అతడి చెయ్యి పట్టుకొంటూ.

"హు!" పురుగును విదిలించినట్లు విదిలించాడు రవీంద్ర, "కట్టిపెట్టు వగలు, ఏమిటో తెలియకే అడుగుతున్నావా?" అంటూనే టకటకా మేడదిగి వెళ్ళిపోయాడు. కళ్ళు తిరిగి పోయాయి మాధవికి. 'ఏమిటిది? పదిరోజులవరకు రానన్న వ్యక్తి హఠాత్తుగా కాంపునుంచి తిరిగి రావడం, ఎన్నడూ లేని విసుగుదల కనపరచడం అంతా క్రొత్తగా ఉంది. ఏం తప్పు జేశాను? ఉత్తరాలైనా ఎంత సౌమ్యంగా జాగ్రత్తగా వ్రాశాను! కనీసం హాస్యానికైనా ఎక్కడా కోపం విసుగు కన్పింపనీయలేదే? నేను నిద్రపోతూంటే మైముకు ఎక్కడందదోనని అర్ధరాత్రి కూర్చుని అతడే స్వయంగా కాపీచేసి పంపిన కథకు బహుమతివస్తే తనకంటే ఎక్కువ సంతోషించవలసింది పోయి విసుక్కుంటున్నారు!

'తెలియకే అడుగుతున్నావా?' 'ఏమిటి తెలిసి తాను చేసిన పొరపాటు?' అంత తీవ్ర సంభాషణ ఎన్నడూ ఎరుగని మాధవిని క్రమంగా ఆలోచనల బరువుతో నీరసం ఆవరించేసింది. వంట చేయాలన్న ధ్యాసేలేదు. 'కాఫీ తాగని వ్యక్తి భోజనానికి మాత్రం వస్తారని నమ్మకమేమిటి? అయినా వస్తారేమో? వస్తే మళ్ళీ అదొక కోపకారణం' లేనిబలం తెచ్చుకొని వంటింట్లో అడుగు పెట్టింది. పరధ్యానంగా ఉండగా అన్నం ముద్ద అయిపోయింది. ఆలోచనలతో కూర తరుగు

తూంటే వ్రేలు తెగి రక్తం కారింది. అయినా ఆమెకు బాధ లేదు. పుట్టిన దాదిగా భోగభాగ్యాలనడుమ గారాల వారసురాలై పెరిగిన ఆమెను వివాహానంతరం భర్త ప్రేమ, లాలన ప్రపంచాన్నే మరపింపజేశాయి. పుట్టి పెరిగిన సంస్కార గౌరవ పూరితమైన వాతావరణమూ, మెట్టినింటి సౌజన్యమూ ఏకమై లోకం పోకడ అర్థం కాకుండా జేశాయి. అయోమయంగా రవీంద్ర కోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

పనిమనిషి ఇంటికి పోతానని హెచ్చరించడంతో మాధవికి వేళ తెలిసి వచ్చింది. 'పదిన్నర. అరె! ఈయన రాలేదు.' ఉస్సురని నిట్టూర్చింది. 'రాత్రి భోజనం లేదు. ఇప్పుడూ లేదు. ఆరోగ్యం పాడై పోదూ!' పనిమనిషిని పంపేసి ప్రక్కమీద వ్రాలుతూండగా బయట ఎవరిదో పిలుపు విని విసుక్కుంటూ లేచి వెళ్ళింది.

అరవై ఏండ్ల ముసలమ్మ "రవీంద్రబాబుగారు నన్ను వంటకు కుదిర్చారు. మీకు పురిటికి పుట్టింటికి వెళ్ళిపోతారట కదూ!' అంది. పెయ్యిపిడుగు లేకమై నెత్తిన పడ్డట్లు, భూమ్యాకాశాలు ఏకమై దద్దరిల్లుతున్నట్లు, దావానలం పరుగులెత్తి వ్రాకివస్తున్నట్లు కంపించి అదిరిపోయింది మాధవి. నిల్చునే ఓపిక నశించి నీరసంగా కుర్చీలో జేరబడింది. 'అయిపోయింది మూడురోజుల ముచ్చట! ప్రాణాధికంగా ప్రేమించిన భర్త హీనాతిహీనంగా ద్వేషిస్తున్నాడా? వారం రోజుల క్రిందట 'మాధవిని విడిచి నేనుండలే'నని శ్రీధర్‌ను సాగనంపినాడు. ఈనాడు నిర్మొగమాటంగా పుట్టింటికి పొమ్మని అన్యాపదేశంగా కబురంపాడు! తనకు తానుగా చెప్పలేకపోయాడా?

తనూ, తనచేతివంటా అంత పాపంకిలమా? ఎంతలో ఎంత మార్పు! అంత పాపిష్టిపని తానేం చేసింది?'

"మాట్లాడ రేమమ్మా? ఇప్పుడేం చేయమంటారు? కాఫీ కాచనా!" ఆమాటలకు మళ్ళీ మాధవి ఆలోచనల కంతరాయం కలిగింది.

"లోపలికి వెళ్ళండి. వంటింట్లో అవసరమైన వస్తువు లన్నీ ఉన్నాయి. ఏదో ఓటిఫిన్ చేసి ఆఫీసుకు పంపాలి."

"ఏం చేయమంటారు?" విస్తుపోతూ అడిగింది ఆ ముసలమ్మ. 'అవసరమైన వస్తువు లేవూటకావూట యిచ్చి చేయించుకుంటూ రందరూను. ఈవిడెవరో పాపం చిన్నపిల్ల. వంటగదంతా తనకే అప్పచెప్పేస్తోంది!'

"మీకు నచ్చినదేదో ఒకటిచేసిపంపండి." మేడమీదికి వెళ్ళిపోయింది మాధవి. మనుషు లెవ్వరూలేని మారుమూల అడవికిపోయి బిగ్గరగా మనసారా ఏడ్వాలనిపించింది మాధవికి. ఏడ్చి ఏడ్చి ఎప్పుడు నిద్రపోయిందో? మోటార్ సైకిల్ హారనకు మెలకువవచ్చి లేచింది. సాయంత్రమైంది, రవీంద్ర ఆఫీసునుంచి వచ్చినట్లున్నారు. మంచం మీదనుంచి లేస్తూ ఎదుటి నిలువుటద్దంలో తన ప్రతిబింబంచూచుకొని తానేహడలి పోయింది. 'దువ్వనిలోని తల, నలిగిన దుస్తులు, ఉబ్బిపోయిన ముఖం, కండు– ఛీ! తనేనా? ఏడ్చేవాళ్ళ నసహ్యించుకు నే తానేనా యింతగా ఏడ్చింది? అయినా ఏమిటంత అవివేకం? ఏదో చిన్న కలహం వచ్చింది. దాన్ని తెలివిగా అణిచేసు కోవాలి కాని ఇంత దిగజారిపోతే ఎలా? ఇటువంటివి యించు మించుగా ప్రతి సంసారంలోనూ ఉండేవే. కాకుంటే

ఎప్పుడూ అలవాటులేక నాకిలా క్రొత్తగా ఉంది. ఆయనేదో ఆవేశపడ్డారు. నేను లాలించి కారణమేమో తెలుసుకోకుండా యిలా మూగనోముపడితే ఎలా? ఆయనేదో కోపంగా అన్నారని నేనూ అభిమానపడి పౌరుషంగా మాట్లాడితే ఏమవుతుంది? తాడును రెండువైపులా బిగించితే పుటుక్కున తెగిపోదూ? అమ్మయ్యో! అలా జరగనివ్వను, నేను మాధవిని. సామాన్య మానినిని కాను' అనుకొంటూ త్వర త్వరగా లేచి క్రిందికి వెళ్ళింది. ఉదయం భోజనం చేయనందున మరీ నీరసంగా ఉంది. అడుగులు తెలిపోతున్నాయి.

ముఖం కడుక్కొని, బట్టలు మార్చుకుని, జడ వేసుకుంటూ హాల్లోకి వెళ్ళింది, మేడమీదకువెళ్ళే ఉద్దేశ్యంతో. పరిచితమైన బూటుచప్పుడు విని ప్రక్కకు చూచేసరికి అప్పుడే గడపదాటి లోనికి వస్తున్నాడు చక్రవర్తి.

"రవీంద్ర ఏడీ? అతడి చికాకేమైనా తగ్గిందా?"

"ఇంకా ఆఫీసునుంచి రాలేదు." అప్రయత్నంగా అబద్ధం ఆడేసింది. 'అసలే చికాకుగా ఉన్నతడు చక్రవర్తితో మాట్లాడుతాడా ఇప్పుడు?'

చక్రవర్తి నేత్రాలలో ఆశ్చర్యం తొంగి చూచింది. కాంపౌండులో ఉన్న మోటార్ సైకిల్‌చూచి రవీంద్ర ఇంట్లోనే ఉన్నాడనుకొంటూ వచ్చాడతడు. "మీరు మరీ నీరసంగా ఉన్నారు ఇదుగో, ఈ టానిక్ ఉదయం, సాయంత్రం భోజనమైన తరువాత రెండు చెంచాలు తీసుకుంటూ ఉండాలి. ఈ మాత్రలు ప్రతి ఉదయం రెండు తీసుకోండి. పాలు, పండ్ల రసం బాగా త్రాగాలి"అన్నాడు మాధవితో.

"థాంక్స్ ఇవన్నీ మీరు తెచ్చారేమిటి? 'ప్రిస్క్రైబ్' చేస్తే బజారునుంచి నేను తెప్పించుకోలేదాన్నిగా?"

"ఎవరైతేనేం, పరాయివాళ్ళమా ? అదీగాక నేను కొనలేదులెండి, మాకు శాంపిల్సు వస్తాయి, చాలా మందుల కంపెనీలనుంచి. మరి వెళ్తాను. రవీంద్రను కలుసుకోలేక పోతున్నాను" అంటూ బయటకు నడిచాడు.

సాగనంపడానికి మాధవి గుమ్మంవరకూ వెళ్ళింది. "అన్నట్లు యిదుగో, మీ హాండ్ బాగ్. మీ రిచ్చిన కథ యిదిగో చాలా బాగుంది. అంతకంటే వర్ణించ శక్తిలేదు". వెళ్ళిపోతూ మరోసారి మోటార్ సైకిల్ వేపు చూచి వెళ్ళి పోయాడు మాధవికప్పుడు తన తప్పు తెలిసింది. 'అబద్ధమాడ డానికైనా అనుభవం కావాలి !'

లోపలికి వెళ్ళిపోతూ మెట్లమీదచప్పుడువిని పైకిచూచింది. మాధవి. 'రవీంద్ర!' తననే తీక్ష్ణంగాచూస్తూ దిగివస్తున్నాడు.

"వచ్చారా ? కాఫీ యివ్వనా ?" పలుకరించింది దరహాస వదనంతో.

"చక్రవర్తేనా వచ్చాడిప్పుడు ?" తీక్షణంగా ఉన్నాయి చూపులు.

"అవును. మళ్ళీవస్తానని వెళ్ళిపోతున్నారు."

"అది వాడిదగ్గరకెలా వెళ్ళింది ?" మాధవి చేతిలో హాండ్ బాగ్ గ్రుచ్చిచూస్తూ అడిగాడు.

నిర్ఘాంతపోయింది మాధవి. 'డాక్టర్నెప్పుడూ దేవతగా మాట్లాడే రవీంద్ర నోటినుంచి ఈ అల్పమైన మాట లెలా వస్తున్నాయో ? కారణ మేమిటో?'

"ఎలాచెప్తే బాగుంటుందో ఆలోచిస్తున్నావా?"

ఇక సహించలేక పోయింది మాధవి. "ఆలోచించవలసిన అగత్యం లేదు. మొన్న చక్రవర్తి తోటలోకి వెళ్ళినప్పుడు మరచిపోయాను. కాని మీ ధోరణే అర్థంకాకుండా ఉంది, కాస్త వివరంగా చెప్తారా?" కోపంగా కాకపోయినా, కొంత కఠినంగానే అడిగింది.

"నే నడుగుతున్నదికూడా అదే. ఏమిటి నీ ప్రవర్తనకు అర్థం ? నాతో రావడానికి అంత మొహమాటపడి మురిపించుకున్న దానవు, నేను లేనప్పుడా తోటలోనికి ఎందు కెళ్ళావు ? రాత్రి పన్నెండు గంటలకు వాడిక్కడికి రావల్సిన అవసర మేమిటి?" అంతకంతకు అతడి కంఠంలో తీవ్రత హెచ్చింది. "నా అంత నేనిచ్చిననాడు తప్పుబట్టిన దానవు ఆకథల్ని నువ్వెందు కివ్వాల్సి వచ్చింది ? నే నింకా రాలేదనుకొని అరగంట బాతాఖానీకొట్టి సాగనంపుతూ ఇటుతిరిగి నన్ను నవ్వుతూ పలుకరిస్తున్నావు. ఎంతకైనా తగిన దానవు. ఛీ," ఛీత్కారంచేస్తూ ప్రక్కగదిలోకి వెళ్ళిపోతున్న రవీంద్ర ఏదో శబ్దం విని తిరిగి చూచాడు. మాధవి స్పృహతప్పి నేలమీద పడి పోయి ఉంది. కుడికణతపై దెబ్బతగిలి రక్తం చిమ్ముతూంది.

తన నేరారోపణకు ఆమె ఏదో సమాధానం చెప్ప వచ్చుననీ, అది వినకుండానే అక్కడనుంచి లోపలికి పోదామనీ క్రోధంగా వెళ్ళుతూన్న రవీంద్ర ఆ దృశ్యంచూచి గాభరా పడిపోయాడు. కంగారుగా మాధవి దగ్గరకు పరుగెత్తు కెళ్ళాడు. పనిమనిషి వచ్చి శోకాలు మొదలెట్టడంతో అసలే

బేజారెత్తిపోయాడు. రెండు చేతులపైనా లేవనెత్తి సోఫాలో పరుండబెట్టి ఫాన్ వేశాడు.

"ముందు డాక్టర్ని పిలండి, బాబూ లక్ష్మీదేవివంటి మా తల్లి, తండ్రోయ్!" ఆశోకాలు విని కర్తవ్యం స్ఫురించి ఫోన్ దగ్గరకు పరుగెత్తాడు.

నీరసంగా కళ్ళు తెరచిన మాధవికి ఎదురుగా లేడీ డాక్టర్ ఇందిర, ఆమె నర్సు, రవీంద్ర, పనిమనిషి అందరూ తనచుట్టూ గుమిగూడి ఆత్రంగా చూస్తూ కన్పించారు. తలకు కట్టిన కట్టును తడిమి చూచుకుంటూ లేచి కూర్చోబోతున్న మాధవిని వద్దని వారించి, వేడి కాఫీ త్రాగించింది డాక్టరు. అయినా లెక్క జేయకుండా లేచి కూర్చుంటూ తెచ్చిపెట్టు కున్న చిరునవ్వుతో, "ఫరవాలేదు లెండి. మేడమెట్లు దిగుతూ కళ్ళుతిరిగి పడిపోయాను" అంది. రవీంద్ర ముఖం ఎత్తలేక పోయాడు.

"కొంచెం నాలుగు రోజులపాటు వచ్చి చూస్తుండండి" అంటూ డాక్టర్ని సాగనంపాడు రవీంద్ర.

మాధవి నీరసంగా పిచ్చి చూపులు చూచింది. రవీంద్ర బలవంతంగా దృష్టి త్రిప్పుకుని వెళ్ళిపోయాడు డక్కడినుంచి. కొద్ది నిమిషాలు పోయాక మెల్లగా లేచి కాఫీ కలిపి మేడ మీదకు తీసుకువెళ్ళింది మాధవి. రెండుఅరచేతులలో ముఖం ఆన్చి, డ్రాయర్ పైకికాళ్ళు బారజాపి ఆలోచనల్లోమునిగివున్నాడు రవీంద్ర. సవ్వడి విని తలెత్తాడు. కాని కాఫీ తీసుకోలేదు. కొంచెం సేపలాగే నిల్చుని మెల్లగా కప్పు బల్లమీద ఉంచి వెళ్ళిపోయింది మాధవి.

నీరసంగా పడుకొన్న మాధవిని రాత్రి ఎనిమిది గంటలకు వంటామె లేపింది. "అయ్యగారు భోంచేశారు. మీరు కూడా రండమ్మా."

"నాకొద్దు. మీరు తిని వెళ్ళండి" అంది నీరసంగా మాధవి. ఆ వంటామె పరిస్థితి క్షణంలో పసిగట్టేసింది. ఆమె అనుభవశాలీ, అనేకం చూచి ఉన్నదీ. కొంచెం జాలికలిగింది. పళ్ళెంలో పెట్టి భోజనం ఆ గదిలోనికే తీసుకొచ్చింది. "భార్యా భర్తలమధ్య చిన్న చిన్న కలహాలు సహజం తల్లీ. ఈమాత్రానికే ఇంత ఇదా!" బుజ్జగిస్తూ దగ్గిర ఉండి తినిపించింది. చల్లని ఆ మాటలకు భోరున ఏడ్చింది మాధవి, ఘనీభవించిన మేఘం చల్లగాలి సోకగానే వర్షించినట్లు. తానూ భోజనం చేసివచ్చి, "నేను వెళ్ళుతున్నానమ్మా, ప్రొద్దున్నే వస్తాను"అని చెప్పి వెళ్ళిపోయింది ముసలమ్మ. ఒక పావుగంట పోయాక గది బయటకు వచ్చిన మాధవికి బుట్టతో ఏవో పట్టుకుపోతున్న వంటలక్క త్వరత్వరగా హాలు దాటిపోవడం కంటపడింది. ఆమె తనను చూచికూడా చూడనట్టే నటించింది. తలచుకొంటే అడ్డుపెట్టగలదు. కాని ఏం ప్రయోజనం మానేస్తుంది. మరెవర్నీ రానివ్వను. అదీకాక రవీంద్రకు కోపం వస్తుంది. 'అయినా నాకెందుకు? నా ప్రమేయం లేకుండా కుదుర్చుకున్నది ఆయన. యజమానులమధ్య సామరస్యం లేని ఇంట్లో నౌకర్లకు విధేయత ఎక్కడ?'

పీధి తలుపువేసి మెల్లగా రవీంద్ర గదిలోనికి వెళ్ళింది. అతడు కిటికీ దగ్గర నిల్చుని చీకటిలోకి చూస్తున్నాడు. గాజులు గలగల లాడించింది అతని దృష్టి యిటు త్రిప్పడానికి. అయినా

అతడు చలించ లేదు. దగ్గరగా వెళ్ళి భుజంమీద చేయివేస్తూ, "మీ రనవసరంగా బాధపడి నన్ను బాధపెడుతున్నారు. మీరు బాధపడవలసిన దేమీ జరగలేదు. నేను మంచి చెడ్డలు తెలియని నీచురాల్ని కాను" అంది వణుకుతున్న కంఠంతో, చెయ్యి త్రోసేస్తూ వెళ్ళి పడుకున్నాడు రవీంద్ర. కాని మాధవి కోపం తెచ్చుకోలేదు. "నేను మంచి చెడ్డలు తెలియని నీచురాల్ని కాను. విద్యాధికులు, అన్నీ తెలిసినవారు; ఎందుకీ మూగబాధ? ఎందుకీ రంపపుకోత నాకు? స్పష్టంగా నీ నేరం ఇదీ అని వ్రేలెత్తి చూపండి. నోరు మూసుకుని ఒప్పుకుంటాను అంతేకాని చక్రవర్తితోటలోకి వెళ్ళినంత మాత్రానే నేరారోపణమా? ఏ పరిస్థితులలో ఎందరితో కలిసి వెళ్ళినదీ తెలుసుకోరేం మీరు?"

తీక్షణంగా చూచాడు రవీంద్ర. "ఇక చాలుగానీ వెళ్ళు. నీ టక్కులన్నీ నా దగ్గర కాదు. నే నెంత బలవంతంగా కోపం అణుచుకుంటున్నానో నీకు తెలియదు. నన్ను కవ్వించి రేగగొట్టకు. ఏం చేస్తానో నాకే తెలియదు. ఫో, నా ఎదుట్నించి."

"చెయ్యండి, ఏంచేసినా సంతోషమే. ఈ కసిడికోతకంటే నన్ను చంపివేసినా సంతోషమే కాని దోషిగా తూలనాడటం మాత్రం నేను భరించలేను. మీరు నవ్వినప్పుడు నవ్వటానికీ, పొమ్మనప్పుడు పోవటానికేనా మిమ్మల్ని వివాహం చేసుకొన్నది? భగవత్సాక్షిగా చెపుతున్నాను – నే నే పాపమూ ఎరుగను. సంసారంలోని క్రొత్తమోజుపోయి మీరసహ్యించుకుంటున్నా రేమో!"

"నోర్మూయ్!" కోపంగా లేచాడు రవీంద్ర. "లెక్చర్లివ్వడానికీ, ప్రమాణాలు చెయ్యడానికీ ఇదేం సినిమాకాదు. నిజ జీవితం. నే నేం అంత మూర్ఖుణ్ణనుకున్నావా, నా కళ్ళు కప్పి తిరగటానికీ, తీపికబుర్లు చెప్పటానికీ? నా ఎదుట వాడితో మాట్లాడటానికే ఇష్టంలేనట్లు నటించి, నే లేనప్పుడు వాడితో షికార్లు, వాడి కారెక్కి తిరగడం, విందులు, వినోదాలు — ఓహ్! అడ్డు తీరిపోయిందనుకున్నావా? నే నొచ్చిననాడు రాత్రి పన్నెండు గంటలకు వాడిక్కడి కెందుకొచ్చాడు? వచ్చి నన్ను చూచి గతుక్కుమని మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు! భర్త లేనప్పుడు ఆడదొక్కతే ఉన్న ఇంటికి అర్ధరాత్రి పరాయి వాడు రావడంలోగల అర్థమేమిటి? అంత తెలియని మూర్ఖుణ్ణా? మరొకడైతే ఇద్దర్నీ ఆక్షణంలోనే నరికి పారేసేవాడు. నేను గనుక అన్ని కుటుంబాల గౌరవ మర్యాదలూ ఆలోచించి నీ బ్రతుకు రచ్చ కెక్కించకుండ ఊరుకుంటున్నాను. అది అలుసుగా తీసుకుని ఇంకా అధికారం చేస్తున్నావా నామీద ? చాల్చాలు, నంగనాచి కబుర్లు చెప్పక మారుమాట్లాడకుండా నిష్క్రమించు, నా జీవితంలోనుంచి."

చెవులుమూసుకుంది మాధవి. "అసలు మీరు రవీంద్రేనా అని అనుమానంగా ఉందినాకు. కాంపునుంచి ఉత్తరాలుకూడ అంత ప్రేమగా వ్రాసిన మీరు హఠాత్తుగా ఒక్కరోజులో ఇలా మారిపోవడం సాధ్యమేనా? లేక రవీంద్రరూపు సంతరించుకున్న మరెవరైనానా? నాకేం పాలుపోవటంలేదు."

ఆశ్చర్యం, క్రోధం పెనవేసుకొచ్చాయి రవీంద్రకు. "చాలించు జాణతనం, ప్రేమ, అభినయం, మోసం, ప్రమా

ణాలు అన్నీ అయినాయి. ఇక అంతర్నాటకంలో ఆఖరి ఘట్టంగా ఆగ్నేయాస్త్ర ప్రయోగం ప్రారంభించావా? ఇంకేం, చెయ్యి ప్రచారం—నాభర్తకాక మరెవడో వచ్చాడని, ప్రపంచమంతా నీలాటి ఆడదాని తరపునే ఉంటుంది. ఒక్క దెబ్బకే రెండు కోరికలూ తీరతాయి. నీ కప్రతిష్ఠా లేదు; నా పీడా వదిలి పోతుంది.”

వెక్కి వెక్కి ఏడ్చింది మాధవి. “మీరెన్నన్నా నాకు కోపం రావడంలేదు. అవును. మీ హృదయంలో బాగా విషబీజాలు నాటుకు పోయాయి. లేకపోతే ప్రాణప్రదంగా చూచుకోగలిగే మీరింత నిర్దాక్షిణ్యంగా ఎలా మాట్లాడ తారు? కాని ఒక్కటి ఆలోచించండి—నన్నూ తీసుకెళ్ళమని ప్రాధేయపడ్డా తీసుకెళ్ళారు కాదు. మీకై మీరే చక్రవర్తికి అప్పజెప్పి వెళ్ళారు. అది కూడా నాకు తెలియదు. మీరు చెప్పారని, ఆతడు యోగక్షేమాలు కనుక్కోవటానికి వస్తే, ఇంతటి నీచ నేరారోపణమా, అంతటి ఉత్తమునికి! విద్యావంతు లకు, సంస్కారవంతులకు తగిన మాటలేనా ఇవి?”

“ఉత్తముడు!” పళ్ళు కొరికాడు రవీంద్ర. “పొరలు కమ్మిన నీ కళ్ళకు వాడు ఉత్తముడుగా కన్పించందే ఇంతటి నీచానికెలా పాల్పడతావు? ఇంత మనోనిగ్రహం లేనిదానివి గనుకనే అలా చుట్టూ గోడలు కట్టుకు కూర్చునేదానివి. నన్ను బుకాయించగలవు కాని కోడై కూస్తున్న ప్రపంచం నోరు మూయగలవా? ఇదేమిటో చూసి, అప్పుడడుగు.” బల వంతాంగా మాధవిని బయటకు నెట్టి డ్రాయర్ సొరుగులో నుంచి ఒక కవరుతీసి విసిరికొడుతూ తలుపు ఛళ్ళున మూసేశాడు.

ఆత్రోపుకు అసలే నీరసంగా ఉన్న మాధవి పట్టు దప్పిపోయి రీడింగ్‌రూమ్‌లో ఉన్న తివాచీపై పడిపోయింది. "అమ్మా!" అంది నీరసంగా తల పట్టుకొని నేలకొరిగిపోతూ. సాయంత్రం తలమీద తగిలిన గాయం రేగి తల బరువెక్కి పోయింది. ఆమె కేకకు రవీంద్ర హృదయం కలుక్కుమంది. కాని బలవంతంగా మనస్సు నదిమిపట్టి తలుపు మూసుకుని మంచంమీద పడ్డాడు.

అర్ధరాత్రివేళ స్పృహవచ్చింది మాధవికి. గాలివానకు తలుపులు తటతటా కొట్టుకుంటున్నాయి. గాలి హోరున ఈలలు వేస్తూంది. విద్యుద్దీపాలు ఆరిపోయాయి. భయంకరమైన చీకటి తాండవిస్తూంది. చుట్టూ చూచి, తల తడిమి చూచు కుంది మాధవి తానున్న పరిస్థితి గుర్తుకు వచ్చింది. విపరీతమైన దాహంగా ఉంది; 'ఎవరైనా మంచినీళ్ళిస్తే!' అంత దయనీయ మైన స్థితిలోనూ నవ్వువచ్చింది మాధవికి. 'తనకు మంచినీళ్ళిచ్చే దిక్కుకూడానా?' అతి ప్రయాసతో లేచి గోడలు పట్టుకు తడుము కుంటూ, తూలిపోయి నడుస్తూ క్రిందికి వెళ్ళి మంచి నీళ్ళుత్రాగి, అక్కడే కటిక నేలపై పడి నిద్రపోయింది

ఉదయం వంటామె వచ్చి లేపగా మేల్కొన్న మాధవి, "ఏమైతేంది?" అంది బద్ధకంగా లేస్తూ.

"తొమ్మిదైందమ్మా. అయ్యగారు కాఫీ తీసుకు వెళ్ళి పోయారు. నేలమీద పడుకున్నా రేమిటి?"

అన్యమనస్కంగానే లేచి ముఖం కడిగి స్నానంచేసి కూర్చునే సరికి డాక్టర్ ఇందిర వచ్చింది. కట్టు మార్చి కట్టి, ఇంజెక్షన్ చేసి వెళ్ళిపోయింది.

అప్పుడే గేటుదాటి లోనికి వస్తూన్న చక్రవర్తి కారుకు ఇందిర ఎదురు పడింది, కారాపి, "హల్లో! ఏమిటిలా వచ్చారు మీరు?" అనడిగాడు చక్రవర్తి.

"సింపుల్ కేస్, మిసెస్ రవీంద్రను ట్రీట్ చేస్తున్నాను" అంటూనే సాగిపోయింది ఇందిర. చెంపన ఛెళ్ళున కొట్టినట్ల యింది చక్రవర్తికి.

'మిసెస్ రవీంద్రకు ట్రీట్‌మెంటు! ఏమిటి జబ్బు? తన కెందుకు తెలియనీయలేదు? రవీంద్రకు నాకంటె కావలసిన వాళ్ళున్నారా? ఒకవేళ ఏమీ ప్రమాదం జరుగలేదు కదా? అందుకే లేడీ డాక్టర్ అవసరం!' పరుగు పరుగున లోనికి వెళ్ళాడు.

"మాధవీ, రవీంద్రా!" బిగ్గరగా కేకేస్తూ హాల్లోకి వచ్చాడు.

ప్రక్కగదిలోంచి చక్రవర్తి గొంతువింటూనే గజగజ లాడిపోయింది మాధవి. 'ఎలా అతడితో మాట్లాడటం? ఇంత నీచమైన అపవాదు మోస్తూ అతడికి ముఖం ఎలా చూపేది? ఉపకారికి అపకారం తలపెట్టే నీచులను ఆ దేవతా మూర్తి పరిహసించడూ?'

ఆమె ఆలోచనలలో ఉండగానే పనిమనిషివచ్చి "డాక్టర్ బాబు వచ్చారు" అంది.

"ఇప్పు డెవరూ ఇంటిదగ్గరలేరని చెప్పు." బలవంతంగా మనస్సును కఠినం చేసుకొని చెప్పింది; చాల మెల్లగా చెప్పా ననుకొంది కాని చక్రవర్తి కా మాటలు స్పష్టంగా విన్పిం

చాయి. ఆశ్చర్యం కూడా కాదు, అంతకుమించిన అనుభూతి ఏదో పొందాడతడు. ఒక్క-క్షణం కొయ్యబారిపోయాడు.

"పోనీ, రవీంద్ర ఉన్నాడా!" అన్నాడు మెల్లగా పని మనిషితో.

'ఆయనా లేరు. మళ్ళీరండి" అంటూ ఆమె వెళ్ళి పోయింది.

స్థాణువులా నిల్చునిపోయాడు చక్రవర్తి రకరకాలఆలో చనలతో ఒక పావుగంటకాలం అట్టే నిలిచిపోయాడు. 'వెళ్ళ డమా? మానడమా?' అని సంకోసిస్తూండగా మాధవి హాలు లోకి వచ్చి, మరో గదిలోకి వెళ్ళిపోయింది, చక్రవర్తి లేడను కొని ఆమె చక్రవర్తిని చూడలేదు. అతడు నివ్వెరపోయాడు. 'అలాగుందేమిటి? తల కా కట్టేమిటి?' అతడి మనస్సు పరి పరివిధాల పరుగు లెట్టింది. హృదయం ఆక్రోశించింది. 'ఏమిటా దెబ్బ? రవీంద్ర అంతటి పశుప్రాయుడా? ఇద్దరి మధ్యా ఏదో పెద్ద గొడవే వచ్చినట్టుంది. ఎవరు తీరుస్తారు సందేహాలు? పోనీ 'నాకెందుకు గొడవ?' అనుకొని వెనుదిరుగ బోయాడు కాని మనసొప్పలేదు. 'రవీంద్ర కూడ ఇంట్లోనే ఉన్నా డేమో!' అనే అనుమానంరాగా మెల్లగా మేడమీదకు వెళ్ళాడు; తన చదువు, హోదా, సంసారం అన్నీ మరిచి పోయాడు.

## ౨౦

సాయంత్రం రవీంద్ర రాగానే కాఫీ తీసుకుని పైకివెళ్ళింది.

మాధవి. కోటువిప్పి హేంగర్‌కు తగిలించుతూన్న రవీంద్ర భార్యను చూచీ చూడనట్లు ఊరుకున్నాడు.

అతడి చేతిలో కోటు బలవంతంగా అందుకుంటూ, "ఎన్నాళ్ళు సాధిస్తారిలా? ఇంకా కోపం పోలేదా?" అనడిగింది.

తిరస్కారంగా చూశాడు రవీంద్ర. "రాగానే మళ్ళీ తయారయ్యావా, నా ప్రాణానికి ? నా గదిలోకి రావద్దని చెప్పలేదూ ? ఆ ఉత్తరం చదివాక కూడ సిగ్గులేకుండా తలెత్తుకు తిరుగుతున్నావా?" అన్నాడు.

ఆ మాటల శూలాలు తిరిగి రాత్రి గాయాలను రేపాయి. 'ఉత్తరం?' అవును. మెల్లగా జ్ఞాపకం రాసాగింది, 'రవీంద్ర త్రోసిన త్రోపుకు స్పృహలేకుండా పడిపోయిన తను అర్ధరాత్రి ఎప్పుడో మేల్కొంది. అప్పుడు తనకు ఇంచుమించు ఏ ఆలోచనాలేదు. తల దిమ్మెక్కిపోయింది. అపరిమితమైన దాహంతో అతిప్రయత్నంతో మేడ దిగగలిగింది, మంచినీటి కోసం. ఉత్తరం సంగతి గుర్తేలేదు. ఏముందో అందులో?' గబగబ ప్రక్కనే ఉన్న రీడింగ్ రూమ్‌లోకి పరుగెత్తింది. అంతా వెతికింది. కాని లేదు. రాత్రి తాను పడిపోయినచోట పగిలిన గాజులు మాత్రం ఉన్నాయి.

"ఆ ఉత్తరం లేదక్కడ. పనిచేసేది తుడిచేసిందేమో ! రాత్రి దెబ్బతగిలి పడిపోయాను. నాకు తర్వాత దాని గుర్తే లేదు. ఎవరు వ్రాశారు? ఏముందా ఉత్తరంలో?" అంది తిరిగి రవీంద్ర దగ్గరకు వచ్చి. తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకొని, సంసారం దిద్దుకోవాలనే కాంక్షతో అభిమానమూ, అహంకారమూ అడుగున పడిపోయాయి.

రాత్రి తాను గెంటివేయటమూ, మాధవి 'అమ్మా!' అని ఆక్రోశిస్తూ నేలమీద ఒరిగి పోవడమూ రవీంద్ర కండ్లలో మెదిలాయి. తన పనికి తానే సిగ్గుతో అవమానంతో కుంచించుకు పోయాడు. "ఏమీ అనుకోకు, మాధవీ. రాత్రి బొత్తిగా సంస్కారం లేని హీనుడులా ప్రవర్తించాను. కారణం ఏదైనప్పటికీ, ఇతరులను దైహికంగా బాధించడం చాలా అసహ్యకరమని తెలిసీ సహనం కోల్పోయి అలా ప్రవర్తించాను" అన్నాడు మరోవైపు చూస్తూ.

"నేనేమీ అందుకు బాధపడడం లేదు. ఈ రంపపుకోత కంటె ఎక్కువేమీ కాదు అది. అయినా ఏముందా ఉత్తరంలో?" అని రెట్టించింది మాధవి.

రవీంద్ర మాట్లాడలేదు. నొసలు చిట్లిస్తూ లేచి ప్రక్క గదిలోకి వెళ్ళాడు. గాజుముక్కలు, వాచీ అద్దం, వాడిన పూల దండ రాత్రి తన పశుప్రవర్తనను హేళన చేస్తున్నట్లు కన్పించాయి. చుట్టూ కలియజూచాడు. ఎక్కడా ఉత్తరం లేదు.

"ఉత్తరంమాత్రం తుడిచి; మిగిలినవన్నీ అట్టేపెట్టేసిందా పనిచేసేది? తీసి దాచేసి లేదనడానికి సిగ్గు లేదూ? ఎంతటి నైచ్యానికైనా హద్దూ పద్దూ వుంది. అవును, మరి. అందులో వన్నీ కాదనగలవా? అవునంటే మొదటికే మోసంమరి! ఎన్ని భాగోతాలైనా సంసారం తెరచాటునే జరిగితే నీ గౌరవం పోదు. అవునా?"

ఆ హేళనకు, ధిక్కారాలకూ నిశ్శబ్దంగా రోదించడం మినహా మారుమాటాడలేక గదిలోనుంచి వెళ్ళిపోయింది మాధవి.

చక్రవర్తి అన్నిగదులూ కలియ దిరిగినా రవీంద్ర కన్పించ లేదు. ఆఖరికి మంచి చెడ్డలు కూడా ఆలోచించకుండా పడక గదిలోకి వెళ్ళాడు. అక్కడా లేదు రవీంద్ర. పడక గదినుంచి రీడింగ్ రూమ్‌లోకి వెళ్ళుతూ పామును చూచి బెదిరినట్టు ఆగి పోయాడు నేలపై తివాచీమీద ముక్క ముక్కలైన రంగు రంగుల గాజు ముక్కలు! ఖరీదైన ఎర్రటి గాజుల తాలూకు ముక్కలవి! సందేహం లేదు. మాధవి చేతిన చాలాసార్లు అటువంటి గాజులు చూశాడు. గాజు చిట్లిపోతే ఒకటి రెండు ముక్కలు ఉంటాయి గాని ఇన్నా? ఆలోచిస్తూ వంగి ముక్కలను పరీక్షించాడు చక్రవర్తి. ఏదో పెద్ద బలమైన దెబ్బ తగిలినట్లు చిదికిపోయాయి. ప్రక్కనే చిన్న వాచీ అద్దం, కొద్దిదూరంలో ఒక కవరు పడి ఉన్నాయి. తల తిరిగి పోతున్న చక్రవర్తికి ఏదో అనుమానం రాగా ఆ ఉత్తరం తీసి జేబులో దాచాడు. వెళ్తూ వెళ్తూ మరోసారి గది అంతా కలియ జూచాడు. డ్రాయర్ మీద సగం సగం వ్రాస్తూ ఆపు జేసిన డైరీ. కొంచెం తటపటాయించి, చివరకు అది కూడా తీసుకొని వెళ్ళిపోయాడు చక్రవర్తి.

ఇంటికివచ్చి తీరికగా తన గదిలో కూర్చుని చదవడం ప్రారంభించాడు.

"రవీంద్రగారికి,

తమ భార్య ప్రతివత అనుకొని కళ్ళు మూసుకొని కూర్చున్నారు మీరు. మీరు ఊరికి వెళ్ళడంతో ఆవిడ స్వైర

విహారానికి ఆటంకం తీరిపోయింది. రాత్రి, పగలు అనకుండా డాక్టర్ చక్రవర్తి తన నర్సు లను ఆమె దాస్యానికి ఉపయోగిస్తున్నాడు. ఆమె చుట్టూ తిరుగుతున్నాడు. అక్కడే భోజనం. ఆవిడతో తోటకి షికార్లు. ఆమె సంగీతంలో పైమరచిపోవడం. అనుమానమైతే ఇదుగో – దీనిలోనే ఒక కాగితం పంపుతున్నాను. మీరు వాడే లెటర్ హెడ్ పై ఆమె అతడికి క్రొత్త క్రొత్త పాటలు వ్రాసి బహూకరిస్తోంది. గ్రహించారా ఆమె ధైర్య సాహసాలు ? ఇహనైనా కళ్ళు తెరచి సంసారం నిలబెట్టుకోండి.

మీ శ్రేయోభిలాషి."

నిర్ఘాంతపోయాడు చక్రవర్తి. చదువుతూండగానే అర్థమైపోయింది అతడికి ఎవరు వ్రాశారో. ఒక్క ఉదుటన లేచి నిర్మల గదిలోకి వెళ్ళాడు. భోజనం చేసి హాయిగా పట్టు పరుపుపై పవళించి నిద్రలో ఉన్న నిర్మల, చక్రవర్తి సింహ గర్జనకు అదిరిపడి లేచింది.

"ఏమిటిది?" నిప్పులు కురిసే కళ్ళతో అడిగాడు.

"ఏమిటీ?" తిరిగి ప్రశ్నించింది అర్థంకాక.

"నేను చేసిన హితబోధంతా గాలి కెగిరిపోయిందా ? ఆఖరికి మాధవి సంసారానికే చిచ్చుపెట్టావా? ఎందుకు నీకంత కక్ష? ఈ ఉత్తరం నువ్వుకదూ వ్రాశావు?"

"ఓ అదా!" వికటంగా నవ్వింది నిర్మల. "అవును, కక్షే. నా భర్తను తన చుట్టూ భ్రమరంలా త్రిప్పుకొనే దానిమీద కక్ష కాదూ?"

"ఓసీ రాక్షసీ!" నిర్ఘాంతపోయాడు చక్రవర్తి. నా మెత్తదనం చూచేకదూ ఇంతగా విజృంభించావు? ఎన్నయినా క్షమించాను కాని దీనిని క్షమించలేను, నమువు. కాళ్ళకి. రవీంద్ర పాదాలమీద పడి నిజం చెప్పెయ్యి. మాధవి నరక యాతన అనుభవిస్తోంది."

అతడి కంఠ స్వరంలో తీక్ష్ణత గుర్తించిన నిర్మల ఆశ్చర్య పోయింది. కాని చలించలేదు. "చెప్పను. ఎన్నటికీ చెప్పను. దాని సంసారం కోసం నా సంసారం తగలేసుకోనా?"

"సంసారం!" పళ్ళు పటపటా కొరికాడు చక్రవర్తి. "నిష్కారణంగా ఒక సంసారం నాశనంచేస్తే నీ సంసారం నిలబడుతుం దనుకున్నావా? అక్కడ వాళ్ళు చిత్రహింస అనుభవిస్తోంటే నువ్వు చిద్విలాసాలలో వినోదిద్దా మను కున్నావా! ఆ సంసారం బాగైతేనే ఇక ఈ సంసారాని కూడా బాగు. ఆలోచించుకో."

"బెదిరిస్తున్నారా?"

"ఆజ్ఞాపిస్తున్నాను, జీవితంలో మొట్ట మొదటిసారిగా. రవీంద్రను క్షమాపణ వేడిననాడే తిరిగి నీ ముఖం చూసేది."

"అంటే పొమ్మనేనా మీ అనేది?"

"నే ననడంలేను. నీ ఖర్మే నిన్ను పొమ్మంటూంది."

"సరే, చూస్తా నదేమిటో. నా పుట్టిల్లేమీ గతిలేనిది కాదు. మీలాంటి వాళ్ళని నలుగుర్ని కొనేయగల తాహాతు ఉంది మాకు."

## ౨౨

రాత్రి తొమ్మిది గంటలకు శ్రీధర్ దగ్గరనుంచి వైర్ వచ్చింది.

'ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నాను. చెల్లెల్ని తీసుకువెళ్తాను-' అని.

"ఏమిటిది?" కంపించిపోతూ అడిగింది మాధవి. రవీంద్రను.

"ఏమిటో తెలియడం లేదూ? నీ కండ రావరానికి ఫలితం'!' అన్నాడు.

"ఎంతటి వా రెలాగైపోయారు! ఇక మీ అభిప్రాయానికి తిరుగులేదా? అన్నయ్య ముఖం ఎలా చూడను? ఇక ఏ ఆశతో బ్రతకాలి?"

"కళ్లు మూసుకుపోయి బ్రతికిననాడు రాలేదా, ఈ ఆలోచనలన్నీ? ఫర్వాలేదులే. నువ్వు నా పరువు తీసేటట్టు ప్రవర్తించినా, నేను నీ గౌరవం పోగొట్టలేదు. పోగొట్టను పురిటికి పుట్టింటికి తీసుక వెళ్ళడాని కొస్తున్నాడు. మీ అన్నయ్య. అంతే."

బరువుగా నిట్టూర్చింది మాధవి.

శ్రీధర్ వచ్చేసరికి రవీంద్ర ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

"ఏమమ్మా, అసలు నీ ఆరోగ్యం బాగుండడం లేదట? బావ ఉత్తరం వ్రాసాడు. మొన్నటికి బాగానే ఉన్నావు కదా!" అన్నాడు చెల్లెల్ని. "మొన్న కళ్ళు తిరిగి పడిపోయావట! దెబ్బ తగిలిందట!"

మాధవి సూటిగా రెండు కళ్ళతో అన్నవైపు చూడ లేకపోయింది, మాట్లాడలేక పోయింది. "అన్నయ్యా!" అంటూ

అతనిని చుట్టేసి బావురుమంది. ఎన్నడూ లేని చెల్లెలి బేలతనా నికి శ్రీధర్ విస్తుపోయాడు. ముద్దుచెల్లెలి మూగబాధను అతడు మరోకవిధంగా అర్థంచేసుకొన్నాడు. "ఛర్వాలేదమ్మా, నేనుండగా నీకేం భయం? ఎలాంటి జబ్బయినా కుదిర్చేసే డాక్టర్లున్నారు, ఏం భయంలేదు?" అని ఓదార్చాడు.

సాయంకాలం రవీంద్ర వస్తూనే నవ్వుతూ పలకరించాడు బావమరదిని. "వచ్చావా? అనుకొన్నానులే, ఎగిరి వచ్చేస్తావని. ముద్దు చెల్లెలుగా, మరి!"

ఏమీ జరగనట్లే నిర్మలంగా మాట్లాడుతున్న అతడి చాకచక్యానికి ఆశ్చర్యపోయింది మాధవి. "ఎంతైనా మగ వాడు" అనుకొంది. కాని రవీంద్ర చాలా తప్పుకు తప్పుకు తిరిగాడు. కాఫీ తీసుకొని, దుస్తులు మార్చి "ఎవరో ఆఫీసర్ని కలుసు కోవా" లంటూ వెళ్ళిపోయాడు.

"నాకాట్టే సెలవు లేదమ్మాయీ. ఉదయం ట్రెయిన్ కే వెళ్ళిపోదాం. అన్నీ సర్దుకో. ఒక్కసారి చక్రవర్తిని కలుసుకు వస్తాను నేను" అని శ్రీధర్ కూడా బయటికి వెళ్ళిపోయాడు.

'చక్రవర్తి. హూ! ఈ చక్రవర్తివల్లనే నా జీవితంలో నిప్పులు కురిసాయి. అదేం నష్టజాతకుడో, అతనితో పరిచయ మైన నాటినుంచీ మా సంసారంలో కలతలేకదా!' భరించలే నంతకోపం వచ్చింది మాధవికి. అంతా అన్నయ్యతో చెప్పెయ్యాలనుకుంది. 'కాని...కాని, సిగ్గువిడిచి కక్కుర్తిపడి అన్నయ్యతో చెప్పుకుంటేమాత్రం ఫలితం ఉంటుందా, అతనికికూడా చిన్నబుచ్చటమేగాని! ఎంత రక్తంలో రక్తం,

కండలో కండ అయితేమాత్రం, అన్నతో భర్త ఆదరించడం లేదని అభిమానంగల ఏ ఆడదైనా చెప్పగలదా స్పష్టంగా? అవమానంకాదూ? భగవంతుడా! ఎంత సున్నితంగా సృష్టించా వయ్యా ఈ ఆడజన్మలను! ఇంతకూ ఆ చక్రవర్తి ఏం చెబు తాడో అన్నయ్యతో? అతనికేం తెలుసు. ఈ గొడవలన్నీ? తాను వెళ్ళిపోతూందని తెలిసి అన్నయ్యతో కలిసి ఇక్కడకు వచ్చెయ్యాడుకదా! మళ్ళీ రవీంద్ర చూస్తే అదో రభస.'

కాని, మాధవి భయపడినదేమీ జరుగలేదు. శ్రీధర్ తిరిగివచ్చి, "చక్రవర్తి ఎక్కడో తన తోటలోకి వెళ్ళిపోయా డట. ఇహ ఎలాగూ చీకటి పడిపోతూంది. అక్కడి కెందుకని వెళ్ళలేదు" అన్నాడు.

మాధవి మాట్లాడలేదు. మళ్ళీ శ్రీధర్, "చక్రవర్తి ఇక్కడి కొస్తున్నాడా ఈమధ్య?" అనడిగాడు చెల్లెల్ని చూస్తూ.

ఆ ప్రశ్న వింటూనే కంపించి పోయింది మాధవి. "ఏమలా అడుగుతున్నావ్?" అంది మరోవేపుకు చూస్తూ.

కొంచెంసేపు తటపటాయించి చెప్పాడు. "నా అను మానం, అతడు లోపలవుండే లేడనిపించాడేమోనని. అతడి కారు గుమ్మంలోనే ఉంది. పైగా హాస్పిటల్ అంతా జనంతో కిటకిటలాడుతోంది. కారులేకుండా ఎక్కడికెళ్తాడు?"

"ఏమోమరి! కాని అతడు చాలా మంచివాడు. అటు వంటివాడు కాదన్నయ్యా" అంది మెల్లగా. మళ్ళీ నిర్మల కన్పించలేదా?" అని అడిగింది.

"ఊళ్లో లేదట. వీలైతే రేపు కలుసుకుంటానులే."

రాత్రి రవీంద్ర వచ్చాక భోజనాల దగ్గర మళ్ళీ వచ్చింది చక్రవర్తి ప్రసక్తి.

"నేను మొన్ననే వచ్చాను కాంప్‌నుంచి. అతడి గొడవేమీ తెలియదు నాకు" అని తప్పుకున్నాడు రవీంద్ర. మళ్ళీ అతడి గొడవ రాలేదు. బావమరదు లిద్దరూ కేరింతాలు కొడుతూ మాట్లాడుకొంటూంటే మాధవి గుండెల్లో సుత్తులతో కొడుతున్నట్లయింది. 'తానింత బాధతో కుమిలిపోతుంటే భర్త అంత సంతోషంగా ఉన్నాడు! అతడికి బాధలేదా? లేక నటిస్తున్నాడా?'

౨౩

క్రింద పేషెంట్లు వేచి ఉన్నారని కాంపౌండర్ ఎన్నిసార్లు చెప్పినా చక్రవర్తికదలలేదు. "ఎలాగో చూచి పంపెయ్యి. నేను రాలేను" అన్నాడు. మాధవి గదిలోనుంచి తెచ్చిన డైరీ చూస్తూ.

కాలేజీలో సంగతులు, ప్రచురణమైన కథలు, చూచిన ప్రదేశాలు, వివాహం, భర్త అనురాగం, దాంపత్యపు తొలిరోజులు మొదలైన వనేకం వ్రాసుకుంది మాధవి. చక్రవర్తి సంస్కార హృదయం అవన్నీ చదవడానికి అంగీకరించ లేదు. త్వరత్వరగా పేజీలు తిరగేశాడు తనకు కావలసిన దానికోసం.

అక్టోబర్ 25 : ఎన్నడూ అలవాటు లేని పనిచేశాను. ఆయన బలవంతంమీద పిక్నిక్ వెళ్ళాను తోటలోకి. చక్రవర్తి అతిచనువు ఏమిటో చిరాకు అనిపించింది. ఆడవాళ్ళంతా ఎంత నాగరికులో అంత అనాగరికలు. వాళ్ళతో కలిసిపోలేని నా ప్రవర్తనకు రవీంద్ర విసుక్కున్నారు.

అక్టోబరు 26 : నిర్మలా, చక్రవర్తీ వచ్చారు. చక్రవర్తి సంస్కారానికీ, తెలివికీ నిర్మల తగదనిపించింది. లేడీస్ క్లబ్‌లో జేరమంటుంది. ఎందుకు ? నా కథలు చక్రవర్తికి ఇచ్చినందు కెంతైనా కోపగించుకున్నాను రవీంద్రమీద.

అక్టోబరు 28 : 'ఆరాధన'పై చక్రవర్తి ఎంత అందంగా వ్రాశాడు విమర్శ! అతని సూచన చాలా నచ్చింది. ఏమిటో నాకు చిరాకు, అతడినిచూస్తే, రవీంద్రకు అతడు దేవుడు.

నవంబర్ 1 : నిర్మల పుట్టిన రోజట. చక్రవర్తి మరీ మరీ పిల్చారని రవీంద్ర వెళ్ళమన్నారు. కాని వెళ్ళలేదు. అయినా ఈమధ్య రవీంద్ర కొంచెం మారుతున్నారు. నా ముభావాన్ని అతిగా విమర్శిస్తున్నారు.

నవంబర్ 2 : నవ్వు వస్తోంది. ఈమధ్య నా డైరీ అంతా చక్రవర్తి సమాచారంతో నిండిపోతూం దేమిటి ? ఈరోజు నాకిష్టం లేకపోయినా రవీంద్రతో కూడా చక్రవర్తి తోటకి వెళ్ళాను. మనోహరంగా పాడగలడు చక్రవర్తి! అతడి సంసారం గురించి చూచాయగా ఏదో బాధపడుతున్నట్లు చెప్పాడు. నిర్మల ఎంత కఠినాత్మురాలో అన్పించింది. నా పాట నతడెంతగానో మెచ్చుకున్నాడు. తన కార్లోనే ఇంటికి

పంపాడు. ఇంటికొచ్చాక రవీంద్ర చికాగ్గా ఉన్నట్లు నా కను మానంగా ఉంది.

నవంబరు 3 : శ్రీధర్ అన్నయ్య వచ్చాడు. విడిచి ఉండలేనంటూ రవీంద్ర నన్ను అన్నయ్యతో పంపించలేదు. క్రొత్త విషయం తెలిసింది. చక్రవర్తి నాకు అన్నయ్య అవుతాడు...సాయంత్రం అన్నయ్యకు 'సెండాఫ్' ఇచ్చి డాన్స్ ప్రోగ్రాముకు వెళ్ళాం. నీరసంగా ఉండి రాలేనంటే రవీంద్రకు కోపం వచ్చింది. వచ్చేటప్పుడు కళ్ళుతిరిగాయి. చక్రవర్తి పట్టుకోకపోతే ఎంత దెబ్బయినా తగిలి ఉండేది. పాపం, జాగ్రత్తగా ఇంజెక్షన్ చేసి ఇంటికి కూడా దిగబెట్టాడు. నిర్మల ప్రవర్తన చూస్తే ఏమిటో నాపై అసూయగా ఉన్నట్లు కన్పించింది.

నవంబరు 4 : రవీంద్ర బెంగుళూరువెళ్ళారు. ఎప్పుడూ విడిచి ఉండక భయంగా ఉంది. చక్రవర్తికి ఎంతశ్రద్ధ! ఆయనను స్టేషనుకు దిగబెట్టారు. నాకు నర్సును సాయం పంపారు. కాని పద్మ అతడింటి విషయాలు చెప్తూ 'సుధ' ఫొటోగురించి చెప్పింది. నిర్మల అసూయపడే ఆ సుధ ఎవరో? అంత నీతిలేని వాడా చక్రవర్తి?

నవంబర్ 8 : రవీంద్ర ఉత్తరం వ్రాశారు హాస్యంగా. నేనంటే ప్రాణం. కాని పదిరోజులుండాలట. చక్రవర్తితో చెప్పాను. 'భయమెందుకమ్మా, నేనులేనూ?' అన్నాడు, శ్రీధర్ అన్నయ్యలాగా. అతడి మాటలూ, ప్రవర్తనా ఎంతో ఉత్తమంగా ఉంటాయి. నేనే అతడిన్నర్థం చేసుకోలేక పోతున్నాను. ఏదో ఆవేదన అతడిలో దాగి ఉంది.

నవంబర్ 9 : చక్రవర్తి వచ్చేసరికి పాడుకుంటున్నాను. ఆ పాట వ్రాసి యిమ్మనడిగితే ఇచ్చాను. రవీంద్ర లేనందున, మనస్సు బాగుండక వంట చేసుకోలేదు. పట్టుబట్టి చక్రవర్తి తన ఇంటికి తీసుకు వెళ్ళాడు. కాని నిర్మల కంతిఇష్టం లేనట్లుగా కన్పించింది. అతడి గదిలో 'సుధ' చిత్రపటం చూచాను. ఎంత సౌందర్యవతి! కాని ఎవరో చెప్పలేనన్నాడు చక్రవర్తి. బాధపడ్డాడు. పాపం నిర్మలపై జాలివేసింది నాకు. రవీంద్ర దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. మధ్యాహ్నం నిర్మలా, లక్ష్మీ, చక్రవర్తీ వచ్చి బలవంతాన తోటలోకి తీసుకుపోయారు. రాననే అవకాశం కూడా ఇవ్వలేదు. నిర్మల బొత్తిగా సంస్కారహీన అన్పించింది ఇవాళబాగా.

నవంబర్ 10 : పద్మ మంచిదేననుకొన్నాను. కాని చిన్న జన్మకు పెద్ద గుణా లెక్కడినుంచి వస్తాయి? దిక్కులేని దయ్యా, ఎవరి ప్రాపకంవల్ల బ్రతుకుతూందో వారినే చాటుగా విమర్శించడం, ఇంటిగుట్టు బయటపెట్టడం—ఛీ! రాత్రి నిర్మలా, చక్రవర్తీ ఏదో ఘర్షణ పడుతున్నారని చెప్పబోయింది. నా కసహ్యమనిపించింది. 'సంసారమన్నాక ఏవో కలతలుంటాయి. నువ్వలా చెప్పకూడదు. నాకు వినాలని లేదు' అంటూ సంభాషణ త్రుంచేశాను. పద్మకు కూడా నిర్మల లాగే లోలోపల కోపం నామీద, చెత్త మాట్లాడనని! ఎందుకో ఇతరుల విషయాలలో అంత ఆసక్తి? నిన్న మరీ మరీ రవీంద్ర అడ్రస్ అడిగింది; ఎందుకూ తనకు? వెకిలిమనిషి!

నవంబర్ 14 : రవీంద్ర గత రాత్రి హఠాత్తుగా దిగారు. ఎందుకో చిరాగ్గా ఉన్నారు. పొద్దున్నే పోటీలో నా కథకు

మొదటి బహుమతని ప్రైజ్ వచ్చింది. సంతోషంగా చెప్తే రవీంద్ర నన్ను పురుగును విదిలించినట్టు విదిలించాడు. ఏడుపు వచ్చింది నాకు. పదకొండు గంటలవేళ ఎవరో ముసలమ్మ వచ్చి, 'మీరు పుట్టింటికి పోతారట—నేను వంటకు కుదిరాను' అంది. ఏమని వ్రాయను నా అవస్థ? సాయంత్రం చక్రవర్తి తోటలో మరిచిపోయిన నా హాండ్ బాగ్ తెచ్చిచ్చాడు. చూచిన రవీంద్ర అవన్నీ వాడికగ్గర కెలాగ వెళ్ళాయంటూ నీచంగా మాట్లాడాడు. వ్రాయలేను ఆ ధోరణి. చక్రవర్తివంటి ఉత్తముడికా ఈ అపవాదు!'

ఆ తర్వాత ఇక డైరీ వ్రాయలేదు.

"పోనీ కనీసం మాధవికైనా నాపై అపోహ లేదు" అని నిట్టూర్చుతుండగా "శ్రీధర్ గారట. మీకోసం వచ్చా"రని కబురు వచ్చింది.

కలవరపడిపోయాడు చక్రవర్తి. చెల్లెల్ని జాగ్రత్తగా చూడమన్న అతడిని ఏ ముఖంతో చూచేది?

"లేనని చెప్పి, ఎందుకు వచ్చాడో, ఏమిటో తెలుసుకో" అన్నాడు నౌకర్ను.

"చెల్లెలి ఆరోగ్యం బాగుండలేదట. రేపు ఉదయం ఎనిమిది గంటల బండిలో తీసుకు పోతున్నారట. మిమ్మల్నొకసారి కేనే చూడ్డానికొచ్చారు" అన్నాడు తిరిగి వచ్చిన నౌకరు

"ఆ!" బ్రద్దలైపోతున్న తలను రెండుచేతులతో పట్టుకున్నాడు చక్రవర్తి.

## ౨౪

శ్రీధర్ నిద్రపోయినతర్వాత రవీంద్రమాధవిగదిలోకి వచ్చాడు.

"ఏమిటీ సర్దుకోవడం లేదేం?"

చెక్కిట చెయ్యిజేర్చి మంచంపై కూర్చుని ఏదో ఆలోచనలో మునిగివున్న మాధవి మెల్లగా కళ్ళెత్తి అతడివేపు చూచింది. ఆ చూపులో కళలేదు; అర్థంలేదు పిచ్చిచూపు.

రెట్టించాడు రవి. "అసలు వెళ్ళే ఉద్దేశ్యం ఉందా లేదా? మర్యాదగా వెళ్ళకపోతే అంతా మీ అన్నయ్యకు చెప్పే యాల్సి వస్తుంది. నీయిష్టం."

అన్నయ్య కిప్పుడు చెప్పకపోయినా తర్వాతైనా చెప్ప వల సొస్తుందేమో?"

"నువ్వే చెప్పుకుందువుగాని నా కవసరంలేదు. ఇదే మన కడసారి చూపు."

"అందుకే ఒక్కసారి అలా కుర్చీలో కూర్చోండి. నే నేమీ విసిగించను మిమ్మల్ని. మన మధ్య యివే ఆఖరి మాటలు గనుక మరి కొద్దిసేపు మాట్లాడలేరా?"

"అనవసరం. తెగతెంపులే అయ్యాక ఇకమాటలేమిటి?"

"కొద్ది రోజులలో ఈ ప్రపంచంతోనే తెగతెంపు లవ్వ బోతున్నదానిపై యింత కోపమెందుకు?"

గడప దాటుతున్న రవీంద్ర షాక్ తగిలినట్లు ఆగి పోయాడు. "అంటే?" అన్నాడు అదిరిపడి. మాధవి సమాధానం చెప్పలేదు. ఒక్క జీవంలేని నవ్వు నవ్వింది.

వెనక్కి వచ్చి కుర్చీలో కూర్చుంటూ, "ఏ విషమైనా త్రాగి ప్రాణాలు తీసుకుందా మనుకుంటున్నావా? అలా అయితే యిప్పుడే చెప్పాల్సివస్తుంది శ్రీధర్‌తో" అన్నాడు.

"అంతవరకూ అక్కరలేదులెండి. బిడ్డపుట్టి గండం గడవటం మరో జన్మ ఎత్తడమే ఆడదానికి. భగవంతుడు దానికి కష్టాలెందుకు కలిగించాడనుకొనేదాన్ని కాని, ప్రస్తుతం అది నా పాలిట వరమే అయ్యింది. నా స్థితి నాకు తెలుసు. నా ఆరోగ్యం యిక కోలుకోదు. ఇక నాలుగు నెలలే నా జీవిత కాలం. నలుగురిలోనూ రట్టు చేయకుండా విశాల హృదయంతో నా గౌరవం కాపాడారు. చచ్చేముందు అపవాదు అందరికీ తెలిసి ఉభయ కుటుంబాలూ తలవంచుకో వలసిన అవసరం లేకుండా చేశారు. అందుకు చాలా కృతజ్ఞురాల్ని."

దిమ్మెర పోయాడు రవీంద్ర. పిచ్చిగా మౌనంగా చూడడంతప్ప మాట్లాడలేక పోయాడు.

"ఏం బాధపడుతున్నారా? ఔను. నాలుగు రోజుల సహవాసమే అయినా మనదొడ్లో పెరిగే మొక్క చచ్చినా మన కాలిదగ్గర పడుండే కుక్క చచ్చిపోయినాకూడా బాధగానే ఉంటుంది. మర్నాటి కదే మరపు తగులుతుంది. బాధపడకండి."

"మాధవీ!" పళ్ళు బిగపట్టి అరిచాడు. "ఎందుకీ చిత్రవధ? నా గుండెల్లో రగిల్చిన మంట చాలక, నా జీవితంలో పోసిన నిప్పులు చాలక, నా శరీరం కూడా తూట్లు పొడిచి పోతున్నావా? ఎందుకింత కక్ష నామీద?"

పేలవంగా నవ్వింది మాధవి. "నాకు మీ మీద కష్టా! పోనీండి. ఇవిగో బీరువాల తాళాలు, ఇనప్పెట్టె తాళాలు అన్నీ జాగ్రత్తగా చూచుకోవాలి, యిల్లు దిద్దేవా రెవరో ఒకరు మళ్ళీ వచ్చేవరకు."

"అహ్హాహ్హాహ్హా బిగ్గరగా పిచ్చినవ్వునవ్వాడు రవీంద్ర. "మళ్ళీ! అహాహాహా. మళ్లీ జీవితంలో యింత తప్పు చేయ డమే! ఆడజాతి మీదే నమ్మకం పోగొట్టుకొవ్!" దురుసుగా తాళాలందుకుని వెళ్ళిపోతూ, "రేపేప్రయాణం. అన్నీ సర్దుకో. నీదంటూ ఏ వస్తువూ, నిన్ను గుర్తు తెచ్చే దేదీ ఈ యింట్లో ఉండడానికి వీలులేదు" అని గుమ్మం దగ్గర ఆగి వెనక్కు చూచాడు

మాధవిలో మార్పు లేదు. నిర్జీవమైన కంఠంతో, "మీ దృష్టిలో నేను మహాపరాధిని. అంతటి పాపాన్నే సహించ గలుగుతూన్న మీరు మరో కొద్దిరోజులు ఓపికపట్ట లేరూ? ఇక్కడ నుంచి అక్కడికై తే మోసుకుపోగలను కానీ అక్కడి నుంచి నా కట్టెతో కూడా మోసుకుపోలేనుగా! నే నీ భూమి మీద లేనని తెలిసిననాడు అవన్నీ తృప్తిగా బీదసాదలకు పంచిపెట్టండి. అంతవరకూ ఎలాగో భరించండి. నేనెప్పుడూ మిమ్మల్నే కోరికా కోరలేదు. ఈ ఒక్క అభ్యర్థననూ మన్నించలేరూ?" అన్నది.

బరువుగా గుండె చేత్తో పట్టుకొని కళ్ళు మూసుకుని గుమ్మానికి జేరబడ్డాడు రవీంద్ర. బరువైన నిట్టూర్పులు నిశ్శ బ్దంలో భయంకరంగా వినిపిస్తున్నాయి మాధవికి. కొన్ని క్షణాలు పోయాక కళ్ళు విప్పాడు. "సరే, మంచి విషయమే

గుర్తుచేశావు. "నువ్వు నాపట్ల నీక ర్తవ్యాన్ని, ధర్మాన్ని మరచి పోయినా నేను నాబాధ్యత నెరవేర్చదలచుకున్నాను. నువ్వు చెప్పినట్టు నిజంగా ఈ రెండేళ్ళలోనూ నువ్వే కోరికా కోరలేదు, నన్ను. విడిచిపోయేముందు నువ్వడిగిన ఏకోరికైనా సరే, నీ తప్పులను మరిచిపోయి నీతో సంసారం చేయడం మినహా మరే కోరికైనా సరే, తీర్చడానికి సిద్ధంగా ఉన్నాను. అడుగు."

"అడిగానుగా, ఇప్పుడు!"

"అది నీ అంత నువ్వడిగినది. మరొకటి నే నడగ మంటున్నాను."

"కృతజ్ఞురాలిని కాని యింకే కోరికా లేదు." నిర్జీవంగా నవ్వింది.

పరీక్షగా పరికించాడు మాధవిని రవీంద్ర. "ఊఁ పోనీలే. ఒక విధంగానైనా మనస్సును తేలిక పరిచావు. తప్పు చేసినా, నువ్వు కూడా నాలాగే చిత్రహింస అనుభవిస్తున్నా వేమో అనుకున్నాను. అదేమీ లేదు. ఉన్నట్లయితే అడగ మన్నందు కైనా అడిగి ఉండువు. అసంభవమని తెలిసినా ఆఖరిసారిగా నైనా నీ సంసారం నిలబెట్టుకో ప్రయత్నించి ఉందువు."

మాధవి ముఖం పాలిపోయింది. "లేదు, లేదు, మీరలా అనుకోనేటట్లయితే తప్పకుండా అడుగుతాను. ఎంత చచ్చే వాళ్ళకైనా ఆ క్షణంవరకూ కోరిక లుంటూనే ఉంటాయి."

"దయ దలుచుతున్నావా నన్ను?"

"లేదు. ఆఖరి క్షణంలో కన్పించిన ఆశాకిరణానికి మురిసి పోతున్నాను. కాని మీకు శ్రమ కలుగుతుందేమోనని బాధపడు తున్నాను."

"సరే. ఏమిటది?"

"ఇప్పుడు కాదు. తర్వాత."

"ఇదే ఆఖరి కలయికని గుర్తుంచుకుని మాట్లాడు."

"మనస్సులో కోరిక తెల్పడానికి మాట లొక్కటే మార్గమా?"

"ఊఁ కానియ్. గుడ్ బై."

ఉదయం రవీంద్ర గదిలోకి వెళ్ళింది మాధవి. రవీ, శ్రీధర్ కాఫీ తీసుకుంటున్నారు.

"చూడు, మధూ, అసలు నేను సెలవు పెట్టి వారం రోజులపాటు మనతోనే రమ్మంటే బావ స్టేషన్‌కు కూడా రాడట. ఎవరో స్నేహితులతో వేట కెళ్ళాలిట."

"పోనీలే వెళ్ళనీ. హాయిగా తిరిగే జంటల్ని తుపాకి దెబ్బతో విడదీయడమే ఆనందమైతే సప్పుడు మనం చెప్పేది విన్పిస్తుందా?"

దెబ్బ తిన్నట్టు ఉలిక్కిపడి చూచాడు రవీంద్ర.

"అయినా బావ యిదివరకులా లేడు. నాకేదో మార్పు కన్పిస్తోంది" అన్నాడు హాస్యంగానే శ్రీధర్. తుపాకీ తుడుస్తూన్న రవీంద్ర తలవంచుకున్నాడు. ఇక మాధవికి సమాధానం చెప్పక తప్పలేదు.

లేని నవ్వు తెచ్చి పెట్టుకుంటూ, "నేను వెళ్ళిపోతున్నందుకు మనస్సు బాగాలేదు. ఏమీ అనకన్నయ్యా" అంది.

"ఆదర్శ దంపతులు! ఏం బెంగ పెట్టుకోకయ్యా బావా. మళ్ళీ నాలుగు నెలలనాటికి పాపాయితో సహా తిరిగి వస్తుంది.

నీ మాధవి." పకా పకా నవ్వుతూ అక్కడినుంచి నిష్క్రమిం చాడు శ్రీధర్.

రవీంద్రా, మాధవీ ఏకాంతంగా మిగిలారు. భర్తకు దగ్గరగా నడచి, "వెళ్ళిపోతున్నాను" అంది మాధవి.

రవీంద్ర మాట్లాడలేదు. అతడి దృష్టి నేలమీద ఉంది. మళ్ళీ మాధవే మాట్లాడింది. "ఆ తుపాకితో ఆనందంగా బ్రతికే ఎన్ని జంటల్ని చేజేతులా విడదీశారో! వాటి ఉసురు తగిలి ఈనాడిలా విడిపోతున్నాం, పచ్చటి సంసారం మోడైపోయింది. ఇకనైనా ఆ అలవాటు మార్చుకోలేరా!"

నుదుటిని బాధగా చేతితో కొట్టుకున్నాడు రవీంద్ర. "వెళ్తూ వెళ్తూ నా కాళ్ళూ చేతూలూ బంధించేసి వెళ్తున్నావా? సరే, అలాగే కానియ్. ప్రేమతో ఇన్నాళ్ళుగా సాధించలేని దానిని ఈనాడు విరక్తితో సాధించావు. ఒక స్నేహితుడికి మాటిచ్చాను. ఈ ఒక్కరోజుతో ఈ అలవాటుకు స్వస్తి." బాధగా కళ్ళుమూసుకుని వెనక్కి జేరాబడ్డాడు.

"వెళ్ళేటప్పుడు ఏమీ మాట్లాడరా నాతో!"

"ఏమున్నాయి! ఏదో అడుగుతానన్నావ్!"

"ఇప్పుడు కాదు. సెలవు." వంగి అతడి పాదాలకు నమస్కరించబోయింది. చప్పున కాళ్ళు వెనక్కి తీసుకున్నాడు రవీంద్ర. వ్యథతో ఒక్కసారి భర్త కళ్ళలోకి చూచి మెల్లగా కదిలిపోతూ గుమ్మందగ్గర ఆగి, వెనక్కి చూచింది. పిచ్చిగా జుట్టు పీక్కుంటున్నాడు రవీంద్ర. ఆ దృశ్యం చూచిన మాధవి హృదయం తల్లడిల్లి పోయింది, అయినా గుండె రాయి చేసు

కుని గబగబా వెళ్ళిపోయింది. 'తనకేకాని అతడి కేం బాధగా లేదనుకొన్న మాట పొరపాటు. అతడూ గుండెలు పగిలే బాధతో కుమిలిపోతున్నాడన్న మాట! కాని స్వయం కృతాప రాధాలకు ఎవరేం చేయగలరు?'

## ౨౨

మాధవిని ట్రెయిన్ ఎక్కించి శ్రీధర్ బుక్‌స్టాల్ వైపు నడిచాడు. కంపార్ట్‌మెంటులో కూర్చున్న మాధవి ప్లాట్‌ఫారమ్ మీది జనాన్ని పరధ్యానంగా తిలకిస్తూంది. ఆలోచన లెక్కడో ఉన్నాయి. 'పెళ్ళి కాగానే భర్తతో యిక్కడికొచ్చేసింది. భవిష్యత్తుపై పసిడి కలలతో మధుర మధుర భావాలతో ఈ పట్టణంలో అడుగుపెట్టిన తాను రెండేళ్ళయినా నిండక ముందే కలలన్నీ కరగిపోయి బీటలువారిన హృదయంతో పుట్టింటిని చూడబోతూంది. అందరి దృష్టిలో తాను పెద్ద ఆఫీసర్ భార్య. లక్షాధికారుల ముద్దుబిడ్డ. సౌందర్యాల దొంతి. అసమాన ఆధునిక కవయిత్రి. కాని, యథార్థంలో?'

ఎక్కడో నిలిచి ఉన్న దృష్టికి హఠాత్తుగా పరిచితమైన ఆకారం కన్పించింది. ఫుల్‌సూటులో ఠీవిగా నడుస్తూన్న ఆ భారీ యువకుడు యింకెవరు? చక్రవర్తి! ఉలిక్కిపడింది మాధవీ లత. ఆమె తత్తరపాటు సర్దుకునేలోగానే చక్రవర్తి కంపార్టుమెంటులోకి వచ్చాడు. అతడి చేతిలో ప్లాస్టిక్ సజ్జ, రెండు పాకెట్లు, కొద్ది క్షణాలు ఇద్దరూ పరిశీలనగా చూచుకోవడం తప్ప ఎవ్వరూ పలుకరించలేదు.

మెల్లగా దగ్గరకు వచ్చాడు. "పుట్టింటికి వెళ్తున్నారా?"
"ఊఁ" బలవంతాన తలెత్తింది మాధవి.

చక్రవర్తి ఎదుట సీటుమీద కూర్చుంటూ తలెత్తాడు. పాకెట్లు విప్పాడు. మిఠాయిలూ, చీరా, జాకెట్టు గుడ్డా, సజ్జలో పువ్వులూ, పండ్లూ, పసుపూ కుంకుమా! ఆశ్చర్యపోతూ చూస్తోంది మాధవి. శ్రీధర్ వచ్చాడు—"ఏ మయ్యోయ్, నల్లపూసైపోయావు?" అంటూ.

చిన్నగా నవ్వాడు చక్రవర్తి. "నిన్న వచ్చావట. నేను లేను" అంటుంటే మాధవి, శ్రీధర్ ముఖముఖాలు చూచు కున్నారు.

"నిండు సౌభాగ్యంతో, చక్కటి సంతానంతో, కల కాలం మీ జీవితం కలకల లాడుతూండాలని అన్నగా ఆశీ ర్వదిస్తున్నాను. స్నేహితుడుగా భగవంతుని ప్రార్థిస్తున్నాను." తెచ్చిన వస్తువులన్నీ మాధవి చేతిలో ఉంచి ఆశీర్వదించాడు చక్రవర్తి. అప్రయత్నంగా అతడి కాళ్ళకు నమస్కరించింది మాధవి.

శ్రీధర్ ముఖం విప్పారింది. "నా చెల్లెల్ని నాకంటె ఎక్కువ ఆదరిస్తున్నావ్. ఏ విధంగా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలియడంలేదు."

"నిర్మల వదినగారికి చెప్పండి. నేను వెళ్ళినట్టు. అన్న య్యకు సెలవు లేకపోవడంవల్ల ఎవ్వరికీ చెప్పి వెళ్ళే అవకాశం లేకపోయింది. ఏమీ అనుకోవద్దనండి." అంది మాధవి. ఇంత హఠాత్ప్రయాణ మేమని అత డడుగుతాడని భయపడింది. కాని

చక్రవర్తి అడగలేదు. ఆమె మాటలకు ఊ కొట్టలేదు. గంట కొట్టారు స్టేషన్‌లో. "వెళ్తానమ్మా, ఏ దిగులూ పెట్టుకోక సంతోషంగా ఉండండి. మీకు తప్పక దైవం మేలుచేస్తాడు" అంటూ దిగిపోయాడు చక్రవర్తి.

మాధవి చాటుగా కళ్ళు ఒత్తుకోవడం అతడు చూడక పోలేదు.

"చూడు, శ్రీధర్, మీ ఊళ్ళో డాక్టర్ శ్రీదేవి నా క్లాస్‌మేట్. చాలా తెలివైనది. చెల్లాయికి ఆమెచేత ట్రీట్‌మెంటు యిప్పించు. నామాట తీసెయ్యకు."

"తప్పక అలాగే చేస్తాను. థాంక్స్. ఉంటాం." చక్రవర్తి చెయ్యి నొక్కాడు శ్రీధర్.

కదిలిపోయే రైలునుండి ఫాలభాగాన చేతులు జోడించి నమస్కరించింది మాధవి.

## ౨౬

మాధవి లేని యిల్లు మరీ బావురుమంటూ వెక్కిరిస్తూ రవీంద్ర మనోవ్యధను ద్విగుణీకృతం చేస్తూంది. ఇల్లే లోకంగా మాధవే ప్రాణంగా హాయిగా గడిపివేసినరోజులు అప్పుడే ఒకనాటివిగా మిగిలిపోయాయి. ఆట పాటలతో, హాస ప్రతిహాసాలతో దొర్లిపోయిన మధుర ఘట్టం మనస్సులో కంటకమై పోయింది. 'నేనే ప్రాణంగా, నేనే దైవంగా భావించుకునే మాధవి ఎందుకిలా చేసింది? ఎందు కిలా చేసింది?' పిచ్చిగా

గదులన్నీ తిరుగుతూ వాపోయాడు. 'మాధవిలాంటి స్త్రీ ఎక్కడో కాని ఉండదే! ఆమే యిలా చేస్తే ఇక లోకం గతి ఏమిటి? లేక నేనే పొరపడుతున్నానా? తనదంటూ ఏదీ తీసుకువెళ్ళలేదు. ఆఖరికి నగలుకూడా ఇనుపపెట్టెలో వదిలేసి వెళ్ళింది. స్త్రీ ప్రాణాలకూ నగలకూ లంకె అంటారు. నగలపై మోజు నశించిన స్త్రీకి జీవితంపై నే ఆశ నశిస్తుంది. మరి జీవితంతో ఆడుకున్న స్త్రీకి యింత విరక్తి ఎలా వచ్చింది? తా నెంత దూషించినా ఒక్క పరుషపదమైనా పలుకలేదు. నువ్వెంతంటే నువ్వెంత అనలేదు. చదువుకొన్నాను, అంత దాన నింతదాననని అహంకారంగా మాట్లాడలేదు. పురుషుని వద్ద స్త్రీలాగా మాట్లాడింది. భర్తను భార్యగా ప్రాధేయ పడింది. ద్రోహబుద్ధీ, పాపచింతనా ఉన్నదాని ప్రవర్తన అలా ఉంటుందా? ఏమో, స్త్రీబుద్ధి ప్రళయాంతకం.

'అయినా యింత తర్జన భర్జన దేనికి? ప్రత్యక్షంగా కళ్ళతో చూచిన దానికి ఇంకా నిదర్శన మేమిటి? దీని పాట వాడి దగ్గ రెందుకుంది? అర్ధరాత్రివేళ వాడెందుకు వచ్చినట్లు? ఆ ఉత్తరం! కళ్ళకు కట్టినట్లు వీళ్ళ తిరుగుళ్ళన్నీ వ్రాసిన ఆ ఉత్తరం! ఏ అదుపూ లేనిదైతే ఎందుకు మాయం చేస్తుంది? ఛీ ఛీ. ఇటువంటి దాన్ని గూర్చి యింకా ఆలోచనా?'

తుపాకి తీసుకుని వేటకు వెళ్ళిపోయాడు రవీంద్ర పొలాలవేపుకు. కనిపిస్తే కన్పించిన ప్రతి పక్షినీ నేల కూల్చాడు.

"మీ దెబ్బ గురి తప్పడంలేదు. తుపాకివేటలో మీరు మంచి నిపుణులనుకుంటాను మిష్టర్" అన్నాడు తోటి ఆఫీసర్

మంగపతి. "అరె! మీరు ఇదివరలో సిగరెట్ కాల్చేవారు కాదే?" అన్నాడు తిరిగి విస్తుపోతూ.

నీరసంగా నవ్వి, "ఇవ్వాళే మొదలుపెట్టాను" అన్నాడు రవీంద్ర మరోవేపుకు చూస్తూ.

మంగపతి ఆశ్చర్యం తగ్గలేదు. "మాంసం తినడం, సిగరెట్ పీల్చడం వంటి అలవాట్లేవీ మీకు లేవని విన్నాను. మీ శ్రీమతి బాగా చదువుకున్నారనీ, ఆవిడే ఈ అలవాట్లన్నీ కట్టిపెట్టించారనీ..."

"మనుష్యులెల్లకాలం ఒక్కలాగే ఉండరు, దానికేం గాని మధ్యాహ్నం మీ యింటికి భోజనానికి వస్తాను" అన్నాడు రవీంద్ర కనుబొమ లెగరేస్తూ.

"ఆ!" నిర్ఘాంతపోయాడు ఆఫీసర్. "మా భోజనా లెలా ఉంటాయో మీకు తెలుసుగా, రవీంద్రా!"

"తెలిసే వస్తున్నాను. వద్దంటారా ?"

మంగపతి చాలా బాధగా చూచాడు. "నేనలా అనలేదు. మిస్టర్ రవీ. నా కంతకంటే సంతోషమేముంటుంది? కాని చనువుగా చెబుతున్నందుకేమీ అనుకోవద్దు. ఈ మత్స్య మాంసభక్షణకు కక్కుర్తి పడటమే కాని, యిదంత మంచి అలవాటు కాదు. మీ భార్యను నేను చూడలేదు కాని ఎవరో మహాపూజ్యురాలు. ఆవిడ మాన్పించిన అలవాట్లు మళ్ళీ ఎందుకు చేసుకుంటారు? బహుశః ఆవిడ ఊళ్ళో లేరనుకుంటాను."

రవీంద్ర మాట్లాడలేదు. ఎదుట నడుస్తూన్న ప్యూన్ చేతిలో ఉన్న పత్తులలో ఒక కొంగ ఇంకా కొనప్రాణంతో

గిజ గిజ లాడుతూంది. అతడి మనస్సులో ఒక్కసారి గత స్మృతులు మెదిలాయి. పెళ్ళయిన క్రొత్తలో మాధవీ, తానూ షిల్లాంగ్ వెళ్ళారు. ఒకనాడు కొండలమీద సరదాగా తిరుగు తూండగా ఆకాశంలో ఎగిరే పావురాల జంటనుచూపి, 'ఎంత బాగున్నాయో చూడండీ' అంది మాధవి.

'చూడ్డైతే' అని వెంటనే తుపాకి తీసుకొని ఒక దానిని నేల కూల్చాడు రవీంద్ర. రెండవది భయంతో అరుస్తూ ఎగిరిపోయింది. మాధవివద్దనివారించేలోగానే అంతా చిటికెలో జరిగిపోయింది. జంటనుండి విడిపోయి గిలగిల తన్ను కుంటూ నేల కొరిగిన ఆపక్షిని చూచి కంట తడిపెట్టింది, మాధవి.

'ఆకాశంలో ఆనందంగా విహరించే జంటలో ఒకదాన్ని సంహరించి విడదీయడం, ఎక్కడో గూట్లోవున్న పసికూనల కాహారం తీసుకెళ్ళే తల్లిని నేలకూల్చడం—ఏం పను లివి? ఒక ప్రాణం అలా గిజగిజ తన్నుకొంటూంటే మీలో మాన వత్వం ఎలా సహించగలుగుతూంది? ఆహారంకోసం ఒక అంద మైన జీవిని నాశనం చేయడం సంస్కారమా?' అని రెండు చేతులతో ముఖం కప్పుకొని లేచి బంగాళాకు వెళ్ళిపోయింది. ఆ మందలింపు విన్న వెంటనే రవీంద్రునికి కోపంవచ్చిన మాట వాస్తవం. కాని కొద్ది సేపటికి అతడి కోపమంతా జాలిగా మారింది. తన భార్య ఆత్మ సౌందర్యానికి అంజలి ఘటించాడే కాని తన అలవాటును మానుకోలేకపోయాడు. ఆ నాటినుంచీ వేటకు వెళ్ళినప్పుడు మాధవికి తెలియ నిచ్చేవాడు కాదు. తెలిసినా వెంట తీసుకువెళ్ళేవాడు కాదు.

'అది నాకొక సరదా, మాధవీ. ఈ క్షణంలో వదులుకోలేను. కాని ప్రయత్నిస్తాను. ఆడవాళ్ళ హృదయ సున్నితత్వం మాకెక్కడ లభిస్తుంది?' అన్నాడు.

ఒకరాత్రి భోజనం చేస్తూ చేస్తూ లేచిపోయింది మాధవి. ఏమంటే మాట్లాడలేదు. 'సహించడంలే' దంటే నిజమే ననుకున్నాడు. మరో రెండు రోజులుపోయాక ఒకనాడు అలాగే భోజనం ముందునుంచి లేచిపోయింది, 'తలనొప్పి' అంటూ. రానురాను కొన్ని కొన్ని రోజులు మాధవి భోజనం మానేసి పాలో, పళ్ళో మాత్రం తీసుకునేది, కడకు యథార్థం ఊహించగలిగాడు రవి!

ఒకసాయంత్రం షికారుకు వెళ్ళినప్పుడు మాధవి చాల సంతోషంగా కనిపించింది. రవీంద్ర అడగకుండానే రెండు పాటలు పాడింది.

'గడ్డి పూలు, అడవి చెట్లు కూడా ఎంతందంగా ఉన్నాయో చూడండి' అంది.

'అయితే ఈ అందమైన ఆనందసమయంలో ఒకమాట అడుగుతాను, మాధవీ. నిజంచెప్పాలి. మన మధ్య ఎలాంటి దాపరికాలూ ఉండకూడదు.'

'దాని కేం? అడగండి.'

'నువ్వు స్వచ్ఛమైన శాకాహారివి కదూ?'

'అవును. అయితే?'

'ఎదుట నేనన్నీ తింటూంటే నువ్వు వెగటుతో భోజనం మానేస్తున్నావు కదూ?'

మాధవి కళ్ళు విచిత్రంగా కదిలాయి. తలవంచి గడ్డి మొక్కలు పీకసాగింది.

'నువ్వు దాపరికం లేకుండా సమాధానం చెప్తానన్నావని అడిగాను.'

నిట్టూర్చింది మాధవి. 'అవును అసలు నే నెప్పుడూ అవి తినలేదు. పుట్టినప్పటినుంచీ నేను శాకాహారినే. మా యింట్లో అందు కుపయోగించే పాత్రలన్నీ వేరుగా ఉంటాయి. ఆఖరికి ఎదుట కూర్చుని అవి ఎవరైనా తింటూండగా కూడ నేను చూడలేను. ఇంట్లో అటువంటి వంటకాలున్నప్పుడు నేను వేరే ప్రత్యేకంగా భోజనం చేసేదాన్ని. ఆ అలవాటు ఇప్పుడు మార్చుకోవాలంటే కష్టం. అక్కడకూ ప్రయత్నించాను. సాధ్యం కాలేదు. ఆ వాసనే, ఆ తలపే నాకు వాంతి కలిగిస్తుంది. ఏమీ అనుకోకండి'

రవీంద్ర చాలా బాధపడ్డాడు. 'నిన్ను మారమని నేనన డంలేదు. మాధవీ. కాని నీకోసం నేనే మారకూడదూ? అంత బాధగా ఉన్నప్పుడు మాటమాత్రంగా నాతో చెప్పకూడదూ? పైగా అంత కష్టంగా ఉన్నప్పుడు అవన్నీ స్వయంగా నీ చేతు లతో నువ్వు ఎలా వండ గలుగుతున్నావ్?'

'మరెలా? మీకోసం దగ్గరుండి పనిపిల్లచేత వండిస్తు న్నాను.'

'సరే అయితే నీ కోసం నేను మాట యిస్తున్నాను. ఇక జన్మలో అవి తినను. నేనుకూడా పూర్తి శాకాహారిగా మారి పోతాను. నీ కెన్నడూ మళ్ళీ అటువంటి బాధ కలిగించను.'

ఉప్పొంగిపోయింది మాధవి. 'మీ హృదయం నవనీతం' అంది కృతజ్ఞతతో.

'ఊఁ. నీ హృదయం చెరకురసం కదూ!'

ఆ విధంగా గడిచాయి ఆ రోజులు! ఒకరికోసం ఒకరు సునాయాసంగా అనేక త్యాగాలు చేశారు. అభిరుచులు మార్చుకొన్నారు. ఏ మాత్రం కర్కశత్వం, పట్టుదలలు, బలవంతాలు లేకుండానే ఒకరి కొకరు అనుగుణంగా మారిపోయారు. సంసారాన్ని స్వర్గతుల్యంగా మార్చుకొన్నారు. ఆ స్వర్గంలో అమృతమంతా ఈ చక్రవర్తి రాల్చిన విషపు బొట్టుతో నాశనమైపోయింది. ఎందు కూరుకోవాలి ? తన సౌఖ్యాన్ని సర్వనాశనం చేసిన ఆ త్రాచుపామును హాత మార్చేయ్యాలి.'

"ఏమిటంత పరధ్యానంగా ఉన్నారు, మిస్టర్ రవీ" అనే ఆఫీసరు పిలుపుకు ఈ లోకంలో పడ్డాడు.

"ఏమీ లేదు. మీరు వెళ్ళండి. నేను సాయంత్రం కలుస్తా" మరో దారిపట్టి త్వరత్వరగా వెళ్ళిపోయాడు.

ఒక అరగంటలో చక్రవర్తి తోటను చేరుకున్నాడు రవీంద్ర. గేటు తీసుకొని లోపలికి వెళ్ళుతూ ఒక్కసారి తుపాకీ సరిజేసుకొన్నాడు 'నీకు విశ్రాంతి నిచ్చేముందు పెద్ద ఆహారం వేస్తున్నాను' అనుకుంటూ ముందుకు వెళ్ళాడు. కాని తోటంతా కలయ దిరిగినా చక్రవర్తి కాదు, సరికదా అతడి నౌకరుకూడా కన్పించలేదు. టైము చూస్తే పదకొండు. 'ఇంకా హాస్పిటల్‌లో పనవ్వలేదేమో! పోనీ ఎక్కడికి పోతాడు! ఇవ్వాళ కాకపోతే రేపు' అనుకుంటూ వెనుదిరిగాడు. తోట గేటు దాటుతూండగా

అతడిలో మరోభావం రేగింది. చక్రవర్తికి తోటంటే ప్రాణం. నా ఆనందాన్ని సౌఖ్యాన్ని కాలరాచినవాడి సంతోషాన్ని కూడా నలిపి పారేస్తాను' అనుకొంటూ వెనుదిరిగి మళ్ళా తోటలో ప్రవేశించాడు. తామర కొలనులోని పువ్వులూ, ఆకులూ అన్నీ పీకిపారేశాడు. కొలనులో విహరిస్తూన్న ఏడు తెల్లటి బాతుల్ని నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేశాడు. కుటీరంలో తోట పనికి ఉపయోగించే సామ్రగి అంతా ఉంటుందని అతనికి తెలుసు. ఒక పదునైన కొడవలి తెచ్చి, మల్లె, సన్నజాజి, రాధా మనోహారం, మాలతి, ద్రాక్ష తీగలను మొదలంట నరికిపారేశాడు. చేతులకు ముళ్ళు గుచ్చుకుంటున్నా సరే లెక్కచేయకుండా గులాబీలన్నీ విరిచి పారేశాడు. రంగు రంగుల పువ్వులతో కళకళ లాడుతున్న మెట్టతామర, మందార, పారిజాత, బోహీన్‌విల్లా, మన్మధబాణం - ఒకటేమిటి అన్నిటినీ మొదళ్ళతోసహా విరిచి పారేసి కాళ్ళతో నలిపేశాడు. జామ, సపోటా చెట్లనున్న కాయలు, పిందెలు దులిపి పారేశాడు. ఒక అరగంటవరకు రకరకాల అందాలతో సువాసనలు విరజిమ్ముతూన్న ఉపవనం అంతా ఒక్క త్రుటిలో తుఫాను వెలిసిన తరువాత ఉన్నట్లు కలకబారిన సరస్సుతో, నాశనమైన చెట్లతో వెలవెలబోతూంది. ఆ భీకర వాతావరణాన్ని తృప్తిగా చూస్తూ కుటీరంలో అడుగు పెట్టాడు, రవీంద్ర. విశ్రాంతి సమయంలో చక్రవర్తి పడుకొనే పరుపు చుట్ట చుట్టి తెచ్చి కొలనులో పారేశాడు. గొడ్డలితో మంచాన్ని విరిచిపారేశాడు చక్రవర్తి ప్రాణంలో ప్రాణమైన సితార్‌ను ఒక్క వేటుతో రెండు ముక్కలు చేశాడు. తుపాకి భుజాన పెట్టుకొని తృప్తిగా వెళ్ళిపోయాడు.

దాని నడిచే అనేకులు రవీంద్ర భీకర ఆకారాన్ని చూచి బెదిరి తొలగిపోయారు. ప్రపంచాన్నంతనూ కలిపి ఎదిరించగల ధైర్యంతో అడుగువేస్తూ పట్టణాన్ని సమీపించిన అతడి కాళ్లు ఇంటి వైపుకు నడువలేదు.

'అనుకొన్నపని చేసెయ్యడాని కెప్పుడైతేనేం?' అనుకుంటూ చక్రవర్తి ఇంటివైపు నడిచాడు. నిత్యం జనంతో క్రిక్కిరిసి ఉండే డాక్టర్ చక్రవర్తి డిస్పెన్సరీ ఆరోజు వెలవెల పోతూంది. రవీంద్ర వింత ధోరణికివిస్తుపోతూ మూడు రోజుల నుంచి డాక్టరుగారు పనులు సరిగ్గా చూచుకోవడంలేదనీ, ఏవో స్వంత పనులమీద తిరుగుతున్నారనీ చెప్పాడు కాంపౌండరు.

మాట్లాడకుండా వెనుదిరిగాడు రవీంద్ర. ఇల్లు చేరగానే భోజనానికి కూర్చున్నాడు.

"స్నానం చెయ్యకుండానే భోంచేస్తారా బాబూ" అంది వంట మనిషి. గుడ్లు ఉరిమి చూశాడు రవీంద్ర. "కూలి దానవు. పెద్ద కబుర్లు చెప్పకు" అంటూ భోజనంచేసేసి మేడమీదకు వెళ్ళి మంచంమీద కూర్చోబోతుండగా ఎదుటి నిలువుటద్దంలో తన ప్రతిబింబం తనకే భయంకరంగా కన్పించి ఉలిక్కిపడ్డాడు రవీంద్ర. అప్పుడే భోజనం చెయ్యడం వల్ల ఆకలి పనుసుమీద ఉన్న కోపం, మైకం కొంచెం తగ్గి అంతరాత్మలో విచక్షణా జ్ఞానం మేల్కొంది. 'ఇంత భయంకర రూపంలో భుజాన తుపాకీ పెట్టుకొని వీధుల వెంట తిరిగి వచ్చానా?' అని సిగ్గుతో కుంచించుకు పోయాడు.

'ఎందరుచూచి అసహ్యించుకొన్నారోకదా! నాగౌరవం, నా ఆఫీసరు హోదా ఈ నాటితో గంగపాలై పోయాయి,

ఎన్నడూలేని ఇంత ఉద్రేకం ఈరోజు వచ్చింది నాలో!' బాధగా కళ్ళుమూసుకొని జుట్టు పీక్కున్నాడు.

"బాబు గారూ!" ఎదురుగా అతి వినయంతో నిల్చుని ఉంది వంటలక్క.

ఏమన్నట్టు విసుగ్గాచూచాడు. "నేను ఇంటికి వెళ్తున్నాను. తుపాకీ వంట గదిలో పెట్టేశారు బాబూ! జాగ్రత్త పెట్టండి."

"సరేలే" అంటూ మేనువాల్చాడు. కానీ వంటామె కదలలేదు.

"ఇంకా వెళ్ళవేం?"

చేతులు నలుపుకుంటూ భయం భయంగా విన్నవించు కుంది వంటామె.

"నాకు జ్వరం వచ్చిందిబాబూ! ఇక పనిలోకి రాలేను."

"మరేం కొంపమునిగి పోలేదులే. హోటలుకు పోతాను."

"అది కాదు బాబూ!"

"ఏది కాదూ? డబ్బేమైనా కావాలా? అట్టే నాన్చక త్వరగా చెప్పు" విసుగ్గా అరిచాడు రవీంద్ర.

"అంతమాటఅనకండి బాబూ గారూ. మిమ్మల్ని ఇబ్బంది పెట్టలేను. వంటకి నాకూతుర్ని పంపుతాను. రెండు రోజుల పాటు" అంది భయం భయంగా.

"ఎలాగో తగులడు. ముందు నా ఎదుట్నుంచి పో."

ఉదయంనుంచి ఎండలో తిరిగి బరువు పనులుచేసి ఉద్రే కంతో అలిసిపోయిన రవీంద్రకు తెలియకుండానే నిద్ర ఆవరిం చేసింది. కను చీకటివేళ మెలకువ వచ్చిన రవీంద్రకు అది పగలో రాత్రో తెలియ లేదు.

బద్ధకంగా వళ్ళువిరుచుకుంటూ లేవబోతూండగా గాజుల గలగలలు, కప్పుసాసరూ టేబుల్ మీదుంచిన సవ్వడీ విన్పిచాయి. బద్ధకం వదిలిపోయి లేచికూర్చున్న రవీంద్ర క్షణకాలం విస్తుపోయాడు.

పల్చటి దుస్తులు, పూసలదండలు, గిల్టునగలు ధరించిన చవకబారు వేషంతో ఎదురుగా నిల్చున్న పాతికేళ్ళ స్త్రీ ఎవరో తెలుసుకోలేక ఇబ్బందిగా పెట్టాడు ముఖం. 'బహుశః ఎవరైనా బంధువులు వచ్చారేమో?'

అతడి అనుమానం కనిపెట్టిన ఆ స్త్రీ. "అమ్మకు జ్వరం బాబూ, అందుకు నేనొచ్చాను" అంది బొటన వ్రేలితో నేల రాస్తూ.

విషయం అర్థమైన రవీంద్ర అప్రయత్నంగా నిట్టూర్చాడు. "అయితే వంట చెయ్యడానికి ఇంత షోగ్గా వచ్చావన్న మాట! నీకు బుద్ధిలేకపోతే మీ అమ్మకులేదూ? తెలుసుకు ప్రవర్తించు" అంటూనే బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు. రవీంద్ర ముఖం కడుక్కొని బయటకు వచ్చేసరికి తువ్వాలు అందించబోయిందా యువతి. రవీంద్ర అందుకోలేదు. ఛీదరించుకున్నాడు.

"అక్కడ పెట్టి వెళ్ళు. నీపని వంటమాత్రమే. నువ్వు నా గదిలోకి రాకు. భోజనానికీ, కాఫీకీ నేనేవచ్చి తీసుకుంటాను క్రింద" తీక్షణంగా అంటూ కాఫీ కప్పు చేతికి తీసుకున్నాడు.

కొద్దిగా జంకినట్లు కన్పించిందా యువతి. చేతిలోని తువ్వాలు జారి క్రింద పడింది.

'పాపం! భయపడిందేమో? ఎందుకన్నానా?' అని లోలోన కించపడుతూండగా వంగి తువ్వాలు తీసుకు వెనుదిరిగి పోతూన్న ఆ యువతి పొడుగాటి జడ రవీంద్ర కుడిచెంపమీాద ఛెళ్లున తగిలింది. బిత్తరపోయిన అతడు తేరుకునేలోగానే ఆ యువతి అదేమీా గమనించనట్లు చరచరా నడిచి వెళ్ళి పోయింది.

'మాధవి పెళ్లి యింకా ఒకరోజైనా గడవలేదు. అప్పుడే ఎంత వెలితిగా ఉంది! ఎన్నిలోట్లు కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నాయి! ఏపని ఏమైందో, ఎవళ్ళెలా మసులుకుంటు న్నారో నాకక్కరలేకపోయేది. ఏవేళల్లో కావలసిన సదు పాయాలు ఆవేళల్లో దేవతలాగా అమర్చిపెట్టేది. దేవత! అవును. ఏ శాపంవల్లనో ఆ దేవత రాక్షసైపోయింది. తనను మోసం చేసి, తనసుఖాన్నీ ఆత్మశాంతినీ నాశనంచేసి వెళ్ళి పోయింది. అసలు పెళ్లిలేనివాడికేబాధాలేదు. కాని పెళ్లై ఒక్కసారి స్వర్గలోకంలో విహరించినవాడిని పాతాళంలోకి విసిరేస్తే ఎంతబాధ? దేవతలమధ్య ఉన్నాననుకునేవాడిచుట్టూ రాక్షసులు జేరితే ఎలా ఉంటుందో, చల్లటి పన్నీటిలో జలక మాడుతున్నవాడిని ఒక్కసారి కళకెళమంటూ కాగుతూన్న నూనెలో ముంచితే ఎంతబాధగా ఉంటుందో అనుభవించిన వాడికే కాని అర్థంకాదు. ఛీ ఛీ ఛీ ఎందుకీ బ్రతుకు? ఏసుఖం కోసం జీవించాలి? ఎవరికోసం సంపాదించాలి? అవును. ఎవరి కోసమూా అక్కరలేదు. అందుకే అక్కర్లేని బ్రతుకు ముగించే ముందు పగతీర్చుకోవాలి! పగతీర్చుకు మరీ చావాలి!' లేచి గబగబా దుస్తులైనా మార్చుకుండా క్రిందికి వెళ్ళాడు. ఒక విధంగా అతడు యుక్తాయుక్తా లెరుగని పిచ్చివాడయ్యాడు.

ప్రొద్దున్న తుపాకీ ఎక్కడ ఉంచాడో మరచిపోయాడు. గదులన్నీ వెతుకుతూన్న రవీంద్ర మాధవి డ్రెస్సింగ్ రూమ్‌లో అడుగు పెడుతూనే చలించి పోయాడు.

మాధవి బట్టలు ఉండే బీర్వాముందు నిల్చొని అద్దంలో చూచుకుంటూ ధగధగ మెరిసిపోయే పట్టుచీర సింగారించు కొంటూంది, ఇంతకు ముందు కాఫీ యిచ్చిన యువతి. సగం సగం బట్టలు కట్టుకుంటూన్న ఆ యువతి, ఆ సమయం కలిసి ఒక్కసారిగా రవీంద్ర కండ్లకు పొరలు కమ్మేటట్లు చేశాయి. అంతకు ముందు అసహ్యంగా కనబడ్డ ఆ స్త్రీయే యిప్పుడు అప్సరసగా కన్పట్టిందతడి నేత్రాలకు.

" ఈచీరెక్కడిది?" అన్నాడు దగ్గరగా నడుస్తూ

అంతవరకు చూడనట్టు నటిస్తూన్న ఆ యువతి వయ్యా రంగా ఇటు తిరుగుతూ, "ఆ బట్టలు బాగులేవన్నారని, అమ్మ గారి చీర కట్టుకుంటున్నాను బాబూ" అంది అమాయకత్వం కన్పరుస్తూ.

"అమ్మగారు! అహహా! అమ్మగారెవరు? ఇంక నువ్వే అమ్మగారివి" అన్నాడు కనుబొమ్మ లెగరేస్తూ.

"నేనలాటిదాన్ని కాను బాబూ. వంటదాన్ని." భయ పడుతున్నట్లు దగ్గరగా వస్తూన్న అతడిని తప్పించుకోబోయింది.

"నటించకు. తెలుసులే, ఎవరివో! మీ అమ్మ పథకం బాగానే పారింది. నీ పేరేమిటి?"

"సీత."

"ఛస్. సీతా, సావిత్రి. ఆవాసనే పనికిరాదు మనకి. సీతులూ నిజాయితీలూ వద్దు. సుఖం – అదే. అదే కావాలి.

చంచల! చంచలని పిలుస్తాను, పలుకు. ప్రతి ఆడదానిదీ చంచల హృదయమే!"

అసలే వికలంగా ఉన్న రవీంద్ర మనస్సు ఒక్క త్రుటిలో స్థిరత్వంకూడా కోల్పోయింది. మంచి, చెడు విచక్షణాజ్ఞానం పూర్తిగా కోల్పోయాడు.

## ౨౩

పరీక్ష ముగించి వెళ్ళబోతున్న శ్రీదేవిని ఆపుజేసింది మాధవి.

"కొంచెంసేపు కూర్చోండి, డాక్టర్. మీ మందుల కంటె మీ మాటలే బలాన్నిస్తున్నాయి నాకు."

నవ్వుతూ కూర్చుంది శ్రీదేవి. "అది నా వృత్తి ధర్మమమ్మా, నాలో ప్రత్యేకతేమీ లేదు. అయినా మీ కేం కంగారు లేదు. తప్పకుండా నయమవుతుంది. చక్కటి పాపాయి నెత్తుకుంటారు."

"చక్రవర్తిగారు మీచేత ట్రీట్ చేయించుకోమని చెప్పడం ఎందుకో ఇప్పుడర్థమైంది. ఇంత చల్లగా ఆదరణగా ఎవరైనా మాట్లాడతారా? ఇంతకూ చక్రవర్తి మీకు..."

"ఆతడూ, నేనూ మెడిసిన్‌లో క్లాసుమేట్సుము. అతడు లక్షలలో లెక్కింప దగ్గవ్యక్తి. మీ కేమౌతారు?"

"మాకు బంధువులు, స్నేహితులుకూడా. మావదినా, చక్రవర్తి భార్యా అక్క చెల్లెళ్ళు అవుతారు."

"ఓహో! చక్రవర్తి భార్య ఎలా వుంటారు? తెలుసా మీకు?"

నవ్వింది మాధవి. "అందంగానే వుంటుంది" "సరే, అది కాదు..." అంటూ ఇబ్బందిగా పెట్టింది శ్రీదేవి ముఖం.

ఈసారి ఇద్దరూ నవ్వేశారు. "సంస్కారం తక్కువ, అతని స్థాయి నందుకో లేక, అర్థం చేసుకో లేక బాధపడుతూం టుందనుకుంటాను. బంధువే అయినా నాకూ అంత ఎక్కువ చనువు లేదు" అంది మాధవి.

"అతడు చాలా బాగా పాడతాడు. గొప్ప కళా హృదయం" అంది శ్రీదేవి.

మాధవికి చటుక్కున ఏదో గుర్తు వచ్చింది. "సుధంటే ఎవరో మీకు తెలుసా!" అడిగింది.

"అతడి చెల్లెలే. సుధంటే అతనికి పంచప్రాణాలు. బాగుందా? ఎక్కడుంది?"

కంపించిపోయింది మాధవి. 'చెల్లెలు!' ఎంత నీచంగా ఊహించింది తాను? అయ్యయ్యో! కట్టరాని సంబంధమే! మనస్సులో ఊహించినా, పైకిఅన్నా పాపపు మాట పాపమే. అందుకే ఫలితం వెంటనే ఇలా కనపడింది!

"ఏమి టాలోచిస్తున్నారు? సుధ ఎక్కడుందని అడిగాను నేను" అంది శ్రీదేవి తిరిగి.

"ఏమో, తెలియదు, డాక్టర్." చనిపోయిందని చెప్పి ఆమె మనస్సుకు బాధ కలిగించలేక పోయింది.

"ఆమెచాలా తెలివైనదని చెప్తూ, 'ఆమెకు దీటైనవాడు దొరుకుతాడా?' అని బాధపడే వాడాయన. ఆఖరికి ఎవరి

కిచ్చి పెళ్ళి చేశారో కాని తెలియలేదు. ఈమధ్య కలుసుకో లేదు."

"ఆ సంగతికేం కాని మీరేమీ అనుకోరు కదూ? మీరెందుకు పెళ్ళి చేసుకోలేదు." అంది మాధవి.

శ్రీదేవి ఆశ్చర్యపోయిందా ప్రశ్నకు.

"చదువుకున్న వాళ్ళం, అర్థం చేసుకోగల వాళ్ళం అని అడిగాను. ఒక కారణంకూడా వుంది మీరు పెళ్ళయితే యింత నిస్వార్థంగా, ఆదరణతో రోగులను చూడలేరేమో అనిపిస్తుంది నాకెందుకో."

"ఏమో, కావచ్చు. అయినా అందు కిక అవకాశం లేదు. ఇక నేను వివాహం చేసుకోను."

"తగినవారు దొరకకా?"

నవ్వింది శ్రీదేవి. "తగినవారు ఎప్పుడూ దొరకరు. ఏవో కొన్ని లోపాలు వారిలోనూ ఉంటాయి. మనలోనూ వుంటాయి. మన విద్యలకు తగినవారనుకోనేకంటే మననూ, మన విద్యనూ గౌరవించగలవారిని కోరుకుంటాయి మన స్త్రీ హృదయాలు. అయినా అవేమీ నాకు కారణాలు కావనుకోండి. ఒక సంఘటనవల్ల నేను పెండ్లి చేసుకోకూడదని నిశ్చయించుకున్నాను. ప్రపంచంలో అంతా పెళ్ళి చేసుకొంటూనే వున్నారు. ఎక్కడో నాలాటివాళ్లు చేసుకోకపోతే నేం పోసీ? విసుగూ, విరామం లేకుండా ఈ రోగులకు చేసే సేవలోనే నాకు సంతోషం అను లలాటి కోరికలకు, ఊహాలకు తీరికే చిక్కదు."

"ఏమయితేనేం? మీరదృష్టవంతులు. అనేక కష్ట నిష్ఠురాలుండే సంసారంకంటె నిష్కామమైన ఈ జీవితమే మంచి మార్గమేమో!"

నవ్వింది శ్రీదేవి. "లేదు, మాధవీ, లేదు. చూడండి క్రోటన్ మొక్క ఎంత అందంగావున్నా ఫలపుష్ప భరితమైన చెట్టు అందం వస్తుందా? కాని భగవంతుడు వాటి నట్లా పుట్టించాడు. ఒకదాని యోగ్యత ఒకదానికి లేదు; రాదు. అలాగే మన జీవితాలూను. కొన్ని ప్రత్యేక కారణాలవల్ల కొన్ని కొన్ని జీవితాలు మధురిమకు దూరమౌతాయి. వాటిని గూర్చి చింతాకూడదు, ప్రశంసా అనవసరమే. నేనిక వెళ్తాను మరి!"

మాధవి కండ్లు అప్రయత్నంగా చెమర్చాయి. 'చక్రవర్తి వంటి వాళ్ళకు ఇటువంటి స్త్రీ లభిస్తే జీవితం నందనవనం కాదూ? కాని అలా జరగదు ఏమిటో, భగవంతుడి సృష్టిలో ఈ విపర్యయాలు!'

## ౨౮

ఆఫీసుకు సెలవు పెట్టేసి రోజులు క్షణాల్లా దొర్లించేస్తున్నాడు రవీంద్ర. ఎప్పుడూ చంచల అతడి ప్రక్కనే వుండాలి. ఆమె తల్లికూడా వంట మానేసి ఇంటికి పెద్దరికం వహించింది. క్రమంగా మాధవి నగలన్నీ చంచల శరీరంపై ప్రకాశింప మొదలుపెట్టాయి.

సాయంత్రం నాలుగు గంటలకు నిద్రలేచిన రవీంద్ర బద్ధకంగా కళ్ళు విప్పకుండానే, "చంచలా" అన్నాడు. సమాధానం రాలేదు.

"ఓ డార్లింగ్ చంచలా!"

సమాధానంగా సన్నని గొంతు బదులుగా గంభీర పురుషకంఠం ఖంగున మ్రోగింది.

"మిస్టర్ రవీ!"

బద్ధకంగానే కళ్ళు విప్పాడు రవీంద్ర. "ఎవరూ?"

ఎదుట కుమ్మం నిలువునా సాక్షాత్కరించిన గంభీర విగ్రహాన్ని చూడగానే కొద్దిగా తత్తరపడ్డా వెంటనే సంబాళించుకున్నాడు. ప్రక్కవిూదనుంచి లేవకుండానే "ఎందుకొచ్చావ్?" అన్నాడు.

చక్రవర్తి మౌనంగానే అతడిని సమీపించి లాక్కుని కూర్చున్నాడు.

"నేను మాధవిని కాను, అట్లా మైమరచి చూస్తున్నావ్?" అన్నాడు రవీంద్ర లేవకుండానే.

"రవీంద్రా!" చక్రవర్తి, రవీంద్ర రెండుచేతులూ పట్టుకుని జాలిగా చూశాడు. "నీ కేమైనా న్యాయంగా ఉందా ఈమాట? మాధవి నాచెల్లెలు రవీంద్రా, నమ్ము నా మాట."

సగంలోనే త్రుంచేశాడు రవీంద్ర, "ఎవరు నీ చెల్లెలో, ఎవరు నీ ప్రియురాలో నాకెందుకు? ఫో నా ఎదుట్నుంచి!" చేతులు విదిలించేశాడు.

నిస్సహాయంగా చూచాడు చక్రవర్తి. "పరాయి వాడితో మాట్లాడడానికి కూడా జంకే ఆ పతివ్రతకా ఈ అపవాదు? ఆమె ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడమని ఒప్పగించి వెళ్ళిన నీకే ఈమాట అనడాని కెలా మనస్కరిస్తోంది?"

"అర్ధరాత్రి చెల్లెల్ని చూడ్డానికే వచ్చావుకదూ? గెటవుట్ స్కౌండ్రల్. నాకన్నీ తెలుసు."

"నువ్వేమన్నా పడతాను, మాధవికోసం, కాని ఆమెను అన్యాయం చెయ్యకు, రవీంద్రా. ఎవరో అనూయపరులు వ్రాసినదానికి ఏదో ఆవేశపడ్డావు; సర్దుకుపోతావనుకున్నాను. నా ప్రాణప్రదమైన తోటను వల్లకాడు చేశావు. ఇంకా నీ కక్ష తీరలేదా రవీంద్రా?"

వికటంగా నవ్వాడు రవి. "అయితే గ్రహించావన్న మాట! తోటేకాదు, నిన్నుకూడా కాల్చి చంపుదామనే వచ్చా నా రోజు. కానీ నీ కింకా నూకలుండిపోయినాయి."

"అయితే ఉత్తరం సంగతి నీకు తెలుసునన్నమాట! ఉత్తరం జాగ్రత్తగా నీ కందించి నాతో తెలియదని అబద్ధ మాడింది, నీ సలహాయే కదూ?"

నీరసంగా నిట్టూర్చాడు చక్రవర్తి. "విధి బలీయత అంటే యిదే. నేనే సంగతి చెప్పి నీ మనస్సు మరల్చుదామని చూచినా, దానివల్లే నీ అనుమానా లింకా దృఢ పడుతున్నాయి. ఆ ఉత్తరం మాధవి యివ్వలేదు. నాకే దొరికింది. ఒకనాడు నిన్ను కలుసుకోవడ నికివస్తే—"

చక్రవర్తి మాటపూర్తి కానివ్వలేదు రవీంద్ర. "వాదనలు అవసరంలేదు! బయటికి నడు ఇడియట్." అంటూ

పొగరుగా లేచాడు రవీంద్ర. "నీ తోటకు పట్టిన గతే నీకూ పట్టగలదు."

"నేనూ అదే చెప్పబోతున్నాను రవీంద్రా. నాతోట, నా సర్వస్వమే కాదు, నా ప్రాణాలే పణంగా ఒడ్డగలను మాధవికోసం. కాని నే చెప్పేది పూర్తిగా విను."

"వినను; నీ ప్రాణా లెందుకు నాకు! ఆవేళేదో తొందర పడ్డాను కాని, నీ ప్రాణాలు తీయడం దేనికి ? నువ్వు చేసిన తప్పేమిటి ? ఆడది కూడా పడింది; నువ్వంగీకరించావ్! ఇప్పుడు నేనూ అంతే. తప్పేముంది ? ఎవరి సుఖం వాళ్ళు చూచు కుంటాం. నీతి నియమాలు ఎరగం. అహాహాహ !" బిగ్గరగా నవ్వేసి చంచలను పిలుస్తూ క్రిందికి వెళ్ళిపోయాడు.

వెనుకటి గాంభీర్యం సంస్కారం లేకపోగా త్రాగినవాడు మాట్లాడినట్లున్న ఆ మోటు ధోరణి చూచి నిశ్చేష్టుడయ్యాడు చక్రవర్తి. భారంగా వెళ్ళిపోయాడు.

౨౯

వ్యాహ్నంవేళ చంచలతో మరో లోకంలో విహరిస్తూన్న రవీంద్ర క్రింద పిలుపు విని ఈ లోకంలోకి దిగాడు. లేచి వెళ్ళబోతుంటే, "ఎవరో పోనిద్దురూ. మాఅమ్మ చూచు కుంటుంది" అని మృదువుగా వారించింది చంచల. కాని ఆకంఠం అలా విన్పిస్తూనేవుంది. రవీంద్రకు ఇక తప్పలేదు. మేడ దిగి హాల్లోకివస్తూనే ఆ వ్యక్తిని చూచి కొంచెం కంగారు పడ్డాడు. తనతోటి ఆఫీసర్ మంగపతి!



"గుడ్ ఈవినింగ్ మిష్టర్ రవీంద్రా" అన్నాడు పరీక్షగా చూస్తూ, మంగపతి.

"గుడ్ ఈవినింగ్!" యథాలాపంగా అలవాటైన మాటలు నోటినుంచి దొర్లిపోయాయి. కాని అతడి ఆలోచనలు రకరకాలుగా సాగిపోతున్నాయి.

"మీ రింట్లో లేరని చెప్తున్నారు వీరు?" అన్నాడు చంచల తల్లిని చూపుతూ, మంగపతి. తల్లీ కూతుళ్ళిద్దరూ విసవిసా లోపలికి వెళ్ళిపోయారు.

ఒక్కసారి అటు చూచి, "దాని కేంలెండి. లేరను కున్నారేమో! ఇంతకూ మీరు వచ్చిన కారణం?" అన్నాడు నిర్మొగమాటంగా రవీంద్ర.

మంగపతి ముఖం చిన్నబోయింది. "ఆ రోజు వేటకు వెళ్ళాక మనం తిరిగి కలుసుకోలేదు. మా యింటికి భోజనానికి వొస్తానన్నారు; రాలేదు. మీ ఆరోగ్యం బాగుండలేదని సెలవు పెట్టారు. ఎలా ఉందో చూచి పోదామని వచ్చాను."

రవీంద్ర ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు. జవాబివ్వకుండా నీరసంగా ఒక కుర్చీలో చతికిలబడ్డాడు. అతడు చెప్పకపోయినా తానూ కూర్చున్నాడు మంగపతి.

"మిష్టర్ రవీంద్రా. వ్యక్తిగత విషయాలలో కలిగించు కొంటున్నానని ఏమనుకోకండి. కాని స్నేహితుడుగా చనువు తీసుకుంటున్నాను. మీకు శారీరక రుగ్మత ఏమీ లేదని స్పష్టంగా తెలుస్తోంది. ఆ రోజు మనం తుపాకి వేటకు వెళ్ళినప్పుడుకూడా మీ రదొక మాదిరిగా ఉన్నారు" అనేసి రవీంద్రను పరీక్షగా చూడసాగాడు, మంగపతి.

రవీంద్ర ముఖం కోపంతో జేవురించింది. "వ్యక్తిగత విషయం అంటూనే ఆరా తీయడం దేనికి ? ఏదో కారణం ఉంది గనుకనే సెలవు పెట్టాను" అంటూ లేచాడు రవీంద్ర, సంభాషణకు ముగింపు సూచిస్తూ.

పనివాని అమాయికతకు జాలిపడుతున్న వృద్ధుడులా నవ్వాడు మంగపతి. "మిస్టర్ రవీంద్రా, వ్యక్తిగత విషయం సక్రమంగా ఉన్నంతవరకే, కాని అది గాడి తప్పితే అందరి జోక్యం ఉంటుంది. ఇదేమిటో చూడండి." పర్సులోనుంచి ఒక ఉత్తరం తీసి రవీంద్ర చేతిలో పెట్టాడు. చూస్తూనే అది మాధవి దస్తూరీ అని కనిపెట్టేశాడు రవీంద్ర.

"నేను చాలా విచారిస్తున్నాను రవీంద్రా. మిగతా ఉత్తరాలతోపాటు యిదీ నాకే అనుకుంటూ అనాలోచితంగా తెరిచేశాను. అప్పుడు తెలిసింది, మీ ఉత్తరమని. ఇంటికి రెండు ఉత్తరాలు వ్రాసినా జవాబులేక, ఆఫీస్ అడ్రస్‌కు వ్రాశారట మీ శ్రీమతి. ఇది భద్రంగా మీ కందివ్వటానికే నే నొచ్చాను. వస్తాను మరి. విష్ టు సీ యు ఎగెయిన్ యిన్ హాపీ మూడ్స్" అంటూ నిష్క్రమించాడు మంగపతి.

"శ్రీ రవీంద్రగారికి,

భగవత్కృపవల్ల క్షేమంగా ఉన్నారని, ఈపాటికి మీ హృదయంలో పరివర్తన కలిగి ఉంటుందనీ ఆశిస్తున్నాను. ఇంటి అడ్రస్‌కు నేను రెండు ఉత్తరాలు వ్రాశాను. అన్నయ్య ఒక ఉత్తరం వ్రాశాడు. అయినా మీరు జవాబివ్వలేదు. నా మీద కోపం తగ్గలేదని అనుకొన్నాను. కాని అన్నయ్య

కైనా వ్రాయకపోతే ఏమనుకోంటాడు ? ఎవరి గౌరవానికీ భంగం వాటిల్లకుండా ప్రవర్తిస్తానన్నారు, ఏదీ మరి ?

"ఇటువంటి విషయాలలో మగవారికంటే ఆడవాళ్ళు త్వరగా గ్రహించేస్తారు. మీ దగ్గర్నుంచి ఉత్తరాలు రావడం లేదని అమ్మా, వదినా పదే పదే అనుమానంగా అడుగుతున్నారు. పైకి అనడం లేదుగాని బహుశః అన్నయ్యకు కూడా అనుమానమే కలిగి ఉండవచ్చు. వాళ్ళ అనుమానపు చూపులు, మాటలు నేను భరించలేకుండా ఉన్నాను. వచ్చే ముందు నా స్థితి మీకు పూర్తిగా చెప్పాను కదా ? అయినా మీకు జాలి లేదా ?

"నా పాట వింటూనే పరవశించే మీ హృదయం యింత కఠినమై పోయిందేం ? నా కోసమని ఎన్నో అలవాట్లు మార్చుకొన్నారు. ప్రాణసమంగా ప్రేమించేవారు. అటువంటి మీకు యింతటి ద్రోహంచేసే పాపాత్మురాలి ననుకొన్నారా ? ఇంకా మీ కోపం చల్లారలేదా ? ఆవేశాన్ని దూరంగా నెట్టి ఒక్కసారి ఆలోచించి చూడండి.

"నా క్షేమ విషయాలు మీ కవసరం లేకపోయినా వ్రాస్తున్నాను. నాకు నీరసం యింకా ఎక్కువైంది. రక్తపు పోటులో చాలా మార్పు కన్పిస్తూంది, అంటోంది డాక్టర్. ఏ చిన్న చప్పుడువిన్నా గుండెల్లోదడ. ఇవన్నీ నన్ను మృత్యువుకు దగ్గరగా తీసుకుపోతున్నాయని అనుకుంటున్నాను. అమ్మా అన్నయ్యల విచార వదనాలను చూస్తూంటే, నన్ను గురించి నాకు తెలియని విషయమేదో వాళ్ళకు డాక్టర్ చెప్పినట్లు తోస్తూంది. బహుశః నా స్థితి చాలా తీవ్రంగా ఉందేమో !

"శారీరక స్థితి చూస్తే యిలా వుంది. సంసార స్థితి చూస్తే అలా వుంది. నాకు జీవించాలని కోర్కె లేదు. కాని ఇంతటి అపవాదుతో మాత్రం చావాలని లేదు. నేను చక్రవర్తితో మాట్లాడటానికి సంకోచిస్తే 'అతడు విదేశాలకు వెళ్ళి వచ్చినవాడు. అతని ముందు నీ ప్రవర్తనకు నాకు సిగ్గువేస్తోంది?' అనేవారు. అలాటి మీరే యిప్పుడిలాగంటే ఏమనుకోను ? మగవారు గనుక ఎప్పుడైనా, ఏ మాటైనా అనగలరనుకొంటాను. డాక్టర్ చక్రవర్తి నన్ను విపరీతంగా ప్రేమించిన మాట వాస్తవం. కాని అందులో తుచ్ఛమైన దేమీ లేదు. నా పోలికలు, నా గుణాలు ఉన్న ఆప్తుల నెవరినో కోల్పోయినట్టూ, వారి ఛాయలు నాలో కన్పించినందువల్ల ఏదో ప్రత్యేకాభిమానం చూపుతున్నట్టూ కనిపించేది అతడి ప్రవర్తన. ఏదో బాధ రేగుతూన్నట్లుగా సంభాషణ త్రుంచేసి సగంలోనే వెళ్ళిపోయేవాడు కాని, ఏనాడూ నాతో అధికంగా మాట్లాడడం కాని, అతడి స్వవిషయాలు ఏకరువు పెట్టడం కాని చెయ్యలేదు. మీరు బెంగుళూరు వెళ్ళినప్పుడు, మరీ మరీ చెప్పి వెళ్ళారని రోజుకోసారి స్వయంగా వచ్చి యోగక్షేమాలు కనుక్కుంటూ ఉండేవారు, మీరు వ్రాసిన ఉత్తరాలను చూపించి, మీకు నాయందుగల ప్రేమాభిమానాలకు మురిసిపోయేవాడు. ఒకనాడు ఉదయం అతడు వచ్చేసరికి నేను భోజనం చెయ్యలేదు. మీరు లేనందువల్ల బద్ధకించి, ఏ పాలో త్రాగవచ్చుననుకొని వంట ప్రయత్నమే చెయ్యలేదు. అది గ్రహించి చక్రవర్తి బలవంతంగా వాళ్ళింటికి తీసుకు వెళ్ళాడు. భోజనానికి ఆ సాయంత్రం నేనూ, నిర్మలా, చక్రవర్తి, నిర్మల స్నేహితులు కొందరూ అతడి తోటలోకి

వెళ్ళాం. సినిమాకు రమ్మని బలవంతంచేస్తే వెళ్ళలేదు. ఇక తోటలోకిమాత్రం వెళ్ళకతప్పలేదు. ఆవాళ నా బల్లమీదున్న కథల్ని అతడే తీసుకువెళ్ళాడు. ప్రతిరోజూ రాత్రి నాకు తోడుగా వాళ్ళ నర్సును పంపేవాడు. మీరు రావడానికి ముందురోజు ఏదో సీరియస్ కేస్ ట్రీట్ చేస్తున్నానని చెప్పి ఊరు వెళ్లిపోయాడు. మీరు వచ్చిన నాటి రాత్రి అతడు ఊరునుంచి వస్తూ ఇంట్లో లైట్లు వెలుగుతూండడం చూచి నేనొక్కతెనే ఉండడం గుర్తుకువచ్చి ఏదో ప్రమాదాన్ని శంకించి, చూచిపోవడానికి మనింటికివచ్చాడట. అతడా సమయంలో వచ్చినందుకే మీరనుమానిస్తున్నారు కాని. పగలంతా రోగులతో అంత శ్రమపడి ఉండికూడా మీరతడికి అప్పజెప్పి వెళ్ళిన బాధ్యతా నిర్వహణకోసమై ఆ నిశిరాతివేళ కూడా తాపత్రయపడ్డాడన్న సంగతి మరిచిపోతున్నారు. ఇందుకు మీరు తప్పక సంతోషించి ఉండేవారే. కాని మీ మనస్సు ఆ ఉత్తరంవల్ల కలుషితమై పోయింది. ఇంతకూ అందులో ఏముందో నాకు తెలియనే తెలియదు. అయినా నేనెన్ని విధాల ఆక్రోశిస్తే ప్రయోజన మేమిటి? ఏ సమస్యా పరిష్కారానికైనా కాల పరిపక్వత అవసరం. కాని నా సంగతి కేం? ఉత్తముడైన చక్రవర్తితో స్నేహబాంధవ్యాలను పోగొట్టుకోవద్దని చెప్పడానికి సాహసిస్తున్నాను.

"మీరు ఏదైనా ఒక కోరిక కోరమన్నారు. కాని ఒక కోరిక కాదు. ఒక భావం కాదు. నాలో గుప్తంగా ఉన్న అనేక భావాలను, కోరికలను మీకు విప్పి చెప్పుతున్నాను. బాగా ఆలోచించి మీకు నచ్చినట్లు చేయండి. ఎంతటిఆప్తులనైనా చనువుగా ఒక కోరిక కోరటానికి గాని, అధికారంతో

శాసించడానికిగాని, ముందుగా తగిన ఆత్మీయత, అర్హత సంపాదించివుండాలి. ఇదివరలో మీావద్ద నాకీ రెండూ ఉన్నా యని భావించాను. కాని యిప్పుడది భ్రమ అని తేలిపోయింది. అందువల్ల హృదయం మీాముందు పరుచుతున్నాను. మీాకు నచ్చినట్లు చేయండి.

"ఏ ఒక్కరినీ ఆధారం చేసుకొని సర్వసమన్వయం చేయకూడదు. అందువల్ల నా మరణానంతరం మీారు పున ర్వివాహం చేసుకొని సుఖపడాలని నా మొదటికోర్కె. మన సంబంధం ముక్కలైపోవడానికి మీారూ, నేనూ కారణం కాదు; ఏదో అతీతశక్తి, మానవ మేధస్సుకూ, ప్రేమ సౌహార్ద్రాలకూ, విపరీతంగా పెరిగిపోతున్న ఆధునిక విజ్ఞా నానికీ అందని-లొంగని ఆ అతీతశక్తే విడదీసిన ఆ సంబంధాన్ని తిరిగి అతకాలి. అంతవరకు నిరీక్షించడమే కర్తవ్యం. కాని ఒకవేళ నేను జీవిస్తే అనే ప్రశ్న ఎదురౌతున్నది. శత విధాల అది అసంభవం. పూర్తి ఆరోగ్యవంతులే యీా స్థితిలో బ్రత కడం కష్టం. అటువంటిది యిక నా సంగతి చెప్పాలా? కాని పూచికపుల్లకూడా మనం కోరితే గగన కుసుమం అవుతుంది. అలాగే మరణంకూడా తేలికగా లభ్యమయ్యేది కాదు. జీవి తాలతో ఆడుకొంటుంది. భయపడి పరుగెత్తేవారిని తరిమి పట్టుకొంటుంది. తనవెనుక పరుగులెత్తిపొంద ప్రయత్నించిన వారికి అందకుండా తప్పుకుపోయి కవ్వించుతుంది. ఈ పరమ సత్యమే నావిషయంలో కూడా రుజువు కావచ్చు. నేను బ్రతికి వుంటే యిక్కడుండకూడదు. ఉండలేనని కాదు, ఉండ కూడదు. పెళ్లైన ఆడది పుట్టింట్లో వుండకూడదు. ఉంటే అందరికీ అప్రతిష్ఠ. ఇందుకు కులమత తర తమ భేదాలు

లేవు. అందువల్ల మీరు నన్ను విధిగా అక్కడికి తీసుకువెళ్ళాలి. మన సంబంధం ముక్కలైపోయిన తర్వాత నేనక్కడ వుండి కాని బ్రతికిసాధించేదేమీ లేదు. ఉండడంలో అర్థమూ లేదు. కాని బ్రతికి వుండాలి గనుక కేవలం సత్యంకోసం నిలబడి, ఆశతో నిరీక్షించాలి. లోపలఎన్ని వున్నా పైకి ప్రపంచంకోసం దానిమార్గంలోనే నడవాలి. కనీసం నడుస్తున్నట్లు కన్పించాలి. ఈ ఆశా, నిరీక్షణా, నమ్మకలలోనే జీవితార్థం యావత్తూ యిమిడివుంది. ఏమీ లేకపోయినా మూతపెట్టి యిందులో ఏదో వుందంటే తృప్తిపడుతుంది లోకం.

"నాకేదైనా విషమించిన పరిస్థితిలో టెలిగ్రామ్ యిస్తాను మీ రెక్కడున్నా, ఎన్ని పనులున్నా ఒక్కసారి కోపం దిగమ్రింగి వచ్చి నాకు కడసారి చూపు దక్కేటట్టు చెయ్యాలి. ఆ తర్వాత నిర్మలమైన మనస్సుతో మీరు నా అంత్యక్రియలను జరపాలని నాకోరిక. ఇప్పటికే చాలా వ్రాసి విసిగించాననుకుంటాను. క్షమించండి. బహుశః ఇదే యిదే నా ఆఖరి వుత్తరం. మిమ్మల్ని జవాబివ్వమని అడిగే ధైర్యం కూడా లేదు. కాని అన్నయ్యకు మాత్రం వ్రాస్తారు కదూ?

"బహుశః పత్రికవారు కొద్ది రోజులలో నాకు బహుమతి వచ్చిన డబ్బు పంపిస్తారు. మీ అడ్రసుకే వస్తుంది. ఆ డబ్బు నాకు మాత్రం రీ డైరెక్టు చేయవద్దు. మీరే తీసుకొని తోచిన విధంగా ఖర్చుపెట్టండి. అలా మీకిష్టం లేనిపక్షంలో ఆ ఊళ్ళోని ప్రసూతి ఆసుపత్రికి విరాళంగా యివ్వండి.

సెలవు,

మాధవి"

ఉత్తరమంతా చదివిన రవీంద్ర కలవరంతో ఊగిపోయాడు. మనస్సు పరిపరి విధాల పోయింది. 'మాధవిలో మాలిన్యం లేదేమో!' అనే సందేహం ఒక ప్రక్క, 'ఏ పాపం ఎరుగనిదైతే అలా నోరు మూసుకొని ఊరుకొంటుందా? అన్నతో చెప్పి నానా రభసా చెయ్యకపోయేదా? అయినా నేను చూచిన వాటికంటె ఆధారా లేం కావాలి? ఇంకా అనుమానం దేనికి?' అనే దుగ్ధ మరొక ప్రక్క—ఎటూ నిర్ధారించుకోలేకపోయాడు.

"ఏమిటండీ అది?" ఆప్యాయంగా జుట్టు నిమురుతూ, ఉత్తరం తీసుకోబోయింది చంచల.

రవీంద్ర యివ్వలేదు. ఉత్తరం జేబులో దాస్తూ, "ఏవీ, యిన్నాళ్ళనుంచీ నాకొచ్చిన ఉత్తరాలన్నీ ఏవి?" అని తీక్షణంగా అడిగాడు.

"ఉత్తరాలా? ఏం రాలేదే!"

"బుకాయించక, మీ అమ్మకు తెలుసేమో అడిగి తీసుకురా."

రవీంద్రుడను పూర్తిగా మార్చివేశా ననుకొన్న చంచల ఆ ఆజ్ఞ వింటూనే చలించిపోయింది.

"ఏం ఉత్తరాలు నాయనా! అసలేం రాలేదు! నాకూ నా బిడ్డకూ ఏం తెలియదు. పనిమనిషిగానీ ఏమైనా ఎరుగునేమో!"

చంచల తల్లి ధోరణి చీకాకు కలిగించింది రవీంద్రకు. అయ్యగా రనేపల్లా నాయనలోకి దిగింది. మరో రెండురోజులు

పోయాక 'ఒరేయ్' అంటుందేమో! తన ఆలోచనకు తనే నవ్వుకున్నాడు లోలోపల.

"ఊఁ నాకన్నీ తెలుసుకొని, యింకెప్పుడూ యిలా జరక్కూడదు. నా కొచ్చిన వుత్తరాలూ, నన్ను కలుసుకో వచ్చిన మనుషులూ ఖచ్చితంగా నాకు కనబడాలి." విసురుగా లేచి వెళ్ళిపోయాడు.

"కోపం తెచ్చుకోకండి. ఇంకెప్పుడూ అలా జరగనివ్వనుగా!" లాలించుతూ సమర్థించబోయింది, రవీంద్ర వెనకనే వెళ్ళిన చంచల.

చంచల సాన్నిధ్యంలో ఎప్పటిలా మైమరవలేకపోయాడు రవీంద్ర. "కొంచెం సేపలా వెళ్ళివస్తాను." అంటూ బయటికి వెళ్ళిపోయాడు.

## ౩౦

బీచ్‌లో రవీంద్ర స్నేహితుడు లాయర్ శర్మ కనిపించి పలుకరించాడు. "నువ్వు విన్నావా? పాపం! చక్రవర్తి తోటనంతనూ ఎవరో ధ్వంసం చేశారట! అతడి సితార్ కూడా విరగగొట్టేశారట!" అన్నాడు.

గతుక్కుమన్నాడు రవీంద్ర. తన ఉద్వేగాన్ని అణచుకొని మాట్లాడేలోగా తిరిగి శర్మే అన్నాడు. "ఎవరికో అంత కక్ష మరి! పాపం చక్రవర్తి ఎవరికీ కీడు తలపెట్టడు."

'తనమీద అనుమానం లేదుకదా!' బరువు తీసేసినట్లయింది రవీంద్రకి. ఇక ఏదో ఒకటి తప్పనిసరిగా మాట్లాడవలసి వచ్చింది. "ఏమంటాడు చక్రవర్తి?" అని ప్రశ్నించాడు.

"ఏమీ అనడు. ఎవరిమీదా అనుమానం లేదంటాడు. తనేపని చేసినా అలాగే నాశనమై పోతుందని వేదాంతం మాట్లాడతాడు. పోలీస్ రిపోర్టివ్వమన్నాను. నామాటవినలేదు."

కలవరపడ్డాడు రవీంద్ర. "ఇవ్వలేదూ, రిపోర్టు?"

"లేదు. 'ఆ తోట నా కానందకరమైనట్లే దాని నాశనం మరొకరికి ఆత్మశాంతి కలిగిస్తే అదే పదివేలు' అంటాడు. దేవుడంటావా? మనిషంటావా?"

'ఉత్తముడైన చక్రవర్తి!' మాధవి దృష్టిలో. స్నేహితులకు 'దేవుడులాంటి చక్రవర్తి!' మరి తన కెందుకింత ద్రోహం చేశాడు? అరచేతితో కణతలు రుద్దుకుంటున్న రవీంద్రను కొద్ది ఆశ్చర్యంగా చూచాడు

"అరే! నువ్వూ బాధపడుతున్నావా, ఆతోట కోసం! అవునులే. చక్రవర్తి అంటూండేవాడు—'రవీంద్ర నన్నీ తోట విషయంలో చాల అభినందిస్తూంటా'డని. మాధవిగార్ని కూడ అప్పుడప్పుడు తీసుకు వెళ్తుంటావట! అదీగాక మీరంతా బంధువులుకూడా కదూ?"

"నీ కెలా తెలుసు?" నీరసంగా ప్రశ్నించాడు.

"ఒకనాడు నీ మోటార్ సైకిల్ మీద వచ్చాడింటికి. కారు నీ కిచ్చానని చెప్పాడు. మాధవిగారు తనకు చెల్లెలి వరసని ఏమేమో చెప్పాడు. అంతగా గుర్తులేదు."

రవీంద్ర మాట్లాడలేదు. 'ఆ రోజు సాయంకాలం మాధవి వద్దంటున్నా బలవంతంగా చక్రవర్తి తోటలోకి తీసుకు వెళ్ళాడు. తాము వెళ్ళేసరికి చక్రవర్తి పాడుతున్నాడు. పాటకు మైమరచిన మాధవి చక్రవర్తిని తెగ పొగిడింది. తానూ శ్లాఘించాడు. చక్రవర్తి అభ్యర్థించగా మాధవికూడా పాడింది. అప్పుడు చక్రవర్తి – దుర్మార్గుడు – మైమరచినట్లు మాధవి పాటకు వెనకాలే సితార్ వాయించాడు. ఆనాడే తాను గ్రహించినా, మళ్ళీ ఏదో భావోద్వేగ మనుకొని సరి పెట్టుకున్నాడు. కాని తప్పంతా తనదే. వాళ్ళ సిద్ధర్షి దగ్గరకు తెచ్చినవాడు తనే. మరో రోజు థియేటర్‌లో, పడబోతున్న మాధవిని బలంగా పట్టుకొని ఆపాడు. భర్త — తనకే లేని జాగ్రత్త వాడి కెందుకు ? వాడి కళ్ళెప్పుడూ మాధవి మీదే ఉండేవి!'

"ఏమిటలా ఉన్నావు. రవీంద్రా!" శర్మ మాటలతో రవీంద్ర భావస్రవంతికి ఆటంక మేర్పడింది.

"ఁ ఆ.! ఏమీ లేదు."

"నాకు తెలుసు. ఆ తోట గురించే, చక్రవర్తి కూడా ఏమిటో పరాకుగా వుంటున్నాడు. అతడిలో యిదివరకటి ఛలాకీతనం లేదు. అయినా ఆ పాపాత్ము డెవడో తగిన శిక్ష ననుభవించకపోడులే. మనం ఎంత చదువుకొన్నా కొన్ని కొన్ని నమ్మాలి. పూసే కాసే చెట్లను నరికితేనే పాపమంటారు. ఇక కలకలలాడే అంత తోటని నాశనంచేసిన వాడేం బాగుపడ తాడులే."

రవీంద్రకు కంపరం పుట్టింది. ఆ శాపనార్థాలు వినలేక గబగబలేచి, "వెళ్తానోయ్" అంటూ యింటి ముఖం పట్టాడు.

"అన్నట్టు చక్రవర్తిని పరామర్శించావా?" వెనుకనుంచి శర్మ ప్రశ్న బాణంలా వచ్చి గుచ్చుకొంది. వినపడనట్టు సాగి పోయాడు రవీంద్ర. ఏ మనశ్శాంతికోసం బయల్దేరాడో అది అందకుండా దూరంగానే ఉండిపోయింది.

*

రవీంద్ర షికారునుంచి ఇల్లు చేరేసరికి, హాలు ప్రక్క గదిలో చంచల ఎవరితోనో మాట్లాడుతూంది. మెట్లెక్క బోయిన రవీంద్ర పురుషకంఠం విని అటు ప్రక్కకు దారితీస్తూండ గానే గడపదాటి వస్తూన్న ఒక యువకుడు ఎదురుపడ్డాడు. తెల్లని పంచె, లాల్చీ, మెడలో సన్నని గొలుసుతో అందం గానే ఉన్న ఆ యువకుడు రవీంద్ర వైపు ఒక్కసారి చూచి వడి వడిగా వెళ్ళిపోయాడు. ఆ వెనుకనే వస్తూన్న చంచల రవీంద్రను చూడగానే కొంచెం కంగారు పడింది. లేని నవ్వు తెచ్చుకుంటూ, "వచ్చారా? కాఫీ యిమ్మంటారా?" అంటూ దగ్గరగా వచ్చింది.

"ఎవడు వాడు?" తీక్ష్ణంగా అడిగాడు రవీంద్ర.

జడ ముందుకువేసి మెలికలు త్రిప్పుకుంటూ వయ్యా రంగా సోఫాలో వాలింది చంచల. "మీారు వచ్చినట్లు తెలిస్తే పరిచయం చేద్దునే! తీరా వెళ్ళిపోయాడు. పోనీ లెండి. ఇక రోజూ వస్తూంటాడుగా!"

"రోజూనా?"

"సంగీతం మాష్టరండీ. ప్రక్కింటా రమ్మాయికి చెబుతున్నాడు నేనూ కుదుర్చుకున్నాను. నెలకు పాతిక" అంది ఓరగా చూస్తూ.

రవీంద్ర మాట్లాడలేదు. అలాగే తీక్ష్ణంగా చూస్తూ నిల్చున్నాడు.

"మీాకు సంగీతం యిష్టం కదూ! నేను కూడా నేర్చుకొందామని. ఇంట్లో వీణ వుండనే ఉన్నది కదా!"

"అయితే నా జేబులో ఉత్తరం చదివావా?" మాటల్లో కాఠిన్యం స్పష్టంగా ధ్వనిస్తూంది.

వయ్యారంగా ఒళ్ళు విరుచుకుంటూ లేచింది చంచల.

"ఏం, చదవకూడదా? అవున్లెండి. ఆ ఉత్తరం చదవటానికి నేనెవర్ని? ఆ వీణ ముట్టుకునేందుకు నేనెర్ని?" కరిగిపోయాడు రవీంద్ర. "ఊరకనే అన్నాను. నేర్చుకో, దానికేం? అలాగే నేర్చుకో" అని వెళ్ళి ప్రక్కల కూర్చున్నాడు.

## ౩౧

వసంతం గడిచి గ్రీష్మం ప్రవేశించింది. కలకల్లాడే ప్రకృతి ఎండలో మాడి బొగులు బొగులు మంటున్నది. రాత్రింబవళ్ళు భూదేవి వరుణ దేవునికై పరితపిస్తూంది, బీటలు వారిన హృదయంతో. పాలవంటి పండు వెన్నెలలో ప్రపంచ నౌక తేలిపోతూంది. అప్పుడప్పుడు చల్లని మలయమారుతం ఉక్కను పారద్రోలుతూంది. వెన్నెలలో మాలతీ గుత్తులు ముత్యాలు

జాలువారినట్లు ఉన్నాయి. అయినా ఆ అనిర్వచనీయ సౌందర్యాన్ని ఆనందహృదయాలే గ్రోలగలవు.

నిండు జాబిల్లిని చూస్తూ నిశ్శబ్దంగా తనలో తాను కుమిలి కుమిలి ఏడుస్తూన్న మాధవి, శ్రీధర్ తనను ఎప్పటి నుంచి గమనిస్తున్నాడో చూడనేలేదు. చల్లని చెయ్యి కంటి ధారలను తుడవటానికి ముందుకు రావడంతో ఉలిక్కిపడి జాగ్రదవస్థలోకి వచ్చింది.

"మధూ, ఏమిటిది? నువ్వెంత దాచ ప్రయత్నించినా దాగదు. ఏదో జరిగింది; అంతవరకూ నేను గ్రహించాను. అదేమిటో విడమరచి చెబితే మంచిది. చెప్పవా?" అన్నాడు శ్రీధర్.

"అన్నయ్యా!" రెండు నెలలుగా ప్రయత్న పూర్వకంగా అణిచి వుంచిన గంభీరత తోణికి పోయింది. ఒక్కసారిగా నిండు ప్రవాహానికి గండిపడినట్లు మాధవి రెండు నేత్రాలూ జలపాతాలయ్యాయి. శ్రీధర్ ఒడిలో వాలి వెక్కి వెక్కి ఏడ్చింది.

మెల్లగా చెల్లెలి వీపు నిమిరాడు శ్రీధర్. "చూడు, మధూ. ఎంత దాపరికానికైనా ఒక హద్దూపద్దూ ఉంది. మీ వదినావాళ్ళూ వినకూడదనుకొంటే అర్థముంది. కాని నేనెవర్ని చెప్పు? ఒకే రక్తమాంసాలను పంచుకొని పుట్టిన అన్నా చెల్లెళ్ళం. రక్తంలో రక్తం, కండలో కండ అయిన అన్నదమ్ముల దగ్గర చెల్లెలికి అభిమానం, దాపరికం ఏమిటి? దాపరికాలుండడం ఎంత హాస్యాస్పదం? అంతేకాదు అన్నగా చనువేకాకుండా తండ్రి తరువాత తండ్రి అంతటి బాధ్యతగలవాడను కూడ. నీ యోగక్షేమాలను చూడవలసినవాడిని నేనని గుర్తించ గలిగితే

దాచకుండా నాకన్నీ చెప్పు, నీ సుఖ సంతోషాలకోసం నేనేమైనా చేస్తాను."

మెల్లగా లేచి కళ్ళు తుడుచుకొంది మాధవి. 'అవునన్నయ్యా, తెలుసు. చెప్పి నిన్ను బాధపెట్టడం ఇష్టంలేకా, సంసారాల్లో కలతలు వచ్చినట్లుగానే, వాటంతటవే సర్దుకుపోతాయనే ఆశాభావంతోనూ నీతో చెప్పలేకపోయాను" వెక్కిళ్ళు మాటలకు అడ్డువస్తున్నాయి.

కొంచెంసేపాగి చుట్టూ చూచి, ఎవరూ లేరనే నిర్ధారణకు వచ్చి మళ్ళీ మొదలెట్టింది మాధవి. చక్రవర్తితో పరిచయం, అర్థంకాని అతడి తీరుతెన్నులు, అసంతృప్తి నిండుకొన్న అతడి సంసార పరిస్థితి, నిర్మల నిర్లక్ష్యం, కడకు చక్రవర్తి గదిలోని చిత్రపటం విషయం, రవీంద్ర బెంగుళూరు వెళ్ళుతూ చక్రవర్తికి ఒప్పజెప్పి వెళ్ళడము కూడా తు. చ. తప్పకుండా చెప్పేసింది.

అంతా విన్న శ్రీధర్, "ఎంత నాగరకుల మనుకున్నా, ఎంత విద్యాధికులమైనా అంతస్సంస్కారం అనాదినుండీ అలాగే ఉంది. భారతదేశంలో పురుషుడికి అహంభావం, అన్యాయ జన్మతఃవచ్చినవి. తానెంత భోగలాలసుడైనా, స్త్రీని నైతికంగా, ఉన్నతంగా ఉంచాలన్నదే అతడి తాపత్రయం. నీ అంతఃకరణశుద్ధి, పవిత్రత, ఆశయాలు నాకు తెలుసు. నేను నీకు కళంకం ఆపాదించలేను కనీసం ఊహించనైనా ఊహించలేను. కాని భర్తృత్వ అధికార తెరలోనుండి చూచేవాడికి ఆ విచక్షణా జ్ఞానం ఉండదు. నువ్వు చక్రవర్తికి అంత చనువు ఇవ్వకపోవలసింది, మధూ" అన్నాడు.

దీర్ఘంగా నిట్టూర్చింది మాధవి. "నేను చనువివ్వడమేమి టన్నయ్యా' అతనిని నాకు పరిచయం చేసింది మీా బావగారు. ఆతడు విదేశాలకు పోయివచ్చినవాడు అనీ, 'ఫార్వర్డ్' గా ఉండకపోతే హేళన చేస్తాడనీ అంటూ ఆతడి తోటకు తీసుకు వెళ్ళి, నే వ్రాసిన కథ లతనికిచ్చి, పాటలు పాడించీ—రకరకా లుగా చనువు కల్పించిందాయన. నాకు తెలియకుండానే నా యోగ క్షేమాలు కనుక్కొనే బాధ్యత అతనికి అప్పజెప్పి కాంప్‌కు వెళ్ళిన దాయన. సరే, నీ రాకతో బంధుత్వముకూడ బయటపడింది. ఇన్నింటిలో నా స్వయం కృతాపరాధ మేమైనా ఉందా, అన్నయ్యా?"

నీరసంగా జాలిగా నవ్వాడు శ్రీధర్. "అదేనమ్మా వచ్చిన చిక్కు. ఇటు మన సంప్రదాయాన్నీ వదలలేక, అటు విదేశీ సంస్కృతినీ అర్థం చేసుకోలేక, నాగరక బురఖాలలో నలిగిపోతున్న మూర్ఖులమ్మా మేము. ఆధునిక సంస్కారపు ప్రథమ సోపానాన్ని మాత్రమే ఎక్కగలరు. కాని ఆపై వాటిని ఎక్కలేరు సరికదా, కనీసం కన్నెత్తి కూడా చూడలేరు నేటి యువకులు. చూచినవాడు కళ్ళు తిరిగి క్రిందపడి మరొకర్ని కూడా పడేస్తాడు. ఈ స్థితిలోవున్న ఈకాలపు యువకుల్ని చూచి జాలిపడాలి కాని ఆగ్రహించకూడదు, చెల్లాయ్."

విస్తుపోతూ చూచింది మాధవి. 'అయితే తినికూర్చో లేక సరదాగా గొయ్యితీసిన వాడిని క్షమిస్తూ, గోతిలోపడి పోయినది బాధ పడాలన్న మాట? ఇందుకు పరిష్కారమే లేదా?'

"ఎందుకు లేదూ? గొయ్యి తీసినవాడు పైనుండి కూడా పరిసరాలు చూడలేక ఆ గోతిలోకే చూస్తూ కూర్చుంటాడు. అంతేకాని వాడికి పరిష్కార మార్గం తెలియదు. గోతిలో పడి పోయిన వాళ్ళకు తెలిసినా బయటకు వచ్చేదారిలేదు. వాళ్ళకు పైకి రావటానికి మరో ఆసరా ఉండాలి. ఈ ఇద్దర్నీ దూరంగా ఉండి చూచే మరో వివేకవంతుడికి ఆ పరిష్కార మార్గం తెలియగల అవకాశం ఉంది. కాని అది ప్రయత్నం మాత్రమే. ఫలితం దైవాధీనం. ఇక నువ్వు నిశ్చింతగా ఉండు. తాత్కాలికంగా ఆవేశపడ్డా, బావ మంచివాడు. నాకు ధైర్యముంది" అంటూ లేచాడు శ్రీధర్.

ఉన్నట్టుండి చల్లనిగాలి వీచి సన్నని తుంపర ఒక్క జల్లుపడి ఆగిపోయింది. వసుధ ఉపశమించలేదు. మేఘుడు వెనుదిరిగి చూడలేదు. వాయుదేవుడు రాయబారానికి బయలు దేరాడు.

## ౩౨

"అబ్బబ్బా! చంచలా" ఉదయం భోజనానంతరం నిద్ర పోవటానికి ప్రయత్నిస్తూన్న రవీంద్ర విసుగ్గా ఒక కేక పెట్టాడు.

"ఓ! మీరు లేచారా? చూడనేలేదు" అంటూ మ్రోగించుతూన్న వీణను ప్రక్కగా పెట్టి వయ్యారంగా లేచి వచ్చింది చంచల.

"సంగీత మనేది ఒక్క గొప్పవరం. బజారులో దొరికే వస్తువులా పదిరూపాయలు పారేసి సంపాదించలేము. నీకు ఆ విద్య పట్టుబడకపోగా ఎదురు నన్ను బాధిస్తున్నావు ఆ వీణతో.

దయవుంచి మానేయ్. లేకపోతే నేను లేనప్పుడు వాయించుకో."
చరచరా మేడమీదకు వెళ్ళిపోయాడు. అన్నాడే కాని అతడి మనసు మనస్సులో లేదు. ప్రతిచిన్న సంఘటనా అతడి మనస్సును కలచి వేస్తూంది. ఆ వీణను విరిచి పొయ్యిలో పెట్టాలన్నంత కోపంగా ఉంది. మధురమైన అనేక గత స్మృతులను అది కెలికి విషాదం నింపుతూంది. మాధవీ స్పర్శమాత్రంగానే మధురగానాన్ని ఒలికించి మత్తెక్కించి హాయిగా, తీయగా నిదురింపజేసే ఆ వాయిద్యం, సంగీత జ్ఞానంలేని చంచల చేతిలో భయంకర నాదాలు ఉద్భవింపజేసి మనస్సులో తీరని బాధను ఆగని మంటను ప్రజ్వలింపజేస్తూంది. ఏ వ్యక్తినైనా ఆదినుంచీ అసహ్యించుకొన్నా ఏ కారణం వల్లనైనా గౌరవింపవలసివస్తే అందులో కష్టమేమీలేదు. కాని ప్రాణసమంగా ప్రాణాధికంగా ప్రేమించిన వ్యక్తినే అధికంగా అసహ్యించుకొనడంలో గల నరకబాధ వర్ణనాతీతం, శరీరంలోని ప్రత్యణువునూ కుమిల్చివేసే ఆ బాధ చిత్రవధకన్నా అధికమైనది. 'తనను తప్ప పరాయి స్త్రీ నెరుగని నాకు, తనను ప్రాణాధికంగా ప్రేమించి, గౌరవించిన నాకు ఇంత అన్యాయం ఎలా చేయగలిగింది?' మాధవి? తనకేం లోపంజరిగిందని ఇంతటి ద్రోహం చేసింది? వివాహానికి పూర్వం 'చదువుకున్న పిల్ల సంసారంలో ఇమడలే'దని తలిదండ్రులే కాక బంధుమిత్రు లనేకులు హితబోధ చేశారు. అనేక దృష్టాంతరాలు చూపారు. ఆనాడు నమ్మకపోయినా ఇపుడు నమ్మవలసి వస్తూంది. చదువు కోవడం వల్లనే సీతికి దూరమైందా? అయితే చదుకోని వాళ్ళంతా పతివ్రతలేనా? ఛస్. ఎందుకు నాకింత ఆలోచన? అందుకే ఇంత స్వేచ్ఛగా

ఉన్నాను! మంచేమిటి ? చెడేమిటి ? సుఖపడడంచేత కాని వాళ్ళకే అసలు నీతులన్నీని. ఎవళ్ళనీ లెక్క-జేయకుండా సుఖంగా బ్రతకడంలో గల ఆనందాన్ని మించినది లేదు ”

సాధారణంగా మంచి ముందుకు రాబోయినా చెడుగు వెనుకకు నెట్టేస్తుంది. చెడుగు అంగబలం, శారీరకబలం ఎక్కువ ఈ ప్రపంచంలో. మానసికాందోళనను వెనుకకునెట్టి ఉత్సాహంగా ఈలవేస్తూ లేచి కూర్చున్నాడు రవీంద్ర. “చంచల్, కాఫీ” అని కేక పెట్టాడు.

కాఫీ ఇస్తూన్న చంచలను ఓరగా చూస్తూ. “ఏం ఇంత ఆలస్యం ! మరిచి పోయావా?” అని అడిగాడు.

చంచల మాట్లాడలేదు.

“కోపమా?” అన్నాడు చిరునవ్వుతో.

“కోపాలూ, తాపాలూ చూపెట్టటానికి నేనేం కట్టుకొన్న భార్యనా? పది రూపాయలకు దొరికే బజారు వస్తువు నేగా! మీరు చెప్పినట్లు నిల్చోవాలి” అంది వచ్చీరాని కన్నీళ్ళను తుడుచుకొంటూ.

ఆ సమాధానం వినగానే తెల్లబోయాడు రవీంద్ర. ఇలాంటి దెప్పుళ్ళూ, సరసాలూ మాధవి సాహచర్యంలో అతడెప్పుడూ అనుభవించలేదు. కొంత సర్దుకున్నాక, ‘నే నామాట నిన్నుద్దేశించి అనలేదు చంచలా. సంగీతం గురించే అన్నాను.” అన్నాడు.

“ఎందుకు లెండి. మాట మారుస్తారు? నే నలాంటిదాన్నేగా మరి?” వెక్కి వెక్కి ఏడ్చింది.

లాలనగా దగ్గరగా తీసుకున్నాడు రవీంద్ర.

"సరే పోనీ. నీకు బాధ కలిగించినందుకు తగిన జుల్మానా వెయ్యి. ఏం కావాలో చెప్పు?"

ఆశగా కళ్ళెత్తిచూసింది చంచల. "నిజంగానా?"

"ఊఁ!"

"అయితే నాకు మంచి నెక్లెస్ కావాలి."

"ఉన్నాయిగా? ఈ నగలన్నీ నీవి కావూ?"

"ప్చ్, పాత ఫాషన్‌వి. మంచి ముత్యాల నెక్లెసు కొను కొంటాను."

"సరే కొనుక్కో. ఎంత కావాలి."

"పదిహేనువందలు," బెదురుతూ చెప్పింది.

"ఓస్ అంతేకదా! ఇప్పుడే వెళ్ళికొని తెచ్చుకో" అంటూ డబ్బు యివ్వడానికి లేచాడు రవీంద్ర.

"ఉండండి యిప్పుడే వస్తాను" అంటూ క్రిందికి వెళ్ళింది చంచల. ఒక పావుగంటలో తిరిగి పైకివచ్చింది. ఆమెకోసం ఎదురుచూస్తూ ఇనప్పెట్టె తెరుచుకుర్చున్నాడు రవీంద్ర.

"మీరెంత మంచివారు! అడగ్గానే యింత డబ్బిచ్చేస్తున్నారు!" రెండు చేతులూ రవీంద్ర మెడకు పెనవేసి ప్రేమ కురిపించింది చంచల.

"ఇంతా, ఇంతకు నాలుగు రెట్లా?" నవ్వుతూ పదిహేను వందలు తీసి ఇచ్చాడు రవీంద్ర.

ఇనప్పెట్టెనిండా ఉన్న పాతవీ, క్రొత్తవీ అనేకమైన నగలు, నోట్లకట్టలు చూసి చంచల కన్ను చెదిరిపోయింది. 'ఇన్ని నగలు వదిలేసి వెళ్ళిన ఆడది—మాధవి ఎంత తెలివి

తక్కువదీ!' అనుకొంటూ ఉండగా క్రిందినుంచి పెద్దగగ్గోలుగా కేకలు విన్పించాయి.

"బాబోయ్, నాయనోయ్! త్వరగా రండర్రోయ్ పెద్ద త్రాచుపాము, బాబోయ్!" చంచల తల్లి పెద్దగా కేకలు పెడుతూంది. భయంతో బిగుసుకుపోయింది చంచల, రవీంద్ర కంగారుగా క్రిందికి పరుగెత్తాడు.

"ఏదీ. ఎక్కడ!" ఆత్రంగా అడిగాడు.

"పాము, నాయనా, పాము!" గజగజ వణికిపోవడమే కాని, ఆవిడ నోటినుంచి మాటరావడంలేదు. గబగబ మంచి నీళ్ళు తెచ్చి ఆవిడకు పట్టి, కూర్చోబెట్టి "ఇప్పుడు చెప్పండి భయంలేదు" అన్నాడు రవీంద్ర.

"అదిగో బాబూ! అదిగో. ఆ అటకెక్కిందీ. ప్రక్క నుంచే జరజరా పాకేసింది. కొద్దిపాటిలో గండం తప్పింది. కరిచిందంటే ఇంకేముంది నాయనోయ్. నాగతి!" భయంగా రవీంద్రను వాటేసేసుకొంది.

బలవంతంగా ఆమెను వదిలించుకున్నాడు రవీంద్ర.

"భయంలేదు. ఇక్కడే వుండి అది ఎటూ పోకుండా చూడండి. ఎవరైనా పాములవాళ్ళు దొరుకుతారేమో చూస్తాను" అంటూ బయటికి వెళ్ళాడు.

## 33

రవీంద్ర ఇద్దరు మనుషులతో తిరిగివచ్చి వంటగదీ, అటకా, దొడ్డి అన్నీ వెతికించినా ఎక్కడా పాముజాడే లేదు.

"చంచలా, మీ అమ్మ ఎక్కడా? పాము లేంది?" అంటూ కేక పెట్టాడు రవీంద్ర. తిరుగు సమాధానం రాలేదు. ఏదో అనుమానం రాగా మేడమీదకు పరుగెత్తాడు రవీంద్ర.

ఇనప్పెట్టె ఉన్న గదిలో అడుగు పెడుతూనే కొయ్యబారి పోయాడు. నిండా ధనలక్ష్మితో కళకళలాడే ఇనుపపెట్టె ఖాళీగా వెలవెలపోతూంది. ఒక్క నగ లేదు. ఒక్క నోట్లకట్ట లేదు. ప్రక్క అరలో పదివేల చెక్కు—ఆ ముందురోజే బొంబాయి లోని ఒక ఫ్యాక్టరీలో తనకు గల వాటాకు ఆ సంవత్సరంలో వచ్చిన లాభంగా పంపారు. నెమ్మదిగా మార్చి, బాంక్‌లోనే డిపాజిట్ చేద్దామనుకొంటూ తొలిరోజే అందులో పెట్టడం చంచల చూచింది. అదీ మాయమైంది. ఏది దారి? పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు. గదిలో అటూ యిటూ గంతులేశాడు. క్రిందికి పరుగెత్తాడు. బీర్వాలన్నీ తలుపులు తీసేసి ఉన్నాయి. మాధవివీ, తనవీ అనేక రకాల బట్టలు, వెండిసామాను ఒక్కటీ లేదు. అన్నీ ఖాళీ!

గుండెలు దడదడా కొట్టుకుంటుండగా వీధి చివరి వరకూ పరుగెత్తాడు. ఎక్కడా చంచల జాడలేదు. తెలిసిన ఇరుగూ, పొరుగూ ఏమిటేమిటని అడిగి చాటుగా నవ్వు కున్నారు; ఎవరికి తెలియని భాగోతం గనుక! ఎవరో సలహా యిచ్చారు—"బహుశః ఆ చెక్కు మార్చడానికి బాంక్‌కు వెళ్తారు. అక్కడ దొరకవచ్చు!"—అని. ఆలోచనకు దూర మైన రవీంద్ర ఎవరేం చెప్తే అది చేసేస్తున్నాడు. వెంటనే బ్యాంక్‌కు పరుగెట్టాడు.

మానేజర్ తెల్లబోయాడు 'పావుగంట క్రితమే వెళ్ళిపోయారు. ఒక అమ్మాయి, పొడుగ్గా ఎర్రగా ఉన్న ఒక యువకుడు టాక్సీలో వచ్చి క్యాష్ చేసుకుపోయారండి. పెద్ద మొత్తంగనుక జ్ఞాపకం ఉంది. అయితే మీరు పంపించలేదా? ఫోర్జరీ అన్నమాట!"

'పొడుగ్గా ఎర్రగా వున్న యువకుడు!' వింటూనే ఆ సంగీతం మాస్టరని పసిగట్టేశాడు రవీంద్ర. నీరసంగా కుర్చీలో కూలబడి, తన యింట్లో వంటమనిషనీ ఇనప్పెట్టె తీసి ఏదో పనిమీద ప్రక్కగదిలోనికి వెళ్ళగా దొంగిలించిందనీ చెప్పాడు.

"సరే. పోలీసు రిపోర్టు యివ్వండి. గుర్తులూ అవీ చెప్తే బహుశః రైల్వే స్టేషన్ లోనూ, ఏరోడ్రోమ్సులోనూ కాపలా ఉంచుతారేమో!"

వివరాలన్నీ వ్రాసుకుంటూ "నగలెన్నో, ఏమిటో వివరంగా చెప్పండి" అన్నాడు సబ్ ఇన్స్పెక్టర్.

ఎన్నని చెప్పగలడు? మాధవికి పుట్టింటివారిచ్చినవీ, అత్తవారు పెట్టినవీ, తాను ముచ్చటపడి కొన్నవీ అనేకమైన నగలు ఉన్నాయి. పాతరకాలు, క్రొత్త ఫ్యాషన్లవీ, రాళ్ళనగలు ముత్యాలనగలు రెండు మూడు సెట్లు ఉన్నాయి. ఒక్కసారిగా చెప్పాలంటే వాటితో అంత సన్నిహిత సంబంధమున్న మాధవికే అసాధ్యమేమో! గుర్తున్నంతవరకు చెప్పి బయటపడ్డాడు.

## ౩౪

జీవితం చిత్రాతి చిత్రమైనది. అడుగడుగునా సంఘటనలు చిత్రంగా జరుగుతాయి. ఏ సినిమాలోనో చూస్తే 'కాల్పనికం

లెక్కని సరిపెట్టుకుంటారు. నిజజీవితంలో సంఘటనలు మరీ అద్భుతంగా జరుగుతాయి.

ఎవరో శవాన్ని మోసుకు పోతున్నారు. ఆప్తులు కాబోలు ఏడుస్తున్నారు. మరికొందరు భజనలు చేస్తూ సినిమా ట్యూన్స్‌లో విచారమైన పాటలు పాడుతున్నారు. అప్రయత్నంగా రవీంద్రకు నవ్వు వచ్చింది! 'రాగద్వేషాలకు అతీతమైన శవాన్ని మోస్తూ వాళ్ళ కా పాట లెందుకో? ఎలా వస్తాయో అవును, మాధవి తృణప్రాయంగా వదిలేసిన ధన కనకాలను తాను చూస్తూ చూస్తూ వదలలేక రచ్చ చేసుకోవడం లేదూ?' మళ్ళీ నవ్వుకున్నాడు, ఏడవలేక.

అలా విభిన్నాభిప్రాయాలతో, బేలముఖంతో పోలీసు స్టేషన్‌నుంచి ఇల్లు జేరుకొన్న రవీంద్ర మరింత విస్తుపోవలసి వచ్చింది. హాల్లో శ్రీధర్, రవీంద్ర తండ్రి కూర్చుని అతడికోసమే ఎదురు చూస్తూన్నట్లు కన్పించారు. గతుక్కుమన్నాడు రవీంద్ర. సాధ్యమైనంతవరకు ముఖంలో రంగులు మార్చుకొంటూ, "ఇద్దరూ కలిసొచ్చారేమిటి? అంతా బాగున్నారా?" అని కుశల ప్రశ్న వేశాడు.

"ఆ కోడలు పురుటికొచ్చిందంటే చూడ్డానికి వెళ్ళాను, ఇతడేదో పనుందని ఈ ఊరు వస్తుంటే, సరే తోడూ ఉన్నాడు, నిన్ను చూచినట్లూ ఉంటుందని వచ్చాను. ఆఫీసునుంచా రావడం?"

'ఆపద్బాంధవుడు! ప్రశ్నలోనే సమాధానం!' అనుకొని గుండెలు సవరించుకొని, "అవును, నాన్నా" అంటూ

శ్రీధర్‌ను చూడలేక చూడలేక చూచాడు. అతడి ముఖం కూడా ఎప్పటిలాగే ప్రశాంతంగా ఉంది.

"ఇక్కడ మా డిపార్టుమెంటుకు సంబంధించిన కేసొకటి ఇన్‌వెస్టిగేట్ చెయ్యటానికొచ్చాను" అన్నాడు శ్రీధర్.

రవీంద్ర మనస్సు తేలికపడింది. తాననుకొన్న దేమీ లేదని సంతోషించాడు.

"మాధవి ఆరోగ్యం ఎలా ఉంది?" ఇష్టం లేకపోయినా మర్యాదకోసం అడిగాడు.

"ప్చ్" నిట్టూర్చాడు శ్రీధర్. "ఏమంత బాగుండలేదు. డాక్టర్ 'సీరియస్ కేస్' అంటూంది. దైవసంకల్పమెలాఉందో!" గొంతు జీరవోయింది.

రవీంద్ర తలవంచుకూర్చున్నాడు. గుండెలు బరువెక్కాయి.

'ప్రపంచంలోనే తెగతెంపులుచేసుకొనేదాన్నిపైకోపమెందుకు?' మాధవిమాటలు హఠాత్తుగా చెవుల్లో రింగుమన్నాయి.

అతడూ బాధపడుతున్నాడని గ్రహించాడు శ్రీధర్. "ఒకసారి రాకూడదూ?" అన్నాడు మెల్లగా.

"ఊ!" అన్నాడు రవీంద్ర మెల్లగా. అంటూనే లేచి లోపలికి వెళ్ళాడు. దొడ్లో చెట్టుక్రింద పులిజూద మాడుతున్న నౌకర్ల నిద్దరినీ పిలిచి, వాళ్ళదగ్గరేమైనా మాటలు జారారా, మీరు?" అనడిగాడు నిప్పులు కురిపిస్తూ.

వాళ్ళు మొదట విస్తుపోయారు. తర్వాత గడగడ వడకుతూ, "ఎవరండీ? ఇరుగూ, పొరుగూనా? లేదు. ఆరు వచ్చి

అడగలేదు! మేము సెప్పలేదు. మీారు ఎల్లిన దగ్గర్నుంచీ ఇక్కడే ఉన్నాం. పాములోళ్ళకి పావలా డబ్బులిచ్చి పంపేసి నాం" అన్నారు.

"ఇరుగు పొరుగులు కాదు. ఆ హాల్లో ఉన్న ఇద్దరికినీ. చెప్పేశారుకదూ?" అదే కఠిన స్వరంతో అడిగాడు.

అడుగుతూండగానే ఒకడు హాల్లోకి పరుగెత్తి చూచి వచ్చాడు.

"పెద్దయ్యగారూ, శ్రీధరంబాబుగారూనాండి? ఆ రొచ్చి నట్టు మేం చూడనేలేదు. మీారే యారినో ఎంటబెట్టుకొచ్చి మాట్లాడుతున్నా రేమో, మేం ఇంటే కోపం వస్తదని ఇక్కడ కూకున్నాం. అయితే కాఫీ పెట్టిమ్మంటారా బాబూ ఆరికి?"

ఆ నౌకర్లిద్దరికి ఏం తెలియదని నిర్ధారించుకొన్నాడు. నిజానికి వాళ్ళెప్పుడూ అమాయకులే. "సరే, తర్వాత కూడా ఏమీా అయినదీ కానిదీ వాగకండి, తెలిసిందా ? కాఫీ ఇచ్చాక వంటకూడా చెయ్యాలి" అంటూ వెళ్ళిపోయాడు రవీంద్ర.

రాత్రి భోజనానంతరం ముసలాయన తిరుగు ప్రయాణం కట్టాడు. "నాకు పొలం పనులున్నాయి. బాబూ, నేను లేందే ఒక్క పాలేరు పనిచెయ్యడు. వీలు చూచుకొని ఒకసారి రా. ఇంటికివచ్చి చాలా రోజులైంది" అంటూ వెళ్ళిపోయాడు.

రాత్రి బావమరదు లిద్దరూ వరండాలో మంచాలమీాద కూర్చున్నారు. వారిద్దరిమధ్యా ఎప్పుడూ హాస్యంగా, సరసంగా ఉండేవాతావరణం నేడు మూగపోయింది. అనేక రకాల బాధ లతో రవీంద్ర కుమిలిపోతున్నాడు. సంభావణ ఎలాప్రారంభించి

బావగారి కోపం పోగొట్టాలో ఆలోచిస్తున్నాడు శ్రీధర్. మెల్లగా శ్రీధర్ మొదలుపెట్టాడు: "చూడండి బావగారూ, మనం, బావమరదులం. సన్నిహితులం, సమ వయస్కులం. సమాన హోదాలో ఉన్నాం. మనస్సు విప్పి మాట్లాడడాని కభ్యంతరం లేదనుకుంటాను."

రవీంద్ర ముఖం చిట్లించి మరోదిక్కు-కుచూస్తూ కూర్చు న్నాడు.

తిరిగి శ్రీధర్ మొదలెట్టాడు. "మధు నాకంతా చెప్పింది. మానవులు తప్పులు చేయకపోయినా కొన్ని కొన్ని పరిస్థితులలో చూపరులకు అటువంటి భ్రమ కలగడంసహజం. విద్యావంతులు వివేకంతో ఆలోచించాలి, మాధవి తానే తప్పూ ఎరగనంటూ బెంగతో క్రుళ్ళిపోతోంది."

"చెల్లెలు బెంగ పెట్టుకొందని బాధపడుతున్నావా? ఇక్కడ నీ చెల్లెలు నాకు చేసిన ద్రోహానికీ, తెచ్చిన తలవంపు లకూ నే నెంత కుమిలిపోతున్నానో ఆలోచించావా?"

"అలా ఆవేశపడకండి, బావగారూ. మీ రేదో భ్రమ పడ్డారని నా భావం."

"భ్రమ!" పళ్ళు పటపట కొరికాడు రవీంద్ర. "నువ్వు ఇంట లేవని తెలిసీ ఒంటరిగా వున్న నీభార్యను చూడ్డానికి అర్ధ రాత్రి వేళ ఎవడో వస్తే నువ్వేమనుకొంటావ్? నీ కళ్లూ, మనసూ భ్రమిస్తున్నాయనే అనుకొంటావా?"

రవీంద్ర ఎంత రోషావేశంతో అడిగాడో శ్రీధర్ అంత శాంతంగానూ జవాబిచ్చాడు, "అవును బావగారూ, ఒక్కో

క్కప్పుడు మన చెవులూ, కళ్ళూ మనల్ని మోసం చేయవచ్చు, లేదా హృదయం అధీనం తప్పవచ్చు. కాని నే నంతదూరం పోనే పోను, ఆ వ్యక్తి ఆమెకు భ్రాతృ సమానుడై ఉండవచ్చునని నిస్సంకోచంగా భావిస్తాను. ఊహలతో బాధపడకుండా స్పష్టంగా అడిగి తెలుసుకుంటాను."

"చాల్లే శ్రీధర్." అది మాట అనడంకంటె ఉరమంటేనే సరిపోతుంది. ఎంతసంగీతానికైనా ఓ హద్దూ పద్దూ వుంది. చెల్లెల్ని సమర్థించటంలో యుక్తా యుక్తాలు కూడా మరచి పోతున్నావా? నీ చెల్లెల్ని అర్ధరాత్రి చూడటానికి వచ్చినవాడు సోదరతుల్యుడు; నీ చెల్లెలి వస్తువులేమైనా వాడిదగ్గర కన్పిస్తే అది పతివ్రతా లక్షణమూనా?"

"అవేమిటి?" విస్తుపోతూ అడిగాడు శ్రీధర్.

"అవేమిటో చెల్లెలు చెప్పలేదా మరి? ఆవిడ కథలు, పాటలు, హాండ్ బ్యాగ్స్ వాడిదగ్గర కెందుకు వెళ్ళాయి? మాటలు చెప్పి నమ్మించ తగినంత మూర్ఖుణ్ణా నేను? ప్రాణం కంటే ఎక్కువగా ప్రేమించిన నాకు—ఇంత ద్రోహం చేసి నందుకు నిన్నూ నీ చెల్లెల్నీ నలుల్ని రాచినట్టు రాచివేసును మరొకడైతే. నేను మెత్తగా దొరికానని నీతులు బోధించ వచ్చావా? నా కాళ్లే కోపం తెప్పించక మర్యాదగా వెళ్లు. ఆడపడుచు పుట్టింటవుంటే అవమానమని వచ్చావేకాని, నీ చెల్లెలు కళంకిని కాదని ప్రమాణం చేయగలవా?"

కోపంగా మంచంమీదనుంచి లేస్తూ "రవీంద్రా" అని ఆవేశంగా అరిచాడు శ్రీధర్. "రవీంద్రా", ఇంత మూర్ఖుడవను కోలేదు. కాళ్ళు కడిగి, ఆడపిల్ల నిచ్చినవాణ్ణి-ఎంత అణిగిమాట్లా

డినా నీ నోటికి హద్దు లేకుండా ఉంది. ప్రమాణం చెయ్య మన్నావు కాదూ! నిస్సంకోచంగా చేస్తాను. ఈ ప్రమాణాలు, పాతివ్రత్యాల వల్లనే భారత దేశం ఇలా మనగలుగుతోంది. లేకపోతే నీ తోటివాళ్ళు ఏనాడో కడగండ్లపాలై వుండురు." ఒక్క క్షణం ఆగి, హేళనగా నవ్వుతున్న రవీంద్రవైపు తిర స్కారంగా చూచి మళ్ళీ సాగిపోయాడు. "నువ్వెన్ని నిందలు మోపినా, అవన్నీ భ్రమలే. అసత్యాలే. మాధవి మహాపతివ్రత. మహామేధావి, నీతిమంతుడు అయిన తండ్రి కడుపునబుట్టి మహా యిల్లాలి చేతుల్లో పెరిగింది, గుళ్ళూ, గోపురాలు కట్టించిన రెండు పుణ్యవంశాల వారసురాలు. దిక్కులేని అనేకులకు చదువులు చెప్పించి, సంసారాలేర్పరిచి ప్రయోజకుల్ని చేసిన ఇద్దరు తాతగార్లకు మనుమరాలు. ఉన్నత వంశంలో పవిత్ర గర్భాన పుట్టి పెరిగిన విద్యావతి, గుణవతి, శీలవతి, ఆమెకు చిన్నగుణం, చిన్న కోరికా, చిన్న బుద్ధీ మచ్చుకైనా ఉండదు. నిష్కళంకిని అయిన మాధవి ఈ మహా గండంనుంచి బయట పడి బిడ్డతో సుఖంగా ఉంటుంది. ఇదే నా ప్రమాణం. ఆనాడు నీ అంత నువ్వే వస్తావు. గుడ్ బై. దయాదాక్షిణ్యాలు లేకుండా కరకు దేరిపోయిన పోలీసు సూపరింటెండెంటును. నా చేతిలో ఇవ్వాళ నీ చావు తప్పిందంటే నా చెల్లెలే కారణం" త్వర త్వరగా మెట్లు దిగి చీకట్లో కలిసిపోయాడు శ్రీధర్.

౩౨

ఆ రాత్రికి రాత్రి రవీంద్ర ఇల్లు విడిచిన తిన్నగా

రైల్వే సేషనుకు వెళ్ళాడు. కాని, మళ్ళీ ఏదో ఆలోచనతో వెనుదిరిగి ఊళ్ళోకి వెళ్ళాడు.

రాత్రి దాదాపు పదకొండు గంటల సమయం. అప్పుడే క్లబ్బునుండి వచ్చి కారు దిగుతూన్న చక్రవర్తి, వీధి వరండాలో నిల్చున్న శ్రీధర్‌ను చూచి ఆశ్చర్యపోయాడు. "ఎంతసేపైౖ వచ్చావు! పరాయి వాడిలా ఇక్కడ నిల్చున్నావేమిటి?" అన్నాడు.

చక్రవర్తిని పరీక్షగా చూడటం తప్ప మాట్లాడలేదు శ్రీధర్. కొంచెం ఆత్రుత కనబరుస్తూ, "మాధవిగా రెలా ఉన్నారు?" అన్నాడు చక్రవర్తి.

"ఇప్పటివరకూ బాగానేవుంది" అన్నాడు శ్రీధర్ మరో వైపు చూస్తూ.

ఈటెల్లా తగిలి ఆ మాటలకు లోలోన బాధపడుతూ, "దా, లోపలికి వెళ్దాం. భోజనాలు కానిచ్చి మాట్లాడుకుందాం" అంటూ లోపలికి దారితీశాడు చక్రవర్తి.

"నే నిప్పుడు విందులకూ, కులాసాలకూ రా లేదు. నీగది పద. మాట్లాడాలి"

చక్రవర్తి అప్పుడప్పుడు తాను ఏకాంతంగా గడపటానికీ, చదువుకోవటానికి ఉపయోగించే గదిలోకి తీసుకెళ్ళాడు శ్రీధర్‌ను. చక్రవర్తి వెనుకనే ప్రవేశించి తలుపుకు బోల్టు బిగించాడు శ్రీధర్.

సోఫాలు, సీలింగుఫాన్, చిన్న రేడియో, ఎక్స్‌టెన్షన్ టెలిఫోన్ అన్ని సౌకర్యాలూ ఉన్నాయి. ఇద్దరూ కూడా

కూర్చోలేదు శ్రీధర్ ఏదో ఆలోచిస్తూ గదిలో పచార్లు మొదలు పెట్టాడు. చక్రవర్తి కిటికీ దగ్గర నిల్చొని బయటకు చూస్తూ హఠాత్తుగా వెనుకకు తిరిగి, "నువ్వేం మాట్లాడతావో నాకు తెలుసు" అన్నాడు.

"అనే నేనూ అనుకొంటున్నాను. తెలిసీ ఎందు కిలా చేతులు ముడుచుకూర్చున్నావు?" తీవ్రంగా ప్రశ్నించాడు శ్రీధర్.

"శ్రీధర్!" జాలిగా చూచాడు చక్రవర్తి. "నేను చేతులు ముడుచుకూర్చోలేను. శాయశక్తులా ప్రయత్నించాను. ప్రయత్నిస్తూనే ఉన్నాను."

"కాని ఫలితం దక్కలేదంటావు. అవునా? అయినా ఇంత విషమించాక ఎవరు ప్రయత్నించిమాత్రం ఏం లాభం? అసలింతవరకూ ఎందుకు రానిచ్చావు? తన భార్యవైపు మరొకడు కన్నెత్తి చూస్తేనే ఉరిపోసుకు చచ్చే మగవాడి దేశమని మరిచిపోయావా? అమెరికాలు, బ్రిటన్‌లు తిరిగి వచ్చిన నీకు తెలియకపోవచ్చు. ఇక్కడకూడా దొరగారిలాగే వుంటే నీ ప్రాణానికి ఉసూరుమంటూ ఎందరేడుస్తారో ఆలోచించావా? పరాయి దానితో అంత చనువుగా ఎలా వున్నావు?"

క్రోధం, ఆశ్చర్యం, అవమానం పెనవేసుకొచ్చాయి చక్రవర్తికి. కాని తమాయించుకుంటూ, శ్రీధర్ రెండు చేతులూ పట్టుకొని, ఇదేమిటి శ్రీధర్, ఎంతో సంస్కారవంతుడవు, నువ్వే ఇలాగంటున్నావా? భగవత్సాక్షిగా నే నే

పాపమూ ఎరుగను. మాధవి నీకెలా చెల్లెలో నాకూ అలానే చెల్లెలు" అన్నాడు. గొంతు వణికింది.

చేతులు విడలించుకున్నాడు శ్రీధర్. "అవును. అది నీకూ, నాకూ తెలుసు. కాని ఆ మూర్ఖుడికి కెల్లా తెలుస్తుంది? ఇంటికెళ్ళగానే 'అన్నయ్యా' అని గంపెడాశతో ఎదురువస్తుంది. దానికేం చెప్పను? ఎలా సమాధాన పరచను? అసలు తట్టుకో గలదా? బ్రతుకుతుందా?" కన్నీళ్లు టపాటపా రాలాయి. కళ్ళు తుడుచుకుంటూ అతడు తలెత్తి చూచే సరికి, సరిగా చక్రవర్తి కూడా అదే స్థితిలో ఉన్నాడు. అహంభావమూ, ద్వేషమూ మరిచిన రెండు హృదయాల నిర్వేద ఘోష అది. నిశ్శబ్దాన్ని భంగపరుస్తూన్న టెలిఫోన్ అందుకొన్నాడు చక్రవర్తి. ఫోన్‌లో మాట్లాడుతున్న చక్రవర్తి ముఖం వికసించసాగింది. విన్నవన్నీ ఒక కాగితంపై వ్రాసుకొని, డ్రాయర్ సొరుగులో నుండి మరో కాగితం తీసి, అందులో వ్రాసి ఉన్న మందుల పేర్లూ, మోతాదులూ చెప్పాడు. ఏవో మెడికల్ జర్నల్స్ రెండు చదవమని సూచించాడు.

సంతృప్తిగా ఫోన్ పెట్టేస్తున్న చక్రవర్తిని ఆశ్చర్యంగా చూచాడు శ్రీధర్. "ఫోన్ ద్వారా వైద్యం చేస్తున్నావేమిటి?"

నీరసంగా నవ్వాడు చక్రవర్తి. "ఆప్తులైన వాళ్ళెంత దూరంలో ఉన్నా, ఎవరేమనుకున్నా హృదయంలో ఉన్న తహతహ ఆగదు.

కనుబొమలు చిట్లించాడు శ్రీధర్. "నా ప్రశ్నకు సమాధానం కాదది."

మళ్లీ అలాగే నవ్వాడు చక్రవర్తి. "అదే సమాధానం కాని నీ కర్థంకాలేదు. ఎవరికీ అర్థంకాదు." నీరసంగా కుర్చీలో కూలపడుతూ "ఇవన్నీ ఏమిటో చూడు" అంటూ బల్లమీద ఉన్న వివిధ దేశాల మెడికల్ జర్నల్సు, వాటిని చదివి తిరిగి తను తయారు చేసుకొన్న నోట్సు చూపించాడు చక్రవర్తి.

"మాధవి పరిస్థితి చాలా తీవ్రంగా ఉన్నట్లు నాకూ తెలుసు. ఇక్కడే ఉంచి ట్రీట్ చేద్దామనుకున్నాను. కాని భగవంతుడు ప్రతికూలించాడు. అందుకే శ్రీదేవి దగ్గర ట్రీట్ చేయించమన్నాను మాధవిని. నేను చేస్తే ఆమె తన స్వంత కేస్‌లా చూచుకుంటుంది" కొంచెంసేపాగి మళ్ళీ మొదలెట్టాడు. ప్రతిరోజూ ఇదే సమయానికి ఫోన్ చేస్తుంది శ్రీదేవి, మాధవి పరిస్థితి వివరంగా చెప్తూ. నేను పగలు చదివి సేకరించిన వివరాలు అన్నీ ఆవిడకు చెప్తాను! అలాగా ఇద్దరం జాయింటుగా ట్రీట్ చేస్తున్నాం, మాధవిని. ఈ విధంగా మాధవి క్షేమ సమాచారాలుకూడా నాకు ఏరోజు కారోజు తెలుస్తున్నాయి."

తెల్లబోయి వింటూన్న శ్రీధర్ రెండు చేతులతో చక్రవర్తిని చుట్టేసి బొటాబొటా కన్నీరు కార్చాడు. "నేనెంత హీనుణ్ణి చక్రవర్తీ! ఇటువంటి నిన్ను ఎన్ని మాటలన్నాను !''

చక్రవర్తికూడా ద్రవించిపోయాడు. అలా ఒకరి చేతులలో ఒకరు ఎంతసేపు ఉన్నారో గడియారం పన్నెండుకొడుతూంటే విని సుషుప్తినుంచి మేల్కొన్నట్లయ్యారు.

"మొదట పొరబడితేనేమి, శ్రీధర్, త్వరలోనే తెలుసుకో గలిగావు. అదే నాకు సంతోషం. అయినా రక్తసంబంధం

మమతా అటువంటివి. ఒకప్పుడు నా చెల్లెలికోసం నేనూ ఇంతకు వెయ్యిరెట్లు బాధ ననుభవించాను.''

"అదేమిటి?" అడిగాడు శ్రీధర్.

"ఏమిటోలే, ఇప్పుడెందుకు? సమయం వొచ్చినప్పుడు అదే తెలుస్తుందిలే" అంటూ "పన్నెండైంది. ఇంక భోజనా లేమిటి? పడుకొందామా?" అన్నాడు చక్రవర్తి.

అప్పుడు తన తప్పు తెలిసింది శ్రీధర్‌కు. "అరరే! ఎంత పని చేశాను? నా భోజనం అక్కడే అయింది. మధ్య నిన్ను చెడగొట్టాను.''

"ఫర్వాలేదులే. నా కలవాటే'' అంటూ చక్రవర్తి రిఫ్రిజిరేటర్‌లోంచి ఆపిల్, ద్రాక్ష తీసి ముక్కలు కోశాడు. కొన్ని శ్రీధర్ ముందుంచి కొన్ని తాను తింటున్నాడు చక్రవర్తి, ఏదో ఆలోచిస్తూ.

"అయితే, చక్రవర్తీ, నువ్వింటికి రావడం, భోజనం చెయ్యకపోవడం ఏమీ పట్టనట్టుందే నిర్మలకు? ఇంట్లో ఉందా అసలు?''

జీవంలేని నవ్వు క్షణకాలం చక్రవర్తి పెదవులపై మెదిలి అదృశ్యమైంది.

"ఆవిడకేం అక్కర్లేదులే! అవసరమైతే నేనే వంట వాణ్ణిలేపి పెట్టించుకొంటాను. దాని కేంగాని, అయితే రవీంద్రను కలిశావన్నమాట!''

"ఆ. ఏదో నోటికొచ్చినట్లు వాగాడు. లేచొచ్చాను'' అన్నాడు శ్రీధర్ చీదరించుకుంటూ.

కొంచెంసేపు తటపటాయించి కడకు చక్రవర్తి మెల్లగా తగ్గుస్థాయిలో అడిగాడు—"అయితే శ్రీధర్, ఆ ఇంట్లో నీ కింకెవరైనా కన్పించారా?" అని.

"ఎవరో ఇద్దరు నౌకర్లున్నారు. ఏం?"

"నౌకర్లు సరే. ఆడవాళ్ళెవరూ..." అర్థోక్తిలోనే ఆపే శాడు చక్రవర్తి.

కొద్దిసేపు ఊరుకుని అన్నాడు శ్రీధర్, "ఆవిషయం నేనూ విన్నాను. మంగపతి అని నీ స్నేహితు టొకాయన క్రొత్తగా యిక్కడకు బదిలీ అయ్యాడు. అతడు వ్రాశాడు ఏదో అనుమానంగా ఆఫీసుకు సెలవు పెట్టాడనీ, ఇంట్లో ఆడ వాళ్ళెవరో వున్నారనీ. మధుతో ఇదేమీ చెప్పకుండా వూరి కేనే చూచివస్తానని చెప్పి బయల్దేరేను. ఇంట్లో నా కెవరూ కన్పించలేదు. కాని, ఆడవాళ్లున్న ఆనవాళ్ళున్నాయి."

"అంటే?"

"డ్రెసింగ్ టేబుల్ దగ్గర వాడిన పువ్వులున్నాయి. టేబిల్‌మీద ఏవో మట్టిగాజులు, దండెంమీద రెండు చీరలు. హాలు కెదురుగా ఉన్న గదిముూలన అవే కన్పించాయి. ఇల్లంతా పరీక్ష చేద్దామన్నా, ఎవర్నో మడుగుదామన్నా కూడా తైనాతిలాగ మధు మామగారొకడు దాపరించాడు. ఆతరువాత రవీంద్ర వచ్చాడు. అయినా చూచీ, తెలుసుకోనీ ఏం చేయగలం?"

అది విని నిట్టూర్చాడు చక్రవర్తి. "ఏమీ అనుకోకు శ్రీధర్. మరో విషయం చెప్పి నీ మనసు బాధ పెడుతున్నాను.

ఇంట్లో ఆడవాళ్ళుండడం నా కళ్ళతో చూచాను. ఎవతో 'కామన్ గర్ల్' అన్పించింది వేషభాషలు చూస్తే. ఒకసారి వెళ్తే నాకు రవీంద్ర దర్శనమే కానివ్వలేదు. మరోసారి వెళ్ళి నపుడు కూడా కన్పించింది కాని, నేను లెక్కచేయలేదు. తిన్నగా రవీంద్ర గదిలోకి వెళ్ళిపోయాను. ఇంతకూ చెప్పే దేమంటే, ఇవ్వాళ్ళ పట్టపగలు అది నగలూ డబ్బూ దోచుకు పోయిందని రిపోర్టు చేశాడట రవీంద్ర. నాకు క్లబ్బులో బ్యాంకు మేనేజర్ చెప్పాడు. పోలీసు వాడివిగా? బహుశః రేపో ఎల్లుండో మీ డిపార్టుమెంటుకూ తెలుస్తుంది."

"ఎంత తెగించాడు! ఏదో రోజూ పెట్టుకొనే మామూలు నగలు మినహా మాధవి ఏమీ తెచ్చుకోలేదు. లెక్కపెట్ట లేనన్ని నగలున్నాయి దానికి. అన్నీ ఎగిరిపోయినట్లేనా?"

"నగలే కాదు. పదివేల చెక్కుకూడా. ఇంతకూ రవీంద్ర ఇవ్వనన్నాడా నగలు?"

"ఇవ్వననటానికి వాడిబాబుసొమ్మేంకాదు. చాలావరకు మేము చేయించినవే. మనమ్మాయి అభిమానవంతురాలు, సంసారమేపోయాక, అవెందుకనుకొని వదిలేసి ఉంటుంది. అయినా నేనడగలేదంత వివరంగా. ఈమాత్రమైనా ఒకపట్టాన చెప్పిందనా? ఎంతో లాలనగా, బలవంతంమీద రాబట్టాను. ఒక వారం క్రితం మంగపతి వ్రాసేవరకూ నా కసలు సంగతి తెలియనే తెలియదు."

"అభిమానవతి!" అంటూ నిట్టూర్చాడు చక్రవర్తి "అసలు నా అనుమానమేమంటే వాళ్ళతో యింతకుముందే పరిచయం

వుండి, యేదో ఒక నెపంతో మాధవిని అడ్డు తొలగించు కొన్నాడేమోనని?"

"ఏమోమరి ! అటువంటివాడు కాదంటుంది మాధవి. నిజమెంతో ఎవరికి తెలుసు ? పోనీ, మనిద్దం ఇపుడు కలిసి వెళ్తే బుకాయించగలడంటావా?"

అదిరిపడ్డాడు చక్రవర్తి. "వద్దు శ్రీధర్. అంతపని చెయ్యొద్దు. పెంకివాడు. మరింత రేగిపోతాడు. మనకావల సింది చెల్లాయి సంసారం నిలబెట్టడం కాని పట్టుదలలు కాదు."

"ఇంక నిలబెట్టడ మెలా? ఇంత నీచానికి దిగజారిపోయా డంటే మధు యిక కలనైనా తలపెడుతుండంటావా?"

జాలిగా నవ్వాడు చక్రవర్తి. "పొరపడు తున్నావు. అటువంటివాళ్ళే తేలిగ్గా క్షమించగలరు. హక్కులనీ, న్యాయ మనీ వాళ్ళు ఘోషించేదల్లా ఇతరులకు న్యాయం చేకూర్చ టానికే. తమని తా మెప్పుడూ త్యాగం చేసుకొంటారు. చెట్టు నాటినవాడు ఫలాలు ఆశించడు. ఫలసాయం మరోతరం వాడిది."

"ఊఁ!" బరువుగా మూలిగి లేచాడు శ్రీధర్. "మరయితే నేను వెళ్తాను. ఇప్పుడేదో ట్రెయినున్నట్లుంది."

"ఇప్పుడే? రేపు వెళ్ళకూడదూ?"

"సెలవు లేదు."

"అయితే పద. స్టేషనులో దిగబెడతాను."

ఇంక రైలు కదలటానికి ఆట్టే వ్యవధిలేదు. చక్రవర్తి ముఖంలోకి చూస్తూ నిలుచున్నాడు శ్రీధర్.

"ఏమిటో నువ్వింకా చెప్పబోయి వెనకాడు తున్నట్లు న్నావు? సందేహించకు" అన్నాడు చక్రవర్తి!

శ్రీధర్ మాట్లాడలేదు.

"ఫర్వాలేదు. చెప్పు, యేమైనా ఉందా?"

"నువ్వేమనుకోవద్దు. నా అనుమానం...?"

"ఊఁ నీ అనుమానం...?"

"ఇందులో నిర్మల ప్రమేయం కూడా ఏదైనా ఉందేమో నని?"

చక్రవర్తి మాట్లాడలేదు.

"అదుగో. నీకోపం వచ్చినట్టుంది. ఆడవాళ్లు సహజంగా అసూయాపరులు రవీంద్రలాగే నిర్మలకూడా లోపల ఏమైనా అనుమానపడిందేమో! అయినా యిదంతా నా అనుమానం. నా బాధ అలాగన్పిస్తోంది. ఏమనుకోకు."

"నోమెన్షన్" అంటూ చెయ్యి నొక్కి వదిలేశాడు చక్రవర్తి.

మెల్లగా రైలు కదిలింది.

"మాధవికి ధైర్యం చెప్పు. ఇక్కడి సంగతులేం చెప్పకు." అంటూ హెచ్చరించాడు చక్రవర్తి.

తల ఊపాడు శ్రీధర్.

ఒకరికి తెలియకూడదని ఒకరు త్వరగా ముఖం మరో వైపుకు త్రిప్పుకున్నారు. కాని యిద్దరికీ తెలుసు — రెండో హృదయం ఏడుస్తున్నట్లు.

## ३८

రెండు నెలలపాటు ఊళ్ళన్నీ తిరిగి వేసారిపోయాడు రవీంద్ర.

పల్లెటూళ్ళల్లో సుఖశాంతులు ఉంటాయని చిన్నప్పుడు చదివాడు. ఎవరో స్నేహితుడింటి దగ్గర పదిరోజులు ఉన్నాడు, గోదావరి దగ్గర ఓ పల్లెలో, ఆ స్తబ్దజీవనం, కోళ్ళ అరుపులు, అటు నాగరకం ఇటు అనాగరకంగాని ప్రజలు, పార్టీలు, కక్షలతో క్రుళ్ళిపోయిన ఆ వాతావరణం, తాటాకు గొడుగూ, కిర్రు చెప్పులూ వేసుకొని పైకి కట్టుకొన్నట్టు మధ్య మధ్య విన్పించే పంచాయితీ ఆఫీసులో రేడియో అతడికి గంగ వెర్రు లెత్తించాయి. రచయితల వర్ణనలో కన్పించే అమాయికతా, రామణీయకతా ఎక్కడా మచ్చుకైనా లేవు. విసుగెత్తి పరుగెత్తి పారిపోయాడు, హైదరాబాద్ వేపుగా.

దారిలో విజయవాడలో దిగాడు. దేవాలయంలో సుఖశాంతులు లభిస్తాయేమో! దైవదర్శనం మనోవేదనను తొలగించగలదేమో! కృష్ణలో స్నానం చేసి కనకదుర్గ ఆలయంలో అడుగెట్టాడు. అమ్మవారిని అయిదు నిమిషాలైనా దర్శించ శక్యం కాలేదు. వెనుక ఒకసారి తిరుపతి శ్రీనివాసుని దర్శించిన సందర్భం గుర్తుకు వచ్చింది! ఎన్ని ఆశలతో కోర్కెలతో, ఎన్ని వేల మైళ్ళ దూరంనుండి ప్రయాణం చేసి వస్తేనేం ? కళ్ళారా కనురెప్పపాటు కాలమైనా ఆ భువన మోహనరూపాన్ని దర్శించటానికీ వీలులేదు. క్యూలో విసుచుకు పడేజనం, ఘో ఘో అనే పూజార్ల అదలింపులు, ధనం చెల్లించి టికెట్లుకొన్న ఏ కొద్దిమందికో పూర్తి దర్శనం.

కాని ప్రశాంతత ఏది ? ఈ కాలంలో ఎక్కడా ప్రశాంతతా, సుఖశాంతులూ లేవు. ప్రతీదీ వ్యాపారదృష్టే. తిరిగి రైలెక్కాడు.

అదృష్టవశాత్తు మంచి తోడు దొరికింది. అందమైన ఒక యువకుడు. యువతి ఎక్కారు ఆ పెట్టెలోనే. అతడికి హైదరాబాద్‌లో క్రొత్తగా ఉద్యోగమైంది. ఎన్నో ఆశలతో కలలతో సంతోషంగా వెళ్ళుతున్న ఆ దంపతులు, మాధవిని పెళ్ళియిన క్రొత్తలో తానొకనాడు విశాఖపట్నంవైపుగా వెంట బెట్టుకు ప్రయాణించిన ఘట్టం గుర్తుకు తెచ్చారు. సంస్కారం ఉట్టిపడే ఆ యువకునితో సంభాషిస్తూనే నిద్రపోయాడు రవీంద్ర.

ఖాజీపేటలో అతడికి మెలకువవచ్చేసరికి క్రింద బెర్తులో ఆ దంపతులు లేరు. చుట్టూ కలయజూచేసరికి నాలుగు క్రొత్త ముఖాలు కనిపించాయి. కాని తన సూట్ కేస్ లేదు. ఆత్రంగా జేబులు చూచుకున్నాడు, పర్సుకూడా లేదు. ఆ ప్రయాణీకులతో చెప్పాడు.

"అయ్యో పాపం!" అంటూ తమ సామాను సరిగా ఉందో లేదో చూచుకో మొదలెట్టారు. గార్డుతో వివరంగా చెప్పాడు రవీంద్ర.

వివరాలు వ్రాసుకొంటూ "ఈ మధ్య యిలాంటి దొంగ తనా లెక్కువౌతున్నాయి. ప్రయాణీకులు కొంచం జాగ్రత్తగా వుండాలండి. ప్రయత్నించి చూస్తాం. ప్రయోజనం వుండదనుకుంటాను" అన్నాడు అతడు.

"ఛీ ఛీ! ఎక్కడ చూచినా మోసం, దగా! ఇంతకు మించిన ప్రపంచమే లేదా? దాంపత్యం, మిత్రత్వం, పరిచయం- ఎందులోనూ నిజాయితీ లేదా? విసిగిపోయిన హృదయం మరింత చీకాకు పడిపోయింది. ఆ రోజు ఆ స్టేషన్‌లో దిగిపోయి వైజాగ్‌లో తన డిపాజిట్ ఉన్న బ్యాంకుకు వైర్ చేసి డబ్బు అందుకొన్నాడు.

టిక్కెట్టు కొందామని వెళ్ళుతూండగా ప్లాట్‌ఫారం మీద ఒక దృశ్యం అతడిని కలచివేసింది. ఎవరో పురుషుడు, బాగా చదువుకున్నట్లున్నాడు. పోకుగా ఉన్న ఒక స్త్రీతో రైలెక్కుతున్నాడు. మరో స్త్రీ, చాలా సౌందర్యవతి, కాళ్ళవేళ్ళాబడి బ్రతిమాలుతూంది. "నేను మీకు అడ్డురాను మీ ఇంట దాసీగానైనా వుండనీయండి." పాపం మొదటి భార్యగాబోలు!

'ఎందుకు ప్రయాణం? ప్రదేశాలు చూడడానికి కాదు. ప్రపంచంలోని రకరకాల స్వార్థాలు నైచ్యాలు చూడడానికి- అనేటంత విరక్తిగా మారిపోయిన మనస్సుతో తిరుగు ముఖం పట్టాడు, రవీంద్ర.

ఇంటికివచ్చి సెలవు రద్దుచేసికొని తిరిగి ఉద్యోగంలో చేరాడు. ఆఫీసుకు వెళ్లుతున్నాడు, వస్తున్నాడు. మనస్సును కలుషితం చేసి, మెదడును బ్రద్దలు చేసే చికాకైతే తగ్గింది కాని, హృదయాన్ని దహించివేసే బాధమాత్రం తగ్గలేదు. అహోరాత్రం అంతరాత్మలో ఒకటే ప్రశ్న: 'ఎందుకింక నా బ్రతుకు? జీవించి ఏం చెయ్యాలి? సంసారి, సాని - ఇద్దరూ ఒకలాగే మోసగించారు తనను. మనశ్శాంతి నొకరు కలు

షితం చేస్తే, కృత్రిమ సంతోషంతోపాటు ధనకనకాలను యింకొకళ్లు దోచుకున్నారు. మిత్రుడు ద్రోహం చేశాడు. కన్నవారెక్కడో ఉన్నారు. తాను పోషించనవసరం లేదు. ఇంకెందుకీ జీవితం ? ఎవరి తృప్తికోసం ? తన సుఖ సంతోషాలకోసం అహోరాత్రం జాగ్రత్తపడేవారు కాని, చల్లగా ఒక్కమాట మాట్లాడి సేద దీర్చేవారుగాని, తన రాకకోసం నిరీక్షించేవారు కాని, తన చిరునవ్వుకు పులకలెత్తేవారు కాని లేరు. తనకోసమే తాను ఎందుకీ తాను? ఏమిటీ తాను ? ఎవరు తాను ? ఎందుకు తాను ? ఎందుకు? ఎందుకు ??? ?

జవాబులేని ప్రశ్న. తీరని వేదన. ఆరని మంట. భారమైన బ్రతుకు. మధ్య పోలీసువాళ్లొకళ్ళు. ఆచూకీ తీయక పోగా, వివరాలు కావాలంటూ మాటిమాటికి రకరకాల ప్రశ్నలతో విసుగెత్తించడం.

"నా కంత పట్టుదలగా లేదు. పోనీ రిపోర్టు ఉపసంహరించుకుంటాను మీరు శ్రమపడకండి" అన్నాడు రవీంద్ర ఒక నాడు సబ్ ఇన్స్పెక్టరుతో.

అతడు తేలిగ్గా నవ్వేశాడు. "ఈమాత్రానికే యింత నిరుత్సాహ మేమిటండీ ? ఎన్నాళ్లైనా పట్టుకు తీర్తాం. చూడండి" అంటూ వెళ్లిపోయాడు.

## ౩౭

పంచక్కుల నార్పేసే వడగాడ్పులు. అప్పుడప్పుడుగాలిదుమారం రేగుతూంది.

"మధూ !"

పరధ్యానంగా పడుకొని, మేఘావృతమై ఉన్న ఆకాశాన్ని చూస్తున్న మాధవి, శ్రీధర్ కేకకు లేచి కూర్చుంది. శ్రీధర్ ఆఫీసు దుస్తుల్లోనే హడావిడిగా వచ్చాడు.

"ఏమిటన్నయ్యా?"

"ఏం చేస్తున్నావమ్మా ? ఇప్పుడే నిద్రలేచావా ? పోనీ తర్వాత మాట్లాడుకుందాంలే."

"అసలు నిద్రపోందే ! చెప్పేమిటో."

"రా, ఇలా కూర్చో. కొంచెం మాట్లాడాలి. నిమనస్సు చాలా కష్టపెడుతున్నాను, ఏమీ అనుకోకూడదు. తప్పనిసరి." మాధవి తల నిమురుతూ ఉపోద్ఘాతంగా అన్నాడు.

నవ్వడమే మరిచిపోయిన మాధవి నెమ్మదిగా నవ్వింది. "నాకు కష్టంలేదు. ఎంత కష్టమైనా తట్టుకోగలను. చెప్పు."

"ఇదిగో, ఇలా మాట్లాడతావనే అసలు ఇంతవరకు నీకు చెప్పకుండా దాచినది'' అంటూ మెల్లగా మొదలెట్టాడు. "మూడు నెలల క్రితం నీ నగలూ అవీని...'' ఎలా చెప్పాలో అర్థం కాక తికమక పడుతున్నాడు.

"ఊ, ఆగిపోయావేం? సీత అనే మనిషి. దానితల్లీ కలసి ఎత్తుకుపోయారు పట్టపగలే. అదేనా నువ్వు చెప్పొచ్చినది ?" శ్రోతలే చెప్పేవారైతే అసలువారే నిర్ఘాంతపోవలసి వచ్చింది.

"నీ కెలా తెలుసూ ?"

"పేపరులో చూచాను. నాకు తెలీదని నీ వనుకుంటూన్నావు. నీకు తెలీదని నే ననుకుంటూన్నాను.'' నవ్వింది.

"నీ దొంత లోతుగుండె మధూ! అంతేనా? అంతకంటే ఏమైనా తెలుసా!"

"ఇంత తెలియనక్కర్లేదు. ఎంతమూర్ఖులైనా వూహించగలరేమో! దాన్ని బహుశః ఇంట్లో మనిషిలా చూచుకుంటూన్నారేమో. అనుపానూ కనిపెట్టిదో చేసింది" అంది నిర్లిప్తంగా.

"అంతేలే. కాని ఇప్పుడు విశేషమేమంటే, ఆ నగలలో కొన్నిటితో సహా పట్టుబడింది ఆ పిల్ల. రవీంద్ర కేసు ఉపసంహరించుకొన్నాడట. మేం వైజాగ్ డిపార్టుమెంట్ వాళ్ళకు ఫోనుచేస్తే, వాళ్ళతనికి తెలియపరచారట. ఈ లావాదేవీలన్నీ నేను పడలేను; వద్దన్నాడట. ఒక్కసారి నువ్వగనుకవచ్చి అవి నీవని గుర్తిస్తే కేసు నడిపి రాబట్టుకోవచ్చును." శ్రీధర్ ఆశగా చూచాడు చెల్లెలి వేపు.

మాధవి తొణకలేదు. కొంచెంసేపు మౌనంగా ఉండి, "అన్నయ్యా, ఏమనుకోకు. ఒక్కటడుగుతాను" అన్నది.

"దాని కేమిటమ్మా? ఒక్కటికాదు. వందడుగు."

"పోయిన వస్తువులను మళ్ళీ సంపాదించగలం. పోయిన పరువును పొందగలమా?"

"అంటే ఏమిటమ్మా? స్పష్టంగా చెప్పు."

"ఏముంది? తీగ కదపితే డొంకంతా కదులుతుంది నిజానికానగలు మనకంత లెక్కలోనివి కావు. ఖరీదైనవే ననుకో. కాని మనమూ, మన పేరు ప్రతిష్ఠలూ అంతకంటె ఖరీదైనవి కదా! తీరా ఆయనే ఇచ్చారంటే? ఇప్పటికే సగం చచ్చి ఉన్నాం."

"మధూ, నీకేం మతిపోలేదుకద? అవి కనీసం ఏడెనిమిది వేలు చేస్తాయి. అదీకాక పదివేలు రొక్కం..."

"మతింకా పోలేదు. కాని సముద్ర మింకిపోతుంటే కాల్వకోసం తాపత్రయ పడ్డట్టు" ఇంక మాట్లాడ లేకపోయింది.

"నువ్వలా బాధపడతే ఎలా చెప్పు? సంసారంలో కలత లవే సర్దుకుంటాయి. అందుకోసమని ఇవి వదులుకోవడం ఎక్క డైనా వుందా?"

"అసలు సంగతి చెప్తాను వినన్నయ్యా. నేను దాని ముఖం చూడను. దాని వంటిమీద నగలు నావని చెప్పుకొని నేను తీసుకు పెట్టుకోలేను. ఆ నగల విలువ ఎంతైనా కానీ, అటువంటి అధమాధములతో లావాదేవీ లేమిటి, అభిమాన వంతులకు?"

"అవునులే. నేనంత దూరంగా ఆలోచించలేదు. కాని, అన్ని నగల్ని అలా తృణప్రాయంగా వదిలేసే నీలాటి స్త్రీ లెక్కడా ఉండరు."

"తృణప్రాయమా? నా మనస్సులో ఎంత రంపపు కోతగా ఉందో నీకేం తెలుసు? వెళ్ళు."

"కాని ఇందువల్ల మనం అన్యాయాన్ని ప్రోత్సహిస్తున్నా మన్నమాట. రేపు మరో ఇంట్లోకూడ ఇలాగే చేస్తుంది."

"అన్యాయం! అన్యాయం లేని దెక్కడ? పూర్తి న్యాయం చేకూర్చడానికి నేనూ సిద్ధమే. అయితే అది—ఆ హీనురాల్ని శిక్షించడంతో సగమే న్యాయం చేకూర్చా మన్నమాట. అటువంటి పనికి ప్రోత్సహించి, ఇన్నాళ్ళూ తన

అండక్రింద ఉంచుకొన్న వ్యక్తినికూడా శిక్షించడంతో అన్యాయాన్ని పూర్తిగా శిక్షించడమౌతుంది. అందుకు స్వపర భేదం లేకుండా నీవు సిద్ధంగా ఉంటే నేనూ సిద్ధమే. ఏమంటావ్?"

విస్తుబోయాడు శ్రీధర్. "అయితే రవీంద్ర..." అంటూ నాన్చేసాడు.

నవ్వింది మాధవి. "ఎంతైనా ఇంటల్లుడు కదూ. రచ్చకెక్కించగలమా? అని ఆ మనిషిమాత్రం పరాయిదే కనుక ఏం చేసినా ఫర్వాలేదు. అవునా? ఎంత పోలీసు ఉద్యోగివైనా ఒక్కసారి మానవత్వాన్ని గుర్తుచేసుకొని ఆలోచించవన్నయ్యా. ఒకే తప్పుచేసిన ఇద్దరిలో ఒకరిపై కక్ష, రెండవ వారిపై పక్షపాతం ఎందుకు? ఇలాంటి పురుషు లుండబట్టే అలాంటి స్త్రీలు జీవితాలను నాశనం చేసుకుంటున్నారు. కడకి పురుషులు తమవారితో కలిసి బాగానే వుంటారు. ఆమె జీవితం మాత్రమే నరకం. అంతా అసహ్యించుకుంటారు."

ఆశ్చర్యంగా వింటున్నాడు శ్రీధర్.

"మీ బావగారికి నేను హాని తలపెట్టలేను, నీకూ తెలుసు. ఇక ఆ పిల్ల సంగతి. వ్యక్తిగతంగా ఆమెపై నా కసహ్యమున్నా ద్వేషం, పగ లేవు. దారిద్ర్యం, బుద్ధిహీనత, పరిస్థితుల ప్రాబల్యం మొదలైన అనేక కారణాలవల్ల పతనమై పోయిన అటువంటి స్త్రీల జీవితాలను చూస్తే నాకు జాలి. ఆమెను శిక్షించి, కారాగారంలో ఉంచితే ఇంకా మొరటు తేలిపోతుందే కాని, ప్రయోజన మేమిటి? అందువల్ల ఆమె మీద కేసు పెట్టవద్దు. ఆ నగలు మనవని చెప్పవద్దు. తిన్నగా

బ్రతకమని నాలుగు మంచిమాటలు చెప్పి వదిలెయ్యి. ఆనగలు, డబ్బు పెట్టుకొని నీతిగా బ్రతకమని బోధించు.''

తన మాటలకు సమాధానం రాకపోయే సరికి తలెత్తి చూచింది మాధవి. శిలాప్రతిమలా నిల్చున్న శ్రీధర్ - తన హోదాను, పురుషాధిక్యాన్నీ, గాంభీర్యాన్నీ మరిచిపోయిన శ్రీధర్ - నేత్రాలనుండి చెక్కిళ్ళ మీదుగా హిమనదాలు ప్రవహిస్తున్నాయి.

"అన్నయ్యా!"

"మధూ!" చెల్లెల్ని దగ్గరగా తీసుకున్నాడు. "ఎంతటి సంస్కారముందమ్మా నీలో! చేస్తాను. అక్షరాలా నువ్వు చెప్పినట్టే చేస్తాను"

ఆ రాత్రే శ్రీధర్ చక్రవర్తికి ఉత్తరం వ్రాశాడు.

## ౩౧

ఒకరోజు పోటీలో గెలిచిన మాధవి కథ తాలూకు బహుమతి మొత్తం వచ్చింది. మాధవి పుట్టింటి అడ్రసుకు రీడైరెక్టు చేయబోయి మళ్ళీ ఆమె ఉత్తరం గుర్తుకువచ్చి మానేశాడు రవీంద్ర. ఆమె తరఫున ఆ డబ్బు తీసుకుంటూ ఒకసారి మళ్ళీ ఆ ఉత్తరంతీసి చదివాడు. తిరిగి మనస్సు అల్లకల్లోలమై పోయింది. ఆమె తిరిగి తనను దూషించినా, అహంకారంగా మాట్లాడినా కొంతలో కొంత ఉపశాంతి లభించునేమో? కాని, ఎక్కడా తిరస్కారమే లేదు. తనపై ద్వేషమే లేదు. పశ్చాత్తాపమా అంటే అదీ లేదు. 'దోషమే చేయలేదట. హుఁ. నేనంత గ్రుడ్డివాణ్ణా?'

అంతలో మరోవిషయం గుర్తుకువచ్చిందతడికి. 'ఆకథ తన చేతితో ఫెయిర్ కాపీ చేసి పంపాడు. ఆరోజు—అవును, మధురమైనరోజు, మరపురానిరోజు—ఒకరికోసం ఒకరు పాలు నీళ్లుగా కలిసిపోయిన రోజులలో ఒకరోజు?—అందమైన ఆమె అలసి మరింత అందంగా నిద్రిస్తూంటే లేపలేక తానేస్వయంగా వ్రాసిపెట్టి పోస్టు చేశాడు. అందమైన భంగిమలో ఉంటే కొంటెగా ఫోటోతీసి మర్నాడంతా ఆమెను ఉడికించి, మురిపించి మురిసిపోయాడు! ఎంత మధుర ఘట్టం! ఎంత తీయని వలపు! ఎప్పుడూ ఏదో చదువుతూ వ్రాస్తూ ఉండే ఆమెపై తన కెంత ప్రేమ! ఆమె తెలివిని మెచ్చి ఎన్ని గ్రంథాలు కానుకగా ఇచ్చాడు!'

అప్రయత్నంగానే రవీంద్ర కాళ్లు మాధవి రీడింగ్ రూమ్‌లోకి దారితీశాయి. అనాలోచితంగా మాధవివ్రాసే కథలు ఉన్న బీర్వా తీసి కెలకడం మొదలెట్టాడు. ఒక కాగితం దొంతిలోనుంచి జారి క్రింద పడింది—తాను అమితంగా ప్రేమించే ఆఫోటో - సోగకన్నులు బరువుగా మూసిన అందమైన ముఖం, అన్ని అందాలూ తనలోనే యిముడ్చుకున్నట్లు ఆ సౌందర్యం, అన్ని కళలనూ తనలోనే లీనం చేసుకొన్న ఆ విజ్ఞానరాశి—ఇంతటి ఉత్తమమైన, నీతివంతమైన సాహిత్యాన్ని సృష్టించే వివేకవతి అవివేకంగా ప్రవర్తించగలదా? ఊహూ, కాదు. ఎంత మాత్రం కాదు. నేనే పొరబడ్డాను. అనుకొంటూ అప్రయత్నంగా చేతిలో కాగితాలవంక చూశాడు. అవును. ఆకథే! 'ఆరాధన!' తనకు నచ్చిన కథ. ఉత్సాహంగా

పేజీలు తిరగవెయ్యసాగాడు. కదులుతున్న కళ్లు అప్రయత్నంగా ఒకచోట నిలిచిపోయాయి. వ్రేళ్లు బిగుసుకుపోయాయి.

చక్రవర్తి విమర్శ !

'ఈవిడ ఒక రచయిత్రి అతడు ఒక విమర్శకుడు !'

'ఇంత పదిలంగా దాచుకొందా ? ఏకల్మషమూ లేని వాళ్ళయితే ఒకళ్లినా చెప్పకపోదురా ? ఎంత గుంభనంగా జరిగాయి రాయబారాలు ! ఎంత తెలివి తక్కువవాడైనా అంత దోహదం యిస్తాడా ? అంతకూ కారణం నేనే. నేనే. అవును. అందుకే, నాకే నిష్కృతి కావాలి! కానీ ఈ ఏడు వందలు ! ఓ భగవంతుడా ! ఇది ఆవిడ ఆఖరి కోరికలలో ఒకటి కదూ, సరే. ఈడబ్బు ఆవిడ కోర్కె ప్రకారం ఆ ప్రసూతి కేంద్రానికే పారేస్తాను. మరి మిగిలిన కోర్కెలు?' పిచ్చిగా నవ్వుకున్నాడు. 'ఆవిడకంటే కానే ముందు ఆఖరైపోతూంటే, ఇంకా ఆవిడ ఆఖరి కోరికలు తీర్చడమేమిటి ? తన ఆఖరి కోర్కె తీర్చేవాడెవడు ? అహహ! ఆc ఉంది ఒక కోరిక. ఒకడు తీర్చేదేమిటి ? నేనే తీర్చుకుంటాను.' తృప్తిగా కసిగా నవ్వుకున్నాడు.

## ౩౭

"హల్లో గుడ్ ఈవినింగ్, ఇందిరాదేవీ!"

"ఓ రవీంద్ర ! వెరీ గుడ్ ఈవినింగ్. రండి యిలా కూర్చోండి. ఏం ఇలా వచ్చారు?"

"ఇక్కడ మెటర్నిటీ హాస్పిటల్ మేనేజింగ్ కమిటీ ప్రెసిడెంటు మీరే కదూ?"

"అవునండి. ఏం కావాలి?"

"ఈ హాస్పిటల్‌కు విరాళంగా రచయిత్రి శ్రీమతి మాధవి లతాదేవి ఏడువందల రూపాయలు పంపించారు."

"థ్యాంక్స్, రచయిత్రి మాధవీలతగారా? మిసెస్ రవీంద్రగారు కాదూ! ఎంత హాస్యంగా మాట్లాడతారు!"

రవీంద్రకూడా తప్పని సరిగా నవ్వాడు. "అవును, ఆమెకు ఒక కథలో బహుమానంగా వచ్చిన ఈ ధనం యిలా వినియోగింపదల్చారు."

"సరే కొద్దిసేపు కూర్చోండి. మా కమిటీ వైస్ ప్రెసిడెంటుగారికికూడా ఫోన్ చేస్తాను."

"అదంతా తర్వాత మీరుచూచుకోండి. నేను వెళ్తాను."

"ఎక్స్యూస్‌మీ మిస్టర్. మీరిచ్చేదలచింది వైస్‌ప్రెసిడెంటుగాని, మెంబరుగాని అయిన మరొకరి సమక్షంలో తీసుకుని రసీదివ్వడం మా పద్ధతి. ఆలస్యంకాదు. కూర్చోండి" అంది ఇందిర.

కొద్దిసేపటికి వచ్చిన వ్యక్తిని చూడగానే ఉలిక్కిపడ్డాడు రవీంద్ర. "చక్రవర్తా?"

"అవును వైస్ ప్రెసిడెంటు, డాక్టర్ చక్రవర్తి!" అంది ఇందిర.

చక్రవర్తి వస్తూనే ఇందిరతో కరచాలనం చేశాడు, ఆ దృశ్యంచూచిన రవీంద్ర, "ఎంత డాక్టర్లయితే మాత్రం

మరో ఆడదానికి షేక్ హాండ్ యిచ్చే వీడికి నీతా, నియమమా!” అంటూ లోలోన మండిపోయాడు.

“ఏమిటి విశేషం?” అని ఇందిరను ప్రశ్నిస్తూ ప్రక్కకు తిరిగిచూచిన చక్రవర్తి కంగారు పడ్డాడు కుర్చీలో రవీంద్ర! పలకరించ ప్రయత్నించినా కంఠం పూడిపోయిమాటరాలేదు.

“మిసెస్ మాధవీ రవీంద్ర మన హాస్పిటల్ కు విరాళం పంపించారు. వీరు మిస్టర్ రవీంద్ర” అంటూ పరిచయం చేసింది ఇందిర.

మర్యాదకు చేయి అందించాడు చక్రవర్తి. రవీంద్ర యాంత్రికంగా కరచాలనం చేశాడు.

ముగ్గురూ కాఫీలు తీసుకున్నాక డబ్బు యిచ్చాడు రవీంద్ర. రసీదుయిస్తూ “ఈ డబ్బు ఫలానా విధంగా వినియోగించాలని ఏమీ అభిప్రాయం లేదా మీకు?” అన్నది ఇందిర.

“ఏమో నాకు తెలియదు.” ముక్తసరిగా జవాబిచ్చాడు రవీంద్ర.

“ఒకగది ఎక్కువచేసి, అందులో మంచం, ఉయ్యాల వేయించి మాధవిగారు పేరు వ్రాయిస్తాం. ఏమంటారు?”

“బాగుంది. అయినా డబ్బుయిచ్చినవారు శ్రీమతిమాధవి” అన్నాడు రవీంద్ర.

“డబ్బు అందరకూ ఉంటుంది. కాని, యిట్టి సద్వినియోగం చేసే ఉదారతా, తెలివీ ఉండడం శ్లాఘనీయం, ఇంతకూ యీ డబ్బు ఏ కథకు వచ్చినదీ చెప్తారా? అవసరం లేదనుకోండి, కేవలం కుతూహలం” నవ్వింది ఇందిర.

"ఫర్వాలేదు. చెప్తాను, 'ఆరాధన' కథకు. మరి నేను వెళ్తాను." అంటూ లేచాడు రవీంద్ర.

'ఆరాధన!' చక్రవర్తి మనస్సు పరిపరివిధాల పోయింది. 'ఆమె కథ, తన విమర్శ' – ఒకదాని వెనుక ఒకటి అనేక స్మృతులు మెదిలాయి. 'ఇంతకూ మాధవి పంపడమేమిటి ? ఇద్దరూ కలిశారా ? అడిగితే చెబుతాడా ? మాట్లాడతాడా ?'

చక్రవర్తి ఇందిరవద్ద సెలవుతీసుకొని బయటకు వచ్చే సరికి రవీంద్ర ఇంకా వరండాలో నిల్చునే ఉన్నాడు. తటపటా యిస్తూనే రవీంద్ర దగ్గరకు వెళ్ళి భుజంమీద చేయివేసి, "రవీంద్రా!" అన్నాడు చక్రవర్తి. "మనం కొంచెం మనస్సులు విప్పి మాట్లాడుకొంటే మంచిది, రవీంద్రా!"

"అవును పద" అంటూ చక్రవర్తి ననుసరించి కారులో అతడి ప్రక్కనే కూర్చున్నాడు.

స్టార్టు చేస్తూ, "ఎక్కడికి వెళ్దాం ? మా యింటికా ? మీ యింటికా ?" అనడిగాడు, చక్రవర్తి.

"నీ తోటలోనికి పోనీ," అన్నాడు రవీంద్ర, చక్రవర్తి ముఖం చూడకుండానే.

కారుపోనిస్తూ మెల్లగా చెప్పాడు చక్రవర్తి: "అది ఇప్పుడు తోటకాదు. కళాకాంతులులేని బీడు. మన స్నేహం వృద్ధి అయిన నా తోటలో, ఆ స్నేహానికి నీ సంసారంతో పాటు బలియయిన చాతోట. మన స్నేహబాంధవ్యాలు తిరిగి నెలకొంటేనే ఆ తోటకూడా యథారూపం పొందుతుంది."

రవీంద్ర మాట్లాడలేదు. ఏవేవో అనేక భావాలను,

ఆవేశాన్ని అతడు ప్రయత్న పూర్వకంగా అణచుకొని నిల ద్రొక్కున్నట్లు గ్రహించాడు చక్రవర్తి.

"మా యింటికే పోనిస్తున్నాను" అన్నాడు తిరిగి.

తొలకరి ప్రారంభమయ్యే తొలిదశలో ఉంది ప్రకృతి ఆకాశమంతా మేఘావృతమైంది. బలమైన గాలి, కిక్కిరిసిన వున్న మేఘాలను పారద్రోల ప్రయత్నిస్తున్నది.

కారుదిగి చక్రవర్తి ననుసరించాడు రవీంద్ర. పై అంత స్థులో తనగదికి తీసుకు వెళ్ళుతుండగా, "అక్కడెవరూ ఉండరు కదూ?" అని అడిగాడు రవీంద్ర. నవ్వాడు చక్రవర్తి. "ఉంటారు. నిర్మల వూళ్లో లేదు. పనివాళ్ళు, స్టాఫ్ క్రింద ఉంటారు."

గదిలోకి వెళ్ళి ఫాన్ వేసి, కోటు విప్పేస్తూ, "కూర్చో రవీంద్రా" అంటూ వెనుదిరిగిన చక్రవర్తి కంగారుపడి వెను కకు రెండడుగులు వేశాడు. తలుపు దగ్గరగా చేరవేసి బోల్టు బిగించి గుమ్మం పొడవునా నిల్చున్నాడు రవీంద్ర, చేతిలో పిస్టల్ చక్రవర్తికి గురిపెడుతూ.

చక్రవర్తి తత్తరపాటు చూచి వికటంగా కసిదీరా నవ్వాడు రవీంద్ర. "ఊం కానియ్. మనసువిప్పి మాట్లాడతావు కదూ? కానియ్, అదేమిటో, బ్రహ్మరుద్రులు కూడా నిన్ను రక్షించలేరు. సత్యం మాట్లాడు, చచ్చేముందైనా." క్రౌర్యం కసి తాండవిస్తున్నాయి అతడి నేత్రాలలో.

చక్రవర్తి కంగారుపడలేదు. నవ్వుతూ నిల్చున్నాడు. "నిత్యం చావు బ్రతుకులలో వున్న శరీరాలతో ఆడుకొంటూన్న వాడిని మృత్యువును అనేక రూపాలలో చూచినవాడిని — నాకు చావంటే భయంలేదు రవీంద్రా, పిలవగానే వెంట

వచ్చినందుకు ఆశ్చర్యపోయాను. కాని, నువ్వింత పథకంతో వచ్చావని తెలుసుకొని కొంచెం కలవరపడ్డానంతే!"

"అవును, ఇంత పథకంతో నిన్ను చంపాలనే వచ్చాను. నా సుఖాన్నీ, సంసారాన్నీ స్మశానంలో కలిపిన నిన్ను కాల్చి చంపి, నేను కాల్చుకుంటాను. అప్పుడుకాని నాకశ తీరదు. అప్పుడు కాని నాలో మంట చల్లారదు."

హేళనగా నవ్వాడు చక్రవర్తి. "బాగానే ఉంది. కాని యింత తెలివితక్కువవాడవై పోయావేం మరి! నా యింట్లో నన్ను చంపగలవా? నీ వెనుక ఎవరున్నారో చూచుకో."

ఆలోచనలేని రవీంద్ర వెను దిరగగానే చక్రవర్తి ఏ మాత్రం ఆలస్యం లేకుండా ఎగిరి బలంగా రవీంద్ర మణికట్టుపై బూటుకాలితో తన్నడం, రవీంద్ర చేతిలో పిస్టల్ క్రిందపడడం తృటికాలంలో జరిగిపోయాయి. రవీంద్ర విస్తుపోయినా వెంటనే పులిలా లంఘించాడు చక్రవర్తిమీదకు. కాని ఎంత బలవంతుడైనా చక్రవర్తి ఆరోగ్యమైన శరీర బలంముందు దిగదుడుపే. బలమైన కండలు తిరిగిన చక్రవర్తి చేతులలో ఎటూ కదలేకపోయాడు రవీంద్ర. ఆయాసంతో రొప్పడం తప్ప నోట మాటకూడా రాలేదు. అతడి నలాగే నొక్కిపట్టి ఉంచి సోఫాలో పడేసి, తనమెడలో టైవిప్పి రెండుచేతులూ కట్టేశాడు చక్రవర్తి. నిస్సహాయ స్థితిలో నిప్పులు గ్రక్కే కండ్లతో చూస్తూ ఉండిపోయాడు రవీంద్ర.

జుట్టు సరిచేసుకొని, ముఖంమీది స్వేద బిందువులు తుడుచుకుంటూ, "చాలా అలిసిపోయావ్. మంచినీళ్ళేమైనా

కావాలా?" అని అడిగాడు చక్రవర్తి రవీంద్రను. ఆ మాటలకు రవీంద్ర లోలోన కొంచెం ఆశ్చర్యపోయాడు. ఇక తనను నోటికొచ్చినట్లల్లా తిట్టి కసితీర్చుకొంటాడనుకొన్న రవీంద్రకు ఏమాత్రం ఆగ్రహం లేని చక్రవర్తి స్వరం కొంచెం ఆశ్చర్యమే కలిగించింది.

మూల టీపాయ్ మీద కూజాలో నీళ్ళు గ్లాసులోపోసి రవీంద్ర నోటిదగ్గరగా పెట్టాడు చక్రవర్తి. మాట్లాడకుండా త్రాగాడు రవీంద్ర. తానూ త్రాగి ఒక సోఫాలో కూలబడ్డాడు చక్రవర్తి.

"చూడు రవీంద్రా. నువ్వింత తెలివి తక్కువ వాడవనీ, ఇంతటి నీచపు అనుమానాలు నీలో ఉండగలవనీ నే నేనాడూ అనుకోలేదు. ఇప్పుడా పిస్టల్ నాచేతిలో ఉంది. అంతెందుకు? ఏ సైనైడ్తో, ఆర్సెనిక్ ఇంజెక్షనో ఇచ్చి, సునాయాసంగా నిష్పంతంజేసి నాకు అడ్డు తీస్కోగలను. ఎవ్వరికీ అనుమానం రాదు. డాక్టర్ని-నాదగ్గర వైద్యంకోసం వచ్చి, రోగం తగ్గక చచ్చావనుకొంటారు. కాని నేనంత దుర్మార్గుణ్ణికాను. నాకసలు నీతో విరోధమే లేదు. నీతో ప్రేమగా, ఆదరంగా మెలగాలని నీ స్నేహం కోరానేగాని, దాని వెనుక నీచపు కోరిక లేవు." లేచి తలుపు తీసి "ఇలా రా నాతో" అన్నాడు చక్రవర్తి.

రవీంద్ర మాట్లాడలేదు. కదలలేదు. బోనులో సింహంలా ఉంది, అతడిస్థితి. "నీకేం ఫర్వాలేదు, రా. నీకు సంగతులు విపరంగా అర్థమయ్యేటట్లు చెప్పాలి. అదీగాక నీ విప్పుడు నాబందీవి. నేను చెప్పినట్లు చెయ్యాలి" అన్నాడు,

చక్రవర్తి పిస్టల్ గాలిలోకి ఎగరేసి పట్టుకొంటూ, మౌనంగా అనుసరించాడు రవీంద్ర.

వరండాలో ప్రవేశించి, రెండుగదులు దాటి, పడక గది లోకి తీసుకు వెళ్లాడు రవీంద్రను చక్రవర్తి. "ఇలాకూర్చో" అంటూ మంచం చూపించాడు. పరీక్షగా గదిని కలయ జూసిన రవీంద్ర, ఎదురుగా గోడనున్న "లైఫ్‌సైజు" ఫోటోలోని స్త్రీ స్వరూపాన్ని చూస్తూ కంటి రెప్పల కదల్చడంకూడా మరచి పోయాడు.

"ఎవరీమె?" అనడుగుతూ చక్రవర్తివైపు తిరిగాడు రవీంద్ర. చక్రవర్తి కనురెప్పలు తడిసి ఉన్నాయి.

ఒక నిట్టూర్పు విడిచి, "ఎవరను కొంటున్నావు?" అని అడిగాడు చక్రవర్తి.

"నా పెళ్ళిముందు వెదకిచూచిన పెళ్ళికూతుళ్ళలో ఈమె ఒకరు. సుధకదూ? కథలు వ్రాస్తుంది" తనశోకాన్ని మరచిపోయి కొంత కుతూహలంగానే అడిగాడు రవీంద్ర.

"అవును. ఎందుకు చేసుకోలేదు మరి?"

కొంచెం సేపాలోచించి రవీంద్ర. "నేను చేసుకోకపోవడం కాదు. ఆమె తండ్రికే నా ఆస్తి ఆనలేదు. తనకంటే ధనవంతులకి కిచ్చి పెళ్ళి చేయాలనుకొన్నాడట!" అన్నాడు.

"అవును. ఆ ఆత్యాసే అనర్థానికి దారితీసింది."

"ఇంతకూ ఎవరూ?" విసుగ్గా ప్రశ్నించాడు రవీంద్ర.

చక్రవర్తి తీరికగా సిగరెట్టు వెలిగించి కిటికీ నానుకుని నిచ్చున్నాడు. "సుధ నా చెల్లెలు. సాక్షాత్తు ఒక తండ్రి పెద్దలం.

నేను పుట్టగానే మా అమ్మ గతించింది. తల్లిని మ్రింగిన హీనుడను నాన్నగారు నన్ను అసహ్యించుకొని నా ముఖంచూచే వారు కాదుట. నౌకర్ల దయాధర్మభిక్షం, చిరాకు పరాకులతో పెరిగాను నేను. కాని చావలేదు. నాకు ఏడేండ్ల వయస్సున్నప్పుడు నాన్నగారు మళ్ళీ వివాహం చేసుకున్నారు. అంతకాలం నాన్నగారికి నా ముఖం కనుపించడానికీ, నామాట వినిపించడానికీ వీలులేదు. పినతల్లి వచ్చినప్పటినుంచీ యింట్లో స్వేచ్ఛగా తిరగడానికి, కావలసినవి అడగడానికి కూడా వీలులేక పోయేది. లక్షాధికారి కొడుకునై ఉండీ - కటిక దరిద్రుడి బిడ్డగా కూడా కాదు - బానిస పుత్రుడుగా పెరిగాను. పినతల్లి వచ్చిన దగ్గరనుంచీ నౌకర్లుకూడా నా ఆలన పాలనలు చూడటం మానుకొన్నారు. మాతామహుల యింటికి పంపితే ఈ లక్షాధికార్లకు అవమానం. అందువల్ల అక్కడే విదిలింపు, చీదరింపుల మధ్య పెరిగాను. ఇల్లు పాఠశాల తప్పితే ధనవంతుల బిడ్డ ఇతరులతో ఆడకూడదు. ఈ విపరీతమైన కట్టుడుల మధ్య, మాతృప్రేమకూ, పితృస్పర్శకూ దూరమైన నేను నా చుట్టూ ఒక ప్రత్యేక ప్రపంచం నిర్మించుకో సాగాను. ఎప్పుడూ పుస్తకాలకు అంటుకు పోయేవాణ్ణి. లేదా విశాలమైన ఆవరణలో పూలమొక్కల మధ్య తిరుగుతూ ఆనందించేవాణ్ణి. ఎందుకో తెలియకుండా ఒక్కొక్కప్పుడు పెల్లుబికి వచ్చే దుఃఖాన్ని ఉసిరిచెట్టు క్రింద వెళ్ళబోసుకొనేవాడిని.

"ఇటువంటి చెరసాల జీవితంలో సుధ కురిసింది. మాపిన తల్లి కూతురే సుధ. పిన్నికి, నాన్నగారికి నాపై ఎంత అస

హ్యామో, దానికి నాపై అంత అభిమానం. పిన్ని కొట్టినా సరే లెక్క-చేసేది కాదు. నన్ను చుట్టేసి కబుర్లు చెప్పేది. తినే వస్తువులు పెట్టేది. పుట్టిన దగ్గరనుంచి మా ప్రేమ కరువైన నాపాలిటికి సుధ నిజంగా సుధే అయ్యింది. మా నాన్నగారి ఒళ్ళో కూర్చుంటే ఏచాటునుండో చూచి, నాకంత అదృష్టం లేదే అని ఏడ్చేవాణ్ణి. సుధ అమ్మ సుధను ఆప్యాయంగా ఎత్తుకుంటే మాఅమ్మ లేదని బాధపడేవాణ్ణి. సుధను వెంట పెట్టుకొని, పిన్ని నాన్నగారు సినిమాలకూ షికార్లకూ తిరుగుతుంటే నేను నాగదిలో కూర్చుని కళ్ళు తుడుచుకునేవాణ్ణి.

“క్రమంగా పెద్దవాణ్ణవుతున్నాను. నాకంటె దురదృష్టవంతులను చూచి జాలిపడుతూ నా దుఃఖాన్ని మరచిపోతున్నాను. లోకజ్ఞానం కలుగుతోంది. ప్రతిక్లాసూ ఫస్టుమార్కులతో పాసవుతున్నాను. ఇంటర్ ఫస్టు క్లాసులో పాసయ్యాను. తర్వాత ఏం చదవాలి? వంశాంకురమనే అభిమానం ఏమూలైనా ఉండేదేమో, అడిగినంత డబ్బు పారేసేవారు నాన్నగారు. చదువు విషయంలోకూడా అభ్యంతర మేమీ లేదు. నాయిష్టమే. తీరిగ్గా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను. నేను పుట్టినప్పుడు మా అమ్మ పట్నంనుంచి డాక్టరు వచ్చేలోగా కళ్ళు మూసిందని విన్నాను. నేను గనుక డాక్టరై వచ్చి ప్రాక్టీసుచేస్తే ఆ పల్లెటూళ్ళో వీలైనంతవరకూ నాబోటి దౌర్భాగ్యులుండకుండా చేయవచ్చనే సంకల్పంతో మెడిసిన్ లో చేరాను. చేరిన దగ్గర్నుంచీ మెరిట్ స్కాలర్ షిప్ లన్నీ

నావే. సెలవుల్లోకూడా ప్రాక్టికల్స్ అవి చేస్తూ వాస్పిటల్లోనే ఉండిపోయేవాడిని. ఇంటికివెళ్తే అది సుధను చూడడానికి మాత్రమే.

"క్రమంగా ప్రపంచమంటే ఏమిటో తెలుస్తూంది. నాకు తెలిసిన కొద్దిపాటి చెడ్డతనమే కాదు, ఈ సంఘంలో చెడుతోబాటే దైవతుల్యులైన ఉత్తములుకూడా ఉన్నారని తెలుసుకున్నాను. పిన్ని సొన్నల కఠినమైన అదుపాజ్ఞల నుంచి వెలువడి స్వేచ్ఛగా ఉండి చదువుకొంటున్న నాకు, స్నేహితులే లేని నాకు అనేకమంది స్నేహితులయ్యారు. అటువంటి వారిలో మాక్లాస్‌మేట్ శ్రీదేవి ఒకతె. మెడికల్ విద్యార్థులం గనుక లేడీ స్టూడెంట్సుకూ, మాకూ, మధ్య అడ్డుగోడ ఉండేది కాదు. కలిసి మెలిసి ఉండేవాళ్ళం. అందంగా వుండి, ఛలాకీగా తిరుగుతూ, మృదుమధురంగా పాడే శ్రీదేవి త్వరలోనే నా హృదయానికి దగ్గరైంది. ప్రతి సాయంత్రం వూరి చివర కొలను గట్టుకు షికారు వెళ్ళేవాళ్ళం. అక్కడ ఆమె గాయకి; నేను శ్రోతను. తల్లిప్రేమా, కుటుంబంలోని ఆహ్లాదం, ఆప్యాయతా ఎరుగని నేను, శరత్కాంతివంటి స్వచ్ఛమైన శ్రీదేవి ప్రేమలో, మనస్సు నావరించిన మాలిన్యాన్ని కడిగివేసే ఆమె మృదుమధుర గానంలో సర్వం మరచిపోయేవాడిని. క్రమంగా ఆమె సాహచర్యంలో నేను సంగీతం నేర్చాను. సంగీతంలో విషాదానందాలు ప్రక్క ప్రక్కల్నే ఉంటాయి జీవితంలో కష్టసుఖాలులాగే – అనేది శ్రీదేవి తరుచు తిరిగి మాధవి

కూడా ఆ అభిప్రాయమే వెలిబుచ్చిననాడు, శ్రీదేవిని తలచు కొని నే ననుభవించిన బాధ వర్ణనాతీతం.

"ఎం. బి. బి. ఎస్. ఫైనలియర్‌లోనికి వచ్చాను. పల్లె జనులకు చికిత్స చేయాలనే నా ఆశయం నెరవేరే దినం దగ్గర పడిందని ఎంతో ఉత్సాహంగా చదివే వాణ్ణి. నా ఆశయం విన్న శ్రీదేవి కూడా ఎంతో సంతోషించింది. జీవిత సహ చారిణిఅయి, నాకు చేదోడు వాదోడుగా ఉంటానని వాగ్దానం చేసింది. కాని రవీంద్రా - ఒకటి - మేమెన్ని నిర్ణయాలను చేసు కొన్నా ఎప్పుడూ హద్దును మాత్రం మీరలేదు. ఆమె గాయకి, నేను శ్రోతను. ఆమె సంగీతపు గురువు. నేను శిష్యుణ్ణి. ఆమె సౌందర్యనిధి, నేను ఆరాధకుణ్ణి. ఇద్దరం సహాధ్యా యులం. అంతే.

"త్వరలో మధుర జీవనంకోసం కలలు కంటున్న నాకు ఒకరోజు హఠాత్తుగా యింటి దగ్గర్నుంచి వైర్ వచ్చింది— 'అర్జంటుగా రమ్మని. ఎవరికైనా అనారోగ్యంగా ఉందేమో ననుకొని వెంటనే బయల్దేరాను, శ్రీదేవితో కూడ చెప్పకుండా. కానీ నేననుకొన్న దొకటి జరిగింది మరొకటి. క్లుప్తంగా చెప్పాలంటే నాన్నగారి అధికారపు పందిరికింద, దూషణ బాణాలతో, పిన్ని సాధింపుల మంత్రాలతో, బలవంతంగా నిర్మల మెడలో తాళిగట్టి తిరిగి ఏడవనాటికల్లా ఆమెతో పట్నం చేరాను. శ్రీదేవికి ముఖం చూపలేక పోయాను. మనస్సును సమాధాన పరచుకోలేక పోయాను.

"కాని శ్రీదేవి కించిత్తుకూడా కోపం ప్రదర్శించలేదు. అంతా చిరునవ్వుతో విన్నది. 'మనం ఎంత అభివృద్ధి సాధించినా భగవంతుని చేతిలో కీలుబొమ్మలం. ఎన్నో కావాలనుకొంటాం. కాని, అందేవి బహుతక్కువ. పసిపిల్లలు ఎన్నో అడుగుతారు. అయినా మంచి చెడ్డలు యోచించి అవసరమైనవి మాత్రమే ఇస్తాము. అలాగే దేవుడుగూడా మనకు ఏది ఉచితమో అదే యిస్తాడు. మన కోరికలు తీరనంత మాత్రాన బాధపడి విధాతను నిందించకూడదు. కలిసి ఒక మంచి పని చేద్దామనుకొన్నాం. కలియిక దూరమైంది. పోనీ ఆశయాన్నైనా సాధిద్దాం. ఇలా విడిగా ఉండే బీదలకు సేవచేద్దాం' అంటూ ఎదురు నన్నే ఓదార్చింది. 'ఈమెకు బాధలేదా?' అనుకొని ఆశ్చర్యపోయిన నేను, ఆమె జీవితాంతం అవివాహితగానే ఉండిపోతానని చేసుకున్న నిర్ణయం విన్నాక, ఎంతటి దహించివేసిన బాధా ఫలితమో ఆ నిర్ణయమని చలించిపోయాను ఎంతటి అపకారికైనా కోపం తెచ్చుకోని నాయీ తత్వం, ఆనాడు శ్రీదేవిదగ్గర పొందిన భిక్షే. మనశ్శాంతిలేని నా దయనీయస్థితిని విని ఒక స్నేహితుడు తన తండ్రి అధికారమంతా ఉపయోగించి నాకు ఫారిన్ స్కాలర్‌షిప్ ఏర్పాటు చేయించాడు. విదేశాలకు వెళ్లుతున్నానని తెలిసి నిర్మల ఏమీ మాట్లాడలేదు. నాకేమీ హెచ్చరికలు చేయలేదు. కూడా వస్తాననలేదు. ఎవరోపరాయివాడు, ఏమయినా మనకక్కరలేనటువంటిది ఆమె ప్రవర్తన, నావిషయంలో.

"విమానాశ్రయంలో నా అనే వారెవరూ వీడ్కో లివ్వకుండానే విదేశాలకు బయల్దేరాను. లేకపోతే ఏ బాధా లేదు" ఉండి లేకపోవడమనేది ఎంత బాధాకరమో ఆలోచించు రవీంద్రా.

"క్రమంగా నా హృదయం ఆరోగ్యం కోలుకో మొదలు పెట్టింది. నాకు జన్మనిచ్చిన పుణ్యమూర్తి - కోరికలు తీర్చ లేక పోయినా సరే తండ్రిపై ఆగ్రహం కూడదనుకున్నాను. భగవ త్ప్రసాదమైన భార్యనే నా కనుగుణంగా తీర్చిదిద్దు కొందా మనుకొంటూ, కొంగ్రొత్త ఆశలతో హృదయంనిండా ప్రేమ నింపుకొని వచ్చాను. కాని విసిరిన బంతి తిరిగివచ్చి బలంగా తగిలి గాయపరిచి నట్లయింది నా బ్రతుకు. రూపాయణాలోనే కాని నన్ను కొలవలేని నిర్మలవద్ద నే నాశించే ప్రేమాభి మానలలో వెయ్యోవంతుకూడా పొందలేకపోయాను. ఆమె లోకం ఆమెది. నా బాధ నాది.

"చెల్లెలు సుధ మాత్రం ఆప్యాయంగా ఆదరించింది. అమెరికానుండి వచ్చేటప్పుడు ఆమె కోసమని రకరగాల గౌన్లు కొనుక్కు వచ్చిన నేను, ఊహించలేనంతగా పదహారేండ్ల పడు చుగా మారిపోయిన సుధను చూచి ఆశ్చర్యపోయాను. ఎంత అందమైన స్త్రీకైనా ఏదో లోపం ఉంటుంది. కాని అన్ని అందాలూ పుణికి పుచ్చుకుని సాక్షాత్తు లక్ష్మీదేవిలా కళకళలాడే సుధనుచూచి మురిసిపోయాను. "అన్నయ్యా" అని అమృతం చిలుకుతూ కబుర్లు చెప్తూంటే మా అమ్మ ఇలాగే ఉండేదేమో

ననిపించి కళ్ళు చెమర్చేవి. ఆమె శ్రావ్యమైన గొంతెత్తి పాడుతూంటే గంధర్వులే దిగివస్తారా? అనిపించేది. అలాంటి చెల్లెలు మూఢ నమ్మకాలతో చదువు సంధ్యలు లేకుండా ఆ పల్లెలోనే పడి ఉండటం నాకు బాధ కలిగించింది. ఎన్నడూ లేనిది ఒకనాడు నాన్నగారి ఎదుటబడి ఎక్కడలేని ధైర్యంతో వాదించాను. నాన్నగారు మొదట ఆశ్చర్యపోయారు నా చొరవకు. తర్వాత తర్వాత ఆయనకు నాపట్ల ఉదాసీనత మెల్ల మెల్లగా తగ్గ నారంభించింది. నన్నొక మనిషిని చూచినట్లు చూడటం మొదలు పెట్టారు. నా భావాలతో పూర్తిగా అంగీకరించలేదు కాని, సుధకు ఒక ఆంగ్లో ఇండియన్ యువతిని ఏర్పాటు చేసి ఇంటిదగ్గరే చదువు చెప్పించటానికిమాత్రం అంగీకరించారు. సుధకు చదువు చెప్పడం, చెప్పించడం నామ మాత్రమే అయ్యాయి. ఊహము మాత్రానికే నేలనుండి వికసించే చెంగల్వవలె, పిలుపు మాత్రానికే ఆమెలో అంతర్లీనమై ఉన్న సరస్వతీ అంశ మేల్కొంది. ఏడాది తిరిగి వచ్చేటప్పటికే ఆమె పెద్ద పెద్ద ఇంగ్లీషు గ్రంథాలు చదివేసి అందులోని పాత్రల గురించి నాతో పెద్ద ఆరిందా లాగ చర్చిస్తూంటే నేను ఆనందాశ్చర్యాలతో ఉక్కిరి బిక్కిరి అయ్యేవాడిని.

“ఒకనాడు సుధ నా దగ్గరకువచ్చి ‘అన్నయ్యా, నీకు చెప్పకుండా ఒక పని చేశాను. ఏమీ అనుకోకు’ అంది బెదురుగా. ‘ఏమిటో చెప్పు’ మన్నాను దగ్గరకు తీసుకొంటూ. ఒక పత్రిక తెరచి అందులో ఒక కథ చూపించింది. ఆనాడు నేను

పడిన గర్వం అంతా ఇంతా కాదు. ఆ కథా రచయిత్రి సుధారాణి!

"ఇందుకు నేను గర్వపడుతున్నాను, సుధా!" అన్నాను.

"ఏమో, అప్పు ఒకటే సాధిస్తూంది. ఆడదానికి చదువే అనర్థమట! నాకు పెళ్ళి కాదట!" అంది కన్నీళ్ళు తుడుచు కుంటూ.

"అవన్నీ పాతపద్ధతులనీ ఇప్పుడు విద్యాలేనిది విలువ లేదని నచ్చజెప్పి, లాలించి, తిరిగి మామూలు మనిషిని చేశాను క్రమంగా నా ప్రోత్సాహంతో అనేక కథలు వ్రాసి మంచి పేరు గడించింది సుధారాణి.

క్రమంగా నాన్నగారు సుధకు పెళ్ళి సంబంధాలు వెతకడం ప్రారంభించారు. మా కంటే ధనవంతుడికోసం, జమీందారు బిడ్డకోసం ఆయన చూస్తున్నారు. ఒకనాడు సుధను బుజ్జగించి దాని అభిప్రాయం అడిగాను. అత్తరాలా నా ఉద్దేశ్యాలే దానివీని. అట్టే ధనం లేకపోయినా మహా సౌందర్యవంతుడూ, విద్యావంతుడూ, ముఖ్యంగా సంస్కార హృదయం కలవాడూ అయిన నా మిత్రుడొకడు బొంబా యిలో ఒక పెద్ద కంపెనీ డైరెక్టరుగా ఉన్నాడు. సెలవుల్లో అతడిని సరదాగా పిలిచినట్లు రప్పించి నాన్నగారికి చూపిం చాను. మొదట్లో మండిపడ్డా క్రమంగా అర్థంచేసుకొన్నారు

నాన్నగారు. 'డబ్బున్నవారికి మిగతా లక్షణాలన్నీ లేకపో వచ్చు. కావలసిన గుణాలన్నీ ఉన్న వాడిని తెచ్చుకొని, ధన లోపం మనం తీర్చకూడదా?' సూటిగా అడిగాను. అంగీక రించారు. సుధ మనస్ఫూర్తిగా సంతోషంగా అంగీకరించింది.

"కోరిన దాంపత్యం, సౌఖ్యం నాకు లేకపోయినా నా చెల్లెలికి లభింపజేసినందుకు మనసారా తృప్తిపడ్డాను.

"సుధలాగే నిర్మలకు కూడా చదువూ సంగీతం నేర్పింప ప్రయత్నించాను. కాని అవి అందరకూ లభ్యమయ్యేవా? నేను ప్రయత్నించిన కొద్దీ ఆమె మూర్ఖత్వం అధికమై పోయింది. విసిగి ఆమె దారిని ఆమెను వదిలేశాను. ఒక్క విషయంలో కూడా నన్ను సంతృప్తి పరచాలనే కోరిక ఆమెకు లేదు. సంగీతానికి స్పందించే హృదయం, సాహిత్యానికి కదిలే భావం, ప్రేమను కోరి తపించే గుణం ఆమెలో లేవు. వెకిలి వేషభాషలు మాత్రం బోలెడు.

"ఇక నా ప్రాక్టీస్ సంగతి. 'ఏపట్టణంలోనైనా అయితే వేలకు వేలు ఆర్జించవచ్చు' అన్నారు నాన్నగారు. నాకు తెలుసు ఈ విషయంలో మాత్రం నాన్నగారు నన్నింత మాత్రం హర్షించరని, మెల్లగా నా ఆశయం బయటపెట్టాను. క్రమంగా 'చక్రవర్తి బాబు హస్తవాసి మంచిది' అనే మాట చుట్టుపట్ల పల్లెలన్నిటిలోనూ తరుచు వినబడసాగింది. ఎవ్వరినీ కచ్చి తంగా ఏమీ అడిగే వాడినికాదు. శక్త్యానుసారం — అందు లోనూ పల్లెటూరు కనుక వారికి కలిగినది — అనేక రూపా

లలో యిచ్చేవారు. మనసులోని తీరని అశాంతి తప్ప ఒక విధంగా మామూలుగా గడిచిపోతున్నాయి రోజులు.

"వెళ్ళిన క్రొత్తలో ఉత్సాహంగా, సంతోష పూరితంగా అనేక ఉత్తరాల వ్రాసే సుధదగ్గరి నుంచి రాను రాను ఉత్తరాలే కరువైపోయాయి. ఎప్పుడైనా వ్రాసినా అవి ముక్తసరిగా క్షేమ సమాచారాలు. క్రమంగా ఆమె రచనలు కూడా పత్రికలలోకన్పించడంలేదు. 'సంసారంలో పడింది'—" అని సరిపెట్టుకున్నారు పిన్ని, నాన్నగారూ. కాని నాకేదో మనసులో శంక తోచి, చూచివస్తానని బయల్దేరాను.

"అపురూప సౌందర్యవతి అయిన సుధ, కళలుతరిగి వాడివడిలి ఉండటం, ఎప్పుడూ నవ్వుతూ తుళ్ళుతూ, ఇల్లంతా ప్రతిధ్వనింపజేసే ఆమె నవ్వడంకూడా మర్చిపోవడం నన్ను కలచివేశాయి. ఎంత అడిగినా ఏమీ చెప్పలేదు. 'ఎల్లకాలం ఒకలాగే ఉంటామా? పెద్దదాన్నయ్యానుగా?' అని తప్పించుకొంది.

"ఇతరుల్ని గురించి తెలిసినంతగా మనకు మన అంతరాత్మగురించి, అతి సన్నిహితులను గురించి తెలియదేమో అనిపిస్తుంది. ఒకవారం ఉండేటప్పటికి ఎవరూ చెప్పనక్కర్లేకుండానే నా కన్నీ అర్థమయ్యాయి. అంతవరకు స్నేహితుడుగా, తోటి యువకుడుగా సరససల్లాపాలు మాత్రమే ఎరిగిన నాకు, సుధ భర్తలో అడుగడుగునా, ఇప్పుడు నాతో మాట్లాడేటప్పుడు ఇంటి అల్లుడి దర్పం దోబూచులాడటం

స్పష్టంగా కనిపించింది. పైకి కన్పట్టే విశాల సంస్కార భావాల మాటున, అతడిలో అంతర్లీనమైఉన్న రాగద్వేషాలు, అధమాధమ సంకుచిత హృదయం అవగతమయ్యాయి. సౌందర్యవతియైన భార్యపై అనుమానం, స్వేచ్ఛయిస్తే విద్యావతి తన పరిధులను దాటిపోగలదని భయం, పెద్దింటిపిల్ల తనను ఎక్కడ తేలికగా చూస్తుందోనని అడుగడుగునా అనుమానం— ఇవి సాధారణంగా ప్రతి పురుషుడిలోనూ ఉండేవే. వివాహ పూర్వం గగనకుసుమం; వివాహానంతరం తనదనే స్వార్థంతో ఆ కుసుమం విలువనుమరిచి పరిధులలో బంధించితే అది వాడిపోయి పరిమళం పోగొట్టుకుంటుంది. సుధ కథలను మెచ్చి ఎవరైనా అభినందించవస్తే అనుమానంగా నీచంగా మాట్లాడేవాడట భర్త. అందుకే అది ఆ విద్యకు స్వస్తి చెప్పింది. కాని ఆ వ్రాయడమనేది ఒక విచిత్రమైన అలవాటు. లోపల చెలరేగే భావాలకు బాహ్యాకృతి కల్పించకపోతే అది మెల్ల మెల్లగా మనిషినే దహించివేస్తుంది. అదే నా చెల్లెలి విషయంలోనూ జరిగింది. కొన్నాళ్ళు ఉంచుకొని పంపిస్తామని చెప్పి తీసుకొచ్చిన నేను ఆమెను తిరిగి భర్తవద్దకు పంపే అదృష్టం కోల్పోయాను.

"ఎదలో తీరని ఆ వేదన, శరీరంలో భయంకర క్షయగా రూపొంది నా చెల్లెల్ని తీసుకుపోయింది. ఇంత డాక్టరై ఉండీ, అనేక ప్రాణాలను నిలబెడుతూ, నా చెల్లెల్ని పట్టుకోలేకపోయాను. ఆ దుర్మార్గుడు మాత్రం మళ్ళీ పెళ్ళిచేసుకొని

హాయిగా ఉన్నాడు. మాధవి వ్రాసిన 'ఆరాధన' కథలోని నాయిక పాత్రధారిణి నా స్వంత చెల్లెలి ప్రతిబింబమై నన్ను కదిల్చివేసింది. కోరికలకూ, ఆశయాలకూ అనుగుణం కాని, ఆమె జీవితంలో అణగారిపోయిన ఆమె ప్రతిభ, నలిపివేయబడ్డ ఆమె జీవితం నా హృదయంపై చెరగని ముద్ర వేశాయి. సుధ మరణానికి నేనే కారణమని నిందించి నా ఆస్తి నాకు పంచి యిచ్చి, యింటినుండి తరిమివేశారు నాన్నగారు. ఈజన్మలో నా ముఖం చూడకూడదని ఆయన నియమం.

"సుధ మరణంతో నాలోని బలమంతా ఎవరో లాగివేసినంత నీరసం, నిస్పృహ ఆవరించాయి నన్ను. సుధను బోలిన గుణాలు మాధవిలో ఉండటంవల్ల, ఆమె ప్రతిభ నీ సాహచర్యంలో పద్మంలా వికసించడం నన్ను ముగ్ధుణ్ని చేశాయి. ఎందుకో సుధను తిరిగి చూచినంత సంతోషం కలిగేది నాకు. ఆవిడ కథలు సుధ వ్రాసినట్లే ఉండేవి. అందుకే మనసులో ఆమెపై మమత పెరిగింది. శ్రీధర్ 'మధూ మధూ' అని చెల్లెలికూడా తిరుగుతూంటే నా సుధ లేదని గుండె కలుక్కుమనేది.

"నా గుండెలో ప్రేమ పంచుకొనీ, నాకు శాంతినీ, తృప్తినీ యివ్వగలశక్తి నిర్మలకు లేదు. వయోవృద్ధుల ఆదరణాధిపత్యాలతో, లక్ష్మీదేవి వంటి ఇల్లాలి సాహచర్యంతో, శిశువుల ముగ్ధ విలాసాలతో, తోబుట్టువుల అప్యాయతలతో, నిండైన స్వచ్ఛమైన సంసారం సాగించాలనే నా కోరిక ఎండ

మావుల వెంట పరుగెత్తడమే అయింది. వృత్తిరీత్యా వెళ్ళిన చోట అటువంటి సమన్వయ పరిపూర్ణతగల సంసారం కనిపిస్తే మనస్సు కలుక్కుమనేది. అటువంటి బాధలో నన్ను నేను నిగ్రహించుకోలేని ఒక దినం నైట్ క్లబ్ లో అడుగు పెట్టాను. జీవితంలో దారితప్పి నడవ ప్రయత్నించడం అదే మొదటిసారి. బహుశా అదే కడసారి కూడా కావచ్చు. తప్పని తెలిసి, సర్వం మరచిపోయి కొద్ది గంటలైనా ఆనందంగా గడుపుదామని వెళ్ళిన నాకు అక్కడ ఆ కృత్రిమ, తాత్కాలికానందంకూడా లభించకుండా చేశాడు దైవం. క్షణికావేశంతో పతనమై పోబో యిన నన్ను పట్టి కాపాడిన ఆ సంఘటన ఒకటి గుర్తుకు వచ్చి నప్పుడెల్లా రంపపు కోత పెడుతుంది.

"పది పన్నెండేండ్ల వయస్సులో మాయింటిప్రక్క ఉండే వారి అమ్మాయి రాధ అంతర్థానమై పోయింది. ఒకరోజు స్కూలుకు వెళ్ళి తిరిగిరాలేదు. ఎంత ప్రయత్నించినా జాడ లేదు. చచ్చిపోయిందనుకున్నారు అందరూను. ఆ రాధే నాకు పాతి కేండ్ల యువతిగా, మానవునికి సుఖాన్నిచ్చే యంత్రంగా దర్శన మిచ్చింది. కష్టాలను మరచిపోయి, సుఖం జుర్రుకొందామని వెళ్ళిన నేను నాకంటే కష్ట-నీచ భూయిష్టమైన కన్నీటి గాథను వినవలసి వచ్చింది. 'ఎత్తుకు వచ్చిన బైరాగి వాడి దగ్గర, వీళ్ళు రెండు వేలకు కొన్నారు నన్ను. ఒక విధంగా బానిసను – ఈ నీచపు బ్రతుకు బ్రతకలేక అనేకసార్లు ప్రాణం తీసుకోబోయాను. కాని నా ప్రాణం మొండిది. ఇక ఆ ప్రయత్నం మాని మొండిగా

బ్రతుకుతున్నాను. మావాళ్లు నేను చచ్చిపోయాననుకుంటు న్నారని చెప్పావు. చక్రవర్తీ! రెండే రెండు కోర్కెలు – ఆ ముసలితల్లి తండ్రుల నలానే భావించనీ. అందులో ఒకతృప్తీ, సంతోషమూ ఉంటాయి. ఈ నీచపు బ్రతుకును గురించి వింటే బాధపడతారు. అయినా కుక్కముట్టిన కుండకి ప్రాయశ్చిత్త మేమిటి ? ఎవరికి కావాలి ? రెండోసంగతి — మళ్ళీ జన్మలో ఎప్పుడూ ఇటువంటిచోట్ల అడుగెట్టకు. నిన్ను నువ్వే నాశనం చేసుకోకు. నీలాటి వాళ్ళకోసమేకదా నాలాటి వాళ్ళిలా అధో గతి పాలవుతున్నారు !” అన్నదామె.

“తప్పనిసరిగా ఆ రెండు ప్రమాణాలుచేసి బరువెక్కిన గుండెలతో బయట పడ్డాను. ‘పురుషుడుచేసినా, స్త్రీ చేసినా, సంఘం చేసినా ఆడదానికే కదా అన్యాయం ? మార్గముండీ ఆ పాపకూపంనుంచి బయటపడ్డ పురుషుడు ఛాతీవిరుచుకు తిరుగు తాడు. కాని అదే ఆడదైతే కుక్కముట్టిన కుండ ! భగవాన్, ఎందుకీ నుస్నిత జన్మలు !’ అని కుమిలి పోయాను.

“ఇది నీ కెందుకు చెబుతున్నాననే అనుమానం రావచ్చు. స్త్రీ ఎటువంటిదైనా సరే, నేను అగౌరవపరచలేను. హీనంగా ఊహించనైనా ఊహించలేను. వీలైనంతవరకూ ఓర్పుగా పరిస్థితులతో సమన్వయించుకుపోయే ఆ జాతిపై నాకు ఎంత అభిమానమో నీకు తెలియడానికే చెప్పాను. నన్నర్థం చేసుకో. రవీంద్రా. నేనేపాపమూ ఎరుగను. కాని నా మనసు అర్థ మైనది. ఒకరోగి చచ్చిపోయినా నాకు దుఃఖం కలుగుతుంది. అదే ఇన్ని అనర్థాలకు మూలమవుతూంది. పుట్టినప్పటినుంచీ

అన్ని ప్రేమలకూ కరువైన నేను కనీసం సంతానంపై వాత్సల్యంతోనైనా తృప్తిపడుదునేమో ! కాని భగవంతుడు నన్నా ప్రేమకుకూడా దూరం చేశాడు. అయిదేళ్ళ వైవాహిక జీవితంలో సంతాన సఫలతే లేకపోయింది. కర్మసిద్ధాంతమే నిజమైతే, నేను క్రితం జన్మలో చాలా పాపాత్ముడనై ఉండాలి. ప్రేమతో, అభిమానంతో, వాత్సల్యంతో పరుగులెత్తే హృదయ జలధిలోని ఈ అనురాగ స్రవంతిని ఎటూ పోకుండా బంధించి, ఆశాకిడిని, విషాదాన్ని మోయడం, ఎంత కష్టమో, రవీంద్రా, ఆలోచించగలవా ? పరుగులెత్తి పారే ఏటికి అడ్డుకట్టలు కడితే బద్దలైపోవా, అయినా ఎంతటి విషాదమైనా మోయగలిగాను. నే నాశించిన కొందరినుండి నాకు ప్రేమ లభ్యమవనంత మాత్రానే నాలో ఆశ, అనురాగం నశించలేదు. నిరీక్షణే కర్తవ్యమనుకున్నాను. నా ప్రేమ సౌహార్ద్రాలకు మన్నన, ప్రతిఫలం ఎప్పుడో ఎక్కడినుండో లభిస్తాయన్న ఆశతోనే ఎదురు చూస్తూ వచ్చాను. నా హృదయంలోని అనురాగావేశాలను పూలతోటలవైపు, సంగీతంవైపు, డాక్టరుగా నాకర్తవ్య నిర్వహణ వైపు మళ్ళించాను. కాని ఈ తపస్సులోకూడా నాకు శాంతి, క్రాంతి లభించలేదు. సంఘటనలు వూహాలకు, ఉద్దేశ్యాలకు అతీతంగా జరిగిపోతున్నాయి. నాకు మానవత్వంలోనే మమత నశిస్తున్నది. హాహాకారి మృత్యుదేవతతో రాత్రింబవళ్ళు పోరి ప్రాణాలు నిలబడితే ఒక మంచి మాటైనా రాదు, చాలామంది

నోటినుంచి. కర్మవశాత్తు ప్రాణంపోతే, నీవు సరిగా చేయలేనపడాని కే మాత్రమూ జంకరు. ఇటువంటి జన్మ ఎందుకిచ్చాడో భగవంతుడు ! ప్రేమ ఉన్నకొద్దీ బాధలెక్కువవుతాయి.

"అర్థమవుతుందా, రవీంద్రా ! రక్తస్పర్శగల ఒక వ్యక్తి సద్గుణాలు, ప్రేమాంకురం వేసిన ఒక స్త్రీలోగల సౌమ్యాచరణాభిమానాలు మిళితమై మాధవిలో కన్పించి తిరిగి నన్ను పాత స్మృతులలోనికి లాక్కెళ్ళాయి. అనుబంధాలనేవి చాలవిచిత్రమైనవి. వాటికి శారీరక వాంఛ, రక్తస్పర్శలే ఆధారం కానక్కరలేదు ఏనాటి గతానికో వర్తమానంతో కనుపించని లంకెపడి, అనిర్వచనీయమైన అనుబంధంగా రూపొందుతుంది. చెల్లెలి మరణంతో, సంతాన లోపంతో శూన్యమైన నా వాత్సల్యస్థానం చెల్లెల్ని బోలిన మాధవిని చూడగానే ఊరూతలూగి నిండిపోవడం మొదలెట్టింది. హృదయాలను స్పందింపజేసే మహత్తరానుభూతి ఫలితంగా ఏర్పడే యీ అసాధారణానుబంధానికి ఒక బాహ్యరూపం, నామం, ప్రయోజనం సృష్టించలేము. కాని, రవీంద్రా, ఒక్కమాట. మాధవి రూపలావణ్యం, గాన మాధుర్యం, భావగాంభీర్యం నన్ను ముగ్ధుణ్ని చేసి చేయెత్తి నమస్కరింపజేశాయేకాని, నాలో ఏ నీచ కోర్కెనూ రేపలేదు.

"వూరికి వెళ్తూ నీవు, ఒక బాధ్యత అప్పజెప్పావు. అంతకు ముందే శ్రీధర్ మనసంబంధం తెలియజెప్పాడు. ఈ అన్నిటికీ ప్రథమంలోనే మాధవిపై నా హృదయంలో ఒక అనుబంధం ఏర్పడింది. ఈ సంబంధ, అనుబంధ, బాధ్యతలు మూడుయేకమై

సమయా సమయాలు, ఉచితానుచితాలు ఆలోచించకుండా, ఒంటరిగా వున్న మాధవికి ఏదో ప్రమాదాన్ని శంకించి, ఆ రాత్రి నేను మీ యింటికి రావడానికి కారణమైనాయి.

“నీ విసుగుదలను నేను ప్రయాణ బడలికగా అర్థం చేసుకున్నాను. ఆ మర్నాడు ఉదయం వస్తే ఇంట్లో వున్నా, లేవని చెప్పింది మాధవి. కాంపౌండులో మోటారు సైకిలు చూచి కని పెట్టాను నేనా సంగతి. అదినాకు తెలియదనుకొంది మాధవి. అప్పుడే నా కేదో అనుమానం తోచింది కాని, అది ఇంత నీచమైన కారణమని వూహించలేక పోయాను. మరొకసారి వచ్చాను. నువ్వింట్లో లేవు. మాధవి ఉండీ లేదనిపించింది. చాలా సేపటికి నేను వెళ్ళిపోయాననుకొని బయటకు వచ్చేసరికి తలకు కట్టుతో, నీరసంగా కన్పించింది. నాతో మాట్లాడకుండా మరో గదిలోకి వెళ్ళిపోయింది రోదిస్తూ. నీవు మేడమీదున్నా వేమో నని పైకివెళ్ళాను. నీవు లేకపోగా అక్కడ నన్ను కలచివేసే దృశ్యం కంటబడింది. మాధవి రీడింగు రూమ్‌లో టేబుల్‌పై వ్రాస్తూ వ్రాస్తూ వదిలేసినట్టున్న డైరీ, నేలమీద ఉత్తరం, పగిలిన గాజులు నా కేదో అనుమానం కలిగించగా మొదలకుండా ఉత్తరం డైరీ జేబులో పెట్టుకువచ్చాను. విషయాలు తెలిసి నిర్ఘాంతపోయాను. పరిష్కారమార్గం తెలియక కొట్టుమిట్టాడి పోయాను. అనుమానం తోచి నిర్మలను గట్టిగా నిలదీసి అడిగాను. వ్రాశానని ఒప్పుకుంది. అనుమానమున్న పురుషుడవు నీవు. అనూయగల స్త్రీ ఆమె. ఇద్దరివల్లా ఏ పాపమూ ఎరుగని

మాధవి నెత్తిపై కళంకముద్ర పడింది. నిర్మలకు తెలుసు, నాకూ మాధవికీ మధ్య అభిమానంతప్ప మరే సంబంధమూ లేదని. అయినా అసూయాజాడ్యం ఆవరించిందామెను. విద్యాసంస్కారా లెరుగని ఆమె సంకుచిత స్త్రీ హృదయం, తోటి స్త్రీ అయిన మాధవిని అందరూ, ముఖ్యంగా తన భర్త అంత గౌరవంగా చూడడం భరించలేకపోయింది. ఆమె తత్వం ఎటువంటిదంటే నాస్వంత చెల్లెలైన సుధ ఫోటోను—జీవంలేని ఆ ఫోటోను—అలా అభిమానంగా చూచుకోవటం సహించలేక అనుక్షణం సాధిస్తుంది. ఇక పరాయి స్త్రీని సహించగలదా? నీకు క్షమాపణ చెప్పుకోమనీ, చేసిన తప్పును చెప్పేయమనీ ఎన్నోరకాలుగా బోధించాను. వినలేదు. నేనే నీకు స్వయంగా చెబుదామని వచ్చాను. కాని, అప్పుడు మీా ఇంట్లో ఎవరో ఒకావిడ ఉంది. నీవు ఇంట్లో ఉండగానే లేవనిచెప్పి సాగనంపింది మరోసారివస్తే చెప్పడానికి నువ్వు అవకాశమివ్వలేదు. ఇవన్నీ ఉత్తరంద్వారా నీకు తెలియపరుచుదామనుకున్నాను. కానీ నువ్వు ఓర్పుగా చదువుతావనే ఆశలేదు. అందుచేత కేవలంభగవంతునిపై భారంవేసి, నీలో పరివర్తనకై ఎదురుచూస్తున్నాను."

చెప్పటం ముగించి బరువుగా నిట్టూర్చాడు చక్రవర్తి. రవీంద్ర అలాగే వింటూ కూర్చున్నాడు.

"ఈ ఉత్తరం చూడు. శ్రీధర్ వ్రాశాడు" అలమారలోంచి తీసి చదివాడు చక్రవర్తి.

"డియర్ చక్రవర్తీ,

"క్షేమం. ఈ ఉత్తరం ఎంత గర్వంగా వ్రాస్తున్నాననుకొన్నావు! నా ఉద్యోగానికి రాజీనామా యిచ్చాను. ఎందుకో చదువు. నీకే తెలుస్తుంది.

"ఈమధ్య మాధవి నగలూ అవీ ఎత్తుకుపోయిన మనిషి ఇక్కడ పట్టుబడింది. రవీంద్ర ఆ రిపోర్టు ఉపసంహరించుకొన్నాడట. అందుచేత మాధవి నగలు గుర్తుపట్టి క్లెయిమ్ చేస్తే కేసుపెట్టి నగలు రాబడదామని ప్రయత్నించాను. కాని మాధవి సమాధానం విను.

"నేను దాని ముఖం చూడను. దాని ఒంటిమీదున్న నగలు తీసుకోను. కాని, ఆమెను మాత్రం శిక్షించవద్దు. నీతిగా బ్రతకమని బోధించన్నయ్యా. అటువంటి స్త్రీలంటే నాకు జాలి, అంది. నిజంగా ఆశ్చర్యపోయాను, చక్రవర్తీ. నాకు అత్యంత ఆత్మీయురాలైన చెల్లెల్ని ఇంతకాలం నేనే గుర్తించ లేదంటే క్రొత్తగా వివాహమాడిన రవీంద్ర అర్థం చేసుకోకపోవడంలో ఆశ్చర్యమేముంది?

"నా బోధలు, మాధవి మాటలు విన్న ఆపిల్ల ఆక్షణంలోనే మారిపోయింది. 'నాకీ నగలు వద్దు. తీసుకోండి. ఎక్కడైనా చాకిరీచేసుకొని బ్రతుకుతాను. నన్నీ తప్పుడు మార్గములో కీడ్చిన తల్లి ముఖంకూడా చూడలేను' అంటూ ఏడ్చింది. అప్పుడు నేను ఆమెనొక అనాధాశ్రమంలో జేర్చి,

ఆ నగలు అమ్మిన డబ్బు, ఆఆశ్రమానికే విరాళంగాయిచ్చాను. కాని, చక్రవర్తి నాలో ఎంత తపన బయలుదేరిందో నువ్వే అర్థం చేసుకోగలవు. మాధవి నాకు చెల్లెలు కాదు; జ్ఞాన మార్గం చూపిన తల్లి, నేరాలు చేశారన్న కోపంతో అనేక మందిని కఠినంగా బాధించడమే కాని, ఏ పరిస్థితులలో వారా తప్పులు చేసిఉంటారో అన్న ఆలోచన ఎప్పుడూ చేయనందుకు నేను చాలా సిగ్గుపడుతున్నాను. ఇక ఆ ఉద్యోగం చేయలేక రాజీనామా యిచ్చాను. నేను బి. ఎల్. ప్యాసయ్యాను కదా ? న్యాయవాద వృత్తిలో నీతికి నిలబడి ప్రజాసేవ చేద్దామనుకుంటు న్నాను. నీ అభిప్రాయము తెల్పుతావుకదూ!

నీ శ్రీధర్"

చదవడం ముగించి చక్రవర్తి మెల్లగా రవీంద్రను సమీపించి అతడి చేతి బంధం విప్పేశాడు.

"క్షమించు, బావా, ఇంతవరకు నిన్నిలా కూర్చోబెట్టినందుకు, కేవలం నేను చెప్ప దలచుకొన్నది చెప్పడానికి అవకాశం కల్పించుకోవడానికే యిలా చేశాను కాని, ప్రాణాలపై ఆశతో మాత్రం కాదు, నేనేమైనా, నాకోసం యేడ్చేవాళ్ళు మాత్రం లేరు. నీ అభీష్టం అదేఅయితే—నేను డాక్టర్ని, అన్ని విషాలూ నాకందుబాటులో ఉంటాయి–నీకు శ్రమ యివ్వను, నేనే అడ్డు తొలగిపోతాను. లేదా, ఇదిగో నీ పిస్టల్. నీచేత్తోనే చంపాలని కోరికగా ఉంటే—కానీయ్. కాని భగవత్సాక్షిగా

నేను చెప్పినదాంట్లో ఎక్కడా అసత్యంలేదు. మాధవికిమాత్రం కళంకం ఆపాదింపకు."

గుండెలమీద చొక్కా తొలగించి కళ్ళు మూసుకు నిలబడ్డాడు. చక్రవర్తి. ఎంతవరకు రవీంద్ర పిస్టల్ ప్రేల్చక పోవడంతో కళ్ళు తెరచి చూచాడు.

అక్కడ రవీంద్ర లేడు!

## ౪౦

హోరున వాన కురుస్తూంది. హాస్పిటల్ కాంపౌండులోఆగిన టాక్సీలోనుంచి మాసిన తడిసినబట్టలతో ఒకయువకుడు దిగి ఆత్రుతగా ఏడవ నంబరు గది దగ్గరకు పరుగెట్టాడు.

మనుష్యులున్నా వాతావరణం నిశ్శబ్దంగా ఉంది ఆ గదిలో. అందరి ముఖాలు ఆత్రం, భయం, ఆందోళన వ్యక్త పరుస్తున్నాయి. అలికిడి విని తలెత్తిన శ్రీధర్ సంతోషంతో, ఆశ్చర్యంతో లేచి ఎదురేగాడు. "వచ్చావా, రవీంద్రా?"

"వచ్చాను, శ్రీధర్. ఏదీ నా మాధవి?"

శ్రీధర్ ముఖంలో ఒక్క తిరస్కార వీచిక చెలరేగి మాయమైంది. మౌనంగా మంచంవేపు దారితీశాడు. అచేతనంగా పడి ఉంది మాధవి. మూసిన కండ్లపై అలవూ, నీరసం స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"మాధవీ!" వెర్రికేక వేసి దగ్గరగా పరుగెట్టాడు. సెలైన్ ఎక్కిస్తూన్న శ్రీదేవి ఒక్కసారి తలెత్తిచూచింది. శ్రీదేవి మెల్లగా లేచి రవీంద్రను సమీపించి, "కండిషన్ సీరియస్‌గా ఉంది. ఇక్కడ ఆవేశాలు పనికిరావు. మిస్టర్" అంది.

బొటబొట కన్నీరు కార్చాడు రవీంద్ర. "వీల్లేదు, డాక్టర్. నా మాధవి బ్రతకాలి. నేను క్షమాపణ చెప్పుకోవాలి. బ్రతికించాలి, డాక్టర్". శ్రీదేవి చేతులుపట్టుకొని పసిపిల్లవాడిలా ఏడ్చాడు.

గంభీరంగాఅంది శ్రీదేవి: "శాయశక్తులా ప్రయత్నిస్తాను. సఫలం అవుతుందనే ఆశిస్తున్నాను. మీరు మాత్రం శాంతించడం అవసరం. కాని, ఒక్క మాట చెబుతున్నాను, వినండి. విద్యావంతులం, వివేకవంతులం — పరిస్థితులకు వివశులం కాకూడదు. తొందరపాటులో తెచ్చుకున్న కష్టాలు త్వరగా పోవు. మనసులు తిరిగి మనుష్యులు దూరమైనాక, మమతలు చిగురించే ప్రయోజనముండదు. రండి, మీఅబ్బాయినిచూద్దురుగాని, ప్రక్కగదిలో ఉంచాం."

మూగగా అనుసరించాడు రవీంద్ర.

ఒక హాలు పొడవునా స్టాండు ఉయ్యాలలలో ఉంచబడ్డారు పాప పుణ్యా లెరుగని పసిబిడ్డలు.

"ఇదుగో, మీ బిడ్డ" బంగారు ఛాయతో, గులాబి బుగ్గలతో, గుప్పిళ్ళు మూసి నిద్రపోతూ నవ్వుతున్నాడు, అమా

యకంగా. దేవునితో నేమో! ముట్టుకుంటే కందిపోయే టట్టు న్నాడు.

"మాధవి అందం, మీ పసిమి పంచుకున్నాడు" అంది శ్రీదేవి, రవీంద్ర చేతులలో ఉంచబోతూ.

చేతులు త్వరగా వెనక్కు తీసుకున్నాడు రవీంద్ర. శ్రీదేవి విసుబోయింది.

"మాధవి క్షమతో కాని నామాలిన్యం కడుక్కుపోదు. అంతవరకు ఈ పవిత్ర స్వరూపాన్ని అంటే యోగ్యత లేదు." గిరుక్కున వెనుదిరిగి మాధవి గదిలో ప్రవేశించాడు.

"అదేంఖర్మో! ఎన్నిమందు లిప్పించినా ఆ నీరసమే తగ్గ లేదు. వచ్చిన దగ్గర్నుంచీ నీవు వస్తావనే ఎదురుచూచింది. ఒక్క ఉత్తరమైనా వ్రాయకపోతివి. నిన్న ప్రొద్దున్న పురు డొచ్చింది. అప్పటినుంచీ స్పృహే లేదు. ఎందుకు ఇప్పు డొచ్చేం ప్రయోజనం?" బావురుమంది మాధవి తల్లి. ఎవరో బయటకు తీసుకుపోయూరామెను.

"మందులేం చేస్తాయి, మనస్సులో బాధకు?" మెల్లగా గొణుక్కున్నాడు శ్రీధర్.

దేనికీ మాట్లాడలేదు రవీంద్ర. తలెత్తి చూడలేదు. మౌనంగా మాధవి తలనిమురుతూ ఎటో చూస్తూండిపోయాడు.

* * *

నిశీథి నిశ్శబ్దంలో గోడగడియారం కొట్టిన రెండుగంటలు గంభీరంగా ధ్వనించాయి. మాధవి తల్లి, అన్న, వదిన, భర్త ఎవ్వరికీ నిద్రలు లేవు. చుట్టూ ఆత్రంగా ఎదురుచూస్తూ నిల్చు న్నారు. సూటిగా చూడడానికి భయం, చూడకుండా ఉండలేరు.

"రవీంద్రా. ఎక్స్యూజుమీ" అంటూ డాక్టర్ శ్రీదేవి మెల్లగా చెప్పింది: "ఆమెకు తెలివి వస్తోంది, ఇప్పుడే మీరు కనుపించడం అంత మంచిది కాదు."

ఒక్క క్షణం చూచి, మెల్లగా లేచి నర్సువెంట బయ టకు వెళ్ళిపోయాడు రవీంద్ర. అప్పుడే స్క్రీన్ చాటునుంచి ఒక పరిచిత కంఠం "ఎలా వుంది?" అంటూ మంచం దగ్గర కద లడం వెళ్ళిపోతున్న రవీంద్ర గమనించాడు. కాని ఆ ఆకారం ఎవరిదో, కంఠస్వరం ఎవరిదో గుర్తించడం రవీంద్ర. మనఃస్థితికి అతీతమైంది. క్రమంగా చీకట్లు అంతరించ సాగాయి. తూర్పు దిక్కు అరుణరాగ రంజితమైంది.

శూన్యంలోకి చూస్తూ, నిమిష మొకయుగంగా గడుపు తున్న రవీంద్ర భుజం తట్టింది శ్రీదేవి. "కంగ్రాచ్యులేషన్సు, బ్రదర్. ప్రమాదం దాటిపోయింది. మీరు చూడవచ్చు."

"ఆ!" సంతోషంలో అంతకంటె మాట్లాడలేక పోయాడు రవీంద్ర.

శ్రీధర్ చిన్నబిడ్డలా గెంతుకుంటూ వచ్చి రవీంద్రను కౌగలించుకున్నాడు. "మన మందరమూ అదృష్టవంతులమే

బావా! నా చెల్లెలు బ్రతికింది, బావా." కళ్ళు తుడుచుకుంటూ రవీంద్రను పట్టుకు లాక్కుపోయాడు.

పడుకొని ఉన్న మాధవి నేత్రాలలో ఏ భావమూ లేదు. నిశ్చలంగా నిర్మలంగా చూస్తూంది. నిష్కళంకంతో వెలిగి పోతున్న ఆ ముఖంలోని తేజస్సు చూడలేక కళ్ళువాల్చాడు రవీంద్ర. ఆమెను సమీపించటానికి కతడికి ధైర్యం చాలలేదు.

"వచ్చారా? కూర్చోండి." నీరసంగానే అయినా స్ఫుటంగా ఉంది మాధవి గొంతు. రవీంద్ర మాట్లాలేదు.

"ఇంకా కోపమేనా?" కొంచెం కళ్ళెత్తి జాలిగా అడిగింది మాధవి.

"లేదు, మాధవీ, లేదు. కోపంకాదు, సిగ్గు." దగ్గర కూర్చుని బావురు మన్నాడు. "నాలాటి నీచుణ్ణి ఇంత గౌరవిస్తావనుకోలేదు."

అతడిలో పరివర్తనకు ఆశ్చర్య పోతూ మాట్లాకలేక పోయింది. మాధవి.

"బాబును చూశారా?"

"పవిత్రమైన నిన్నూ, నీ బిడ్డనూ ముట్టుకునే అర్హత లేదు మాధవీ, నాకు." కళ్ళు తుడుచుకున్నాడు. "ఎందుకింత గౌరవిస్తున్నావు? నేను చేసిన తప్పులు నీకు తెలియలేదా మాధవీ?" గాద్గదికంగా అడిగాడు.

నీరసంగా నవ్వింది మాధవి. "తప్పులు చెయ్యని మానవు లెవ్వరు? మీ తప్పులు నెత్తిచూపే అర్హత నాకుండా అని నా ఆలోచన!"

పసిబిడ్డను తీసుకొచ్చిన శ్రీధర్ అంటుకొన్నాడు. "అవును, రవీంద్రా. నీకేం భయంలేదు. మా చెల్లాయి దేవత. ఆవిడ ఎవర్నీ నిందించదు, శిక్షించదు."

డాక్టర్ శ్రీదేవి నవ్వుతూ వచ్చి నిల్చుంది. మాధవీ, రవీంద్రలను చూస్తూ.

"మీ ఋణం తీర్చుకోలేను డాక్టర్." శ్రీదేవి రెండు చేతులూ పట్టుకున్నాడు రవీంద్ర.

నవ్వుతూన్న శ్రీదేవి ఒక్కసారి గంభీరంగా మారి పోయింది. "నిజంగా మీకు ఉపకారం చేసినవారికి కృతజ్ఞత తెల్పుకుంటారా, రవీంద్రా?"

"కృతజ్ఞతా! కోరిన ధనమిస్తాను!"

వెటకారంగా నవ్వింది శ్రీదేవి. "అంతశ్రమ వద్దులెండి. ఒక్క మంచిమాట ఆడితేచాలు. ధనం మీ రిచ్చినా నేను తీసుకోను. ఆమె నా చక్రవర్తి చెల్లెలు. ఆమె బ్రతకడమే నాకావలసింది."

"చక్రవర్తి నెరుగుదురా మీరు?" విస్తుపోయాడు రవీంద్ర.

"ఆ, ఎరుగుదును. కాని మీలా కాదు. ఒక దేవతగా అతడి నెరుగుదును, నేను. మాధవిని బ్రతికించింది నే నొక్క తెనే కాదు. చాటునుండి చక్రవర్తి నడిపించాడు వైద్య మంతా!"

"అవును, రవీంద్రా. మాధవి స్థితి అంతా ఏరోజు కా రోజు ట్రంక్ ఫోన్ ద్వారా తెలుసుకొని అమూల్యమైన సలహా లిచ్చేవాడు. నువ్వంత అసహ్యించుకున్నా నీ మీ దతడి కే మాత్రం కోపం లేదు. మాధవిని నీకంటే, నా కంటే ప్రేమగా చూచుకొంటున్నాడు. కాని, ఆ అభిమానం మన భావానికీ నిర్వచనానికీ, అందనిది" అన్నాడు శ్రీధర్.

"అంతే కాదు." మాధవి తల్లి అందుకుంది. "దానికి నొప్పులు ప్రారంభ మవగానే నీకు టెలిగ్రాం ఇచ్చినపుడే అత డికి ఇచ్చాం. గంటలో విమానం మీద వచ్చి వాలాడు. ఈ క్షణంవరకు నిద్రాహారాలు లేకుండా దానికి మందులూ, ఇంజక్షన్లూ ఇస్తూనే ఉన్నాడు. శ్రమకుగాని, డబ్బుకు గాని వెనుకాడకుండా నా తల్లిని నా కిచ్చాడు. దీపం పెట్టి మ్రొక్కు తాను. రోజూ."

పరిచితమైన ఆకారం స్ట్రీక్ ప్రక్క కదలడం ఇప్పు డర్థమైంది రవీంద్రకు. ఆవేశంగా లేచాడు రవీంద్ర. ఇక్కడ కూడా అపార్థం చేసుకుంటావేమోనని నాకు చాటుగా ఉంటున్నా డన్నమాట! ఏడీ చక్రవర్తి? అతడి పాదాలు పట్టుకోనిదే నాకు నిష్కృతి లేదు."

"చక్రవర్తీ! చక్రవర్తీ! ఇటు రావయ్యా" అన్నాడు శ్రీధర్.

నిర్లక్ష్యంగా నవ్వింది శ్రీదేవి. "ఇంకెక్కడి చక్రవర్తి! చెప్పాను కదా, రవీంద్రా? మనసులు విరిగాక మమతలు పెంచుకొన్నా దూరమైన మనుష్యులు దగ్గరకు రారు. ఇందాక మిమ్మల్ని బయటకు పంపింది ఎందుకు? ఆఖరిసారిగా మాధవిని చూచి వెళ్ళిపోతానన్నాడు చక్రవర్తి. ఇదుగో, మాధవీ, నీకీ ఉత్తరం ఇమ్మన్నాడు." ఒక కవరు మాధవికి యిచ్చింది.

"వెళ్ళిపోయాడా? ఎక్కడకు?" అందరూ ఏకకంఠంతో అడిగారు.

నిట్టూర్చింది శ్రీదేవి. "విదేశాలకు వెళ్తాడట. మళ్ళీ రాడట. మాధవికి కొన్ని మందు లివ్వవలసి ఉందింకా. అందుకే అతడిని విమానాశ్రయానికి సాగనంపే అదృష్టం కూడా లేకపోయింది నాకు. చిన్నప్పనుంచీ అతడిది బాధా హృదయమే. పోనివ్వండి. అక్కడైనా కొంత ఉపశాంతి లభిస్తే అంతే చాలు."

ఉత్తరం శ్రీధర్ బిగ్గరగా పైకి చదివాడు.

"సౌభాగ్యవతి మాధవీ,

"చిరంజీవిగా వర్ధిల్లు. సోదర వాత్సల్యంతో చేసిన ఈ సంబోధనకు ఆగ్రహించ వనుకుంటాను. నీతో కొన్ని విష

యాలు చెప్పవలసి వుంది. అలసిన ఈ స్థితిలో ఉన్న నిన్ను నా గోడుతో శ్రమపెట్టడం భావ్యం కాకపోయినా తప్పదు. క్లుప్తంగా చెప్తాను.

"నీకు వైద్యంచేసిన శ్రీదేవి ఎవరో తెలుసా? ఒకప్పుడు, నా హృదయ దేవత. కాని విధి బలీయతవల్ల ఆమెను పొంద లేకపోయాను. నీలా కథలు వ్రాసే సుధారాణి అనే చెల్లెలు ఒకతె ఉండేది. నా దురదృష్టంవల్ల ఆమెను కోల్పోయాను. పసితనంలోనే తల్లి ఒడీ, పితృప్రేమా కరువయ్యాయి.

"అన్ని బంధాలూ, ప్రేమలూ నన్ను గెంటివేసినా, నేను మాత్రం ప్రాకులాడుతూనే ఉన్న హీనుడను మాధవీ. నీ "ఆరాధన" కథ నన్నంతగా కలచివేయడానికి కారణం — అందులో నాయిక, నలిపివేయబడ్డ నా చెల్లెలి జీవితానికి ప్రతి బింబం నీ గానమూ, సౌజన్యమూ నా శ్రీదేవిని గుర్తుకు తెచ్చేవి. అలా నీ సౌందర్యంలో నా రక్త సంబంధాన్ని, నీ కథలో ఒక పాత్రనూ, నీ గానంలో ఒక విషాద స్మృతినీ ప్రేమించుతూ నేను నీకు దగ్గరయ్యాను. నీ కంఠ మాధు ర్యంలో, నీ సంగీత శ్రవణలో — నిద్రాణమై ఉన్న కళాపిపాస నాలో మేల్కొంది. నీ రచనా శైలి, గతించిన నా మానసిక ప్రవృత్తిని మృదువుగా స్పృశించి, ఆనాటి చక్రవర్తి ఛాయను నిర్జీవమైన ఈ చక్రవర్తి ఎదుట నిలబెట్టి కళ్ళు మిరుమిట్లు గొలి పేట్లువేస్తుంది. నీ రచనలలోని స్త్రీ పాత్రలు నా చుట్టూ పరిభ్ర

మించి, యౌవనారంభంలో, విద్యార్థిదశలో వున్నమరేయి నాటి సముద్రతరంగాల వంటి నా హృదయావస్థను పైకి తోడితెచ్చి నవచైతన్యం కలిగిస్తాయి. ఆ పూర్వ స్మృతులు హృదయాల్ని తాకినందువల్ల లభించేది కేవలం మానసికాందోళన మాత్రమే అయినా అందులోనే ఒక తృప్తీ, ఆత్మశాంతీ లభించేవి. నా చెల్లెలి గాథ ఎన్నోసార్లు నీకు చెప్పాలనీ, నీ చేత 'అన్నయా' అని పిలిపించుకోవాలని ఉండేది. కాని ఆ దురదృష్టవంతురాలితో నిన్ను పోల్చలేక, నా ప్రయత్నం విరమించుకొనేవాడిని.

"పవిత్రురాలైన స్త్రీకి ఎటువంటి గౌరవం ఉండాలని అభిప్రాయపడతానో, సంసారనౌకకు చుక్కానియైన ఇల్లాలికి ఎటువంటి ప్రేమాదరణలు ఉండాలని కోరుకొంటానో, విద్యావతికి ఎటువంటి విశిష్టస్థానం ఉండాలని ఆశిస్తానో, గుణరూప సంపదలున్న స్త్రీ ఎట్టి ఉత్తమ పురుషునివద్ద రాణించాలని ఊహిస్తానో — సరిగా అటువంటి సుఖమయమైన ప్రత్యేకమైన జీవితాన్ని నీవు సాగించడం చూచిన నేను, నే నూహించే బంగారులోకంలోని స్త్రీలకు నీవు రాణివని ఆనందించాను. నీ వంటి ఉత్తమురాల్ని భార్యగా పొందిన రవీంద్ర పుణ్యా పురుషుడనుకొన్నాను. ఏ లోటూ, అసంతృప్తీ లేని మీ సంసారాన్ని చూచి మనసారా ఆనందించాను. ఈ అన్ని కారణాలవల్ల నీ మూర్తి నా హృదయంలో మాటలకందని ఒక అసాధారణాను బంధాన్నేర్పరచుకొంది. ఈ అపూర్వ సంబంధంముందు నీతిలేని

లోకమే తలవంచుకోవాలనీ, వ్యక్తిత్వాలను అదుపులో పెట్టుకోవలసిన నటనా, నిష్ఠానిగ్రహాల ప్రదర్శనా అక్కడ అనవసరమనీ పశుప్రాయులు గ్రహించలేరు. అంతఃకరణ ఆర్ద్రతా, ఆప్యాయతా మనస్సులను దగ్గర దగ్గర చేస్తాయనే సత్యం సామాన్యుల కెలా తెలుస్తుంది? వివాహ బంధమని, సహోదరత్వమనీ, స్నేహమని సాంఘిక పరిభాషలో, మనుష్యుల మధ్యగల సంబంధాలను నిర్వహించే పదాలున్నాయి. కాని మన సంబంధంవంటి అను బంధాన్ని నిర్వచింపగల పదం లేదు. అయినా భాషకందే శబ్దస్వరూపం లేనంత మాత్రాన, వ్యవస్థా రూపంగా వ్యక్తీకరింప లేనంత మాత్రాన, ఒక పవిత్ర సంబంధం అధర్మమూ, అత్యాచారమూ అయిపోదు. నిర్వచనానికందని ఈ హృదయానుబంధరాగతను అర్థం చేసుకోగలందులకు భావపరిపక్వత, విశాల హృదయమూ అవసరం.

"ఎదుటివారి లోపాలను విస్మరించి, వారి సౌహార్ద్రతనూ, సచ్ఛీలాన్నే ప్రేమిస్తాను నేను. ఎవ్వరిని శత్రువులుగా పరిగణించలేను. బహుశః దేవుడు నన్ను నిర్మించే ముందు ద్వేషం, అసూయ అనే రెండు పదాలనూ మరిచిపోయి, ఆ రెండు పాళ్లు కూడా ప్రేమనే పోశాడేమో! అందుకే మొదట్లో నువ్వు విదిలించి కొట్టినా, అపార్థం చేసుకొన్నా నీ స్నేహం మానుకోలేకపోయాను. రాను రాను నీకు నాపై కోపంపోయింది. అది నీ డైరీ చూచి తెలుసుకున్నాను. కాని నాపై జాలిపడ్డావే కాని, నా వాత్సల్యాన్నీ, మనసునూ

గ్రహించలేదు. స్నేహాన్ని కోరి తపించే గుణం నీలో లేదు. నీ సహచర్యంలో ప్రేమస్పందనే ఎరుగని నిర్మలలో స్త్రీ హృదయం వికసించగలదని ఆశించిన నా ఆశ అడియాసే అయ్యింది. వెన్నెలలి అమృత స్పర్శవంటి అభిమానానికీ, మైమరపించే మనోరంజని ప్రేమకూ దూరమై, భగవన్నిర్ణయమైన భార్య నిర్లక్ష్యానికి గురైన నా ఆర్ద్రప్రకృతి అప్రయత్నంగా నిన్ను అభిమానించడంవల్ల మరో విషాధ కథకు కూడ కారణభూతుడ నయ్యాను. నిర్మలమైన నీరని ఆశించితే సుడిగుండాలు లాగివేయడం, సంపంగిని చేరబోతే నాగుబాము కాటువేయడంగా ఉంది నా జీవనస్థితి. ఎక్కడా వెల్తి లేని నిండుదనం, లోపంలేని స్వచ్ఛత్వం, ఆవేదన దూరమైన ఆనందం కన్పించలేదు. నా అనవసర ప్రమేయం వల్ల మీా సంసారంలో కలతలు రేపగలిగానే కాని తిరిగి మీా సంసారాన్ని చక్కబరచలేకపోయాను. ఏ సమస్యా పరిష్కారానికైనా కాలపరిపక్వత అవసరమని ఇంతకాలం ఎదురు చూచాను. అయినా లాభంలేకపోయింది. నీ సంసారంలో చిచ్చు పెట్టానని నీకు కోపంగా ఉండచ్చు. మాధవీ, క్షమించమని అడిగే ధైర్యం కూడలేదు. నీవు నా ముఖం ఇక చూడవని తెలుసు. అందుకే నీకు స్పృహరాక ముందే పోతున్నాను, దూరదూరాలకు. నా కెవరిపైనా కోపం మాత్రం లేదు. నా నిష్కృతే నీ సంసార సమస్యకు పరిష్కృతిగా భావించాను. ఇన్నాళ్లుగా అడుగడుగునా

తగిలేదెబ్బలకు బొప్పికడుతున్నా లేచి సాగిపోయాను. కాని ఇక ఈ మాదిరి నా జీవితానికి ప్రయత్నపూర్వకంగా స్వస్తిచెపుతున్నాను. సాగిపోతున్న ఈ జీవనస్రవంతిలో పూడని అగాధాలను పూరింపచేయడానికి చేసే ఈ అన్వేషణకు మాత్రం ఇక స్వస్తి.

"జీవితం చిత్రాతి చిత్రమైనది. మనను ఆత్మీయులను చేయడానికి కారణమైన విషయాలే మనల్ని వేరు చేయడానికి కూడ కారణమయ్యాయి. నీలోని ఏవిశిష్ట గుణాలైతే నా గత జీవితాన్నిస్పృశించి, నాహృదయాన్ని స్పందింపజేశాయో—ఆ ప్రతిభలే నేడు నన్ను వెనుదిరిగి చూడనీయకుండా తరిమివేస్తున్నాయి. మానవుల మనస్తత్వాలకూ, నా మనోప్రవృత్తికీ ఏదో సమన్వయం లేకపోవటం వల్లనే ఈ విపరీత పరిణామాలేర్పడుతున్నాయి. కేవలం నా నామమాత్రపు జోక్యంవల్లనే ఇతరులకు కలిగే నష్టాలను చూచి ఏదో లోపం నాలోనే అజ్ఞాతంగా అంతర్లీనమై ఉందని నిర్ణయించుకున్నాను. స్నేహానుబంధాలు, మమతా బంధనలు అనుమానాలతో, అసత్య ప్రచారాలతో కలుషితమైపోయే ఈ వాతావరణంలో ఇమడ లేను. నాలో నిస్పృహా, నిర్లిప్తత, అధికమయ్యాయి. విషాద భారం మోయలేకుండా ఉన్నాను. వాటినుండి తాత్కాలికంగా పారిపోవడానికే ఈ పర్యటన. అందువల్ల ఆత్మ పరీక్షకుకూడ అవకాశం కలుగుతుందనే అభిప్రాయంతో ఉన్నాను. వ్యక్తిగత ప్రేమానుబంధం ఒకవైపు లాగుతూంటే ఒక ధర్మసాధనకై ఆ బంధాన్ని అతి ప్రయాసతో త్రెంచుకు పోతున్నాను.

"ఇక నిర్మల సంగతంటారా ? ఆమెకు నా ధనమే కాని నేనెప్పుడూ అక్కర్లేదు. ఆమె అనూయతో వ్రాసిన ఉత్తరమే నీ సంసారాన్ని నాశనం చేసింది. సంసార మక్కరలేనిది కనుకనే మరొక నిండు సంసారాన్ని నాశనం చేయగలిగింది. నాయావ దాస్తీ నిర్మలకు, నా డిస్పెన్సరీలోని మందులు శ్రీదేవి ద్వారా బీదలకు, నాతోట ఒక అనాథాశ్రమానికీ సంక్రమించేటట్లు ఏర్పాట్లు చేసి వెళ్ళిపోతున్నాను.

"క్షమించుతావుకదూ! నీకూ, చిరంజీవికీ ఆశీస్సులతో—

చక్రవర్తి."

"అన్నయ్యా!" మాధవి ఒక్కసారి బావురుమంది.

"చక్రవర్తీ!" అంటూ రవీంద్ర తల్లడిల్లిపోయాడు.

"అలా కంగారుపడి లాభమేమిటి ? అత డెక్కడున్నా వెదకి వెనక్కు తీసుకొచ్చే భారంనాది" అంటూ శ్రీధర్ బయటికి పరుగెత్తాడు. రవీంద్ర అనుసరించాడు.

౪౧

"చక్రవర్తి చాలా విసిగిపోయాడు. ఏడవతారీకు ఉదయం ఆరు గంటలకు సింగపూర్ బయల్దేరే విమానంలో ఎక్కో వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నాడు. ఇప్పుడైనా కళ్ళు తెరిచి సంసారం నిలబెట్టుకో" అంటూ శ్రీదేవి వ్రాసినఉత్తరంచూచు

కాని నిర్మల భయపడిపోయింది. అప్పుడప్పుడే పశ్చాత్తాపం పొందుతూన్న ఆమె వెంటనే బయల్దేరింది.

నిర్మల వచ్చేసరికి చక్రవర్తి విమానాశ్రయంలో కాంటీన్ దగ్గర ఒకచోట పరధ్యానంగా నిలబడి ఉన్నాడు. అనుకోకుండా హఠాత్తుగావచ్చి కాళ్ళకు చుట్టుకుపోయిన నిర్మలను చూచి చకితుడయ్యాడు చక్రవర్తి.

"నన్నన్యాయం చెయ్యకండి. బుద్ధివచ్చింది. ఇకనుంచి మీరు చెప్పినట్లు వింటాను" అని భోరున ఏడుస్తూన్న నిర్మలను లేవనెత్తాడు.

"నలుగురూ విడ్డూరంగా చూడటానికి కాని ఎందుకీ రభస, నిర్మలా?"

"రభసకాదు. ప్రార్థిస్తున్నాను. నా బ్రతుకు నవ్వులపాలు చెయ్యకండి."

నిట్టూర్చాడు చక్రవర్తి. "ఏమిటి. నీ ధోరణి యిలా మారింది? నేనేం పట్టుకు పోవడంలేదు నిర్మలా! ఆస్థి అంతా నీకే వ్రాశాను."

నిర్మల రెండు చేతులతోను నుదురు కొట్టుకుంది. "బుద్ధి తక్కువదాన్ని. కల్పవృక్షమని గ్రహించలేకపోయాను. మిమ్మల్ని నిర్లక్ష్యం చేశాను. రంపపుకోత అనుభవిస్తున్నాను పుట్టింట్లో. క్షమించి ఈ ప్రయాణం మానెయ్యండి. ఇంటికి తిరిగిరండి. నాకు డబ్బే లోకం కాదు."

"తప్పదు నిర్మలా. వెళ్ళి తీరాలనే నిశ్చయించుకొన్నాను కాని ఇది నీ మీద కోపం కాదు. నామీద నాకే అసంతృప్తి. మనస్సు సద్దుకున్నాక తిరిగి వస్తాన్లే."

"అయితే, నన్నూ తీసుకెళ్ళండి."

"నిజంగా ఆశ్చర్యపోతున్నాను, నిర్మలా. పెళ్ళయిన క్రొత్తలో నే నమెరికా వెళ్తే నువ్వు కించిత్తయినా బాధపడ లేదు. ఇప్పుడిలాగున్నావంటే చాలా మారావన్న మాట! ఈ మార్పు గుర్తించుకుంటాను. కాని నిర్మలా, [illegible] షికార్లూ, నీ వినోదాలే కాని ఒకనాడైనా ప్రేమగా నా కోరి కేదైనా తీర్చావా ? ఏ నాడైనా ఆప్యాయంగా అన్నం పెట్టావా నీ చేత్తో ? ఈ మాత్రం దాని కెందుకా సంసారం ? దెప్పు తున్నాననిఅనుకోకు. బహుశః నీమన స్సెవరిపైనో ఉండి, నన్ను బలవంతగా పెళ్లి చేసుకున్నావేమో అని కూడా అనుకున్నాను చాలసార్లు. అదే నిజమైన పక్షంలో సంతోషంగాఒప్పుకుంటాను. నా అభ్యంతర మేమీ ఉండదు. నావల్ల ఎవరి సుఖానికీ లోపం రాకూడదని నా కోరిక."

వెక్కి వెక్కి ఏడ్చింది నిర్మల. "లేదు. ఎవరిపైనా లేదు. అంతటి నీచురాల్ని కాను. కాని తెలిసీ తెలియని వయస్సు లోనే పెళ్ళయి కాపురాన్ని కొచ్చాను. మిమ్మల్ని అర్థం చేసుకోక పూర్వమే మీ పిన్నిగారు చెప్పిన మాటలు విని ఇలా తయారయ్యాను. మీరు అమెరికా వెళ్ళిపోవడంతో

నా అనుమానం మరింత బలపడింది. ఆనాడు శ్రీదేవి మీ స్నేహితు రాలని మీ పిన్ని చెప్పినప్పుడు ఆమెను గురించి నాలో విష బీజాలు నాటుకుపోయాయి. ఈనాడు శ్రీదేవిలాంటి దేవత ఉందా! అని ఆశ్చర్య పోతున్నాను. ఆమెకూ, మీకూ మధ్య అడ్డువచ్చి ఆమె జీవితాన్ని మోడు చేశానన్న కోపమైనా లేకుండా నా సంసారం నిలబెట్టాలని చూచింది."

"అయితే ఇప్పుడు శ్రీదేవి కబురంపిందా నీకు?" ఆశ్చర్య పోతున్న చక్రవర్తి ఆశ్చర్యం ఇంకా ఇనుమడించింది. ప్రక్కనే ఆగిన కార్లోంచి వరుసగా రవీంద్ర, శ్రీధర్, శ్రీదేవి దిగేసరికి.

కారు దిగుతూనే రవీంద్ర, చక్రవర్తి రెండు చేతులూ పట్టుకుని కన్నీళ్ళు కార్చ మొదలు పెట్టాడు. చక్రవర్తి నిశ్చేష్టుడై చూడటం మినహా ఏమీ చేయలేకపోయాడు. అంతా కలో, నిజమో అర్థం చేసుకోలేని స్థితిలో ఉన్నాడతడు.

శ్రీధర్ ముందుకువచ్చి అన్నాడు: "ఏమిటి దారుణం, చక్రవర్తీ? మేమంతా ఏమైపోవాలి?"

"ఎవరూ ఏమీ అయిపోకుండా సుఖంగా ఉండాలనే ఈ నిష్క్రమణ శ్రీధర్." నిస్సహాయంగా చూస్తూ శ్రీదేవివైపు తిరిగాడు చక్రవర్తి. "ఏనాడూ నాకు కష్టం కలిగించని దానవు, నా పనులకు ఆటంకం రానీదానవు – ఇలా అన్ని వైపుల నుండి నన్ను బంధించేశావేమిటి, శ్రీదేవి? నా ప్రయాణం విషయం రహస్యంగా ఉంచమన్నాను కదా?"

నిండా నీళ్లున్న కళ్ళతో శ్రీదేవి బరువుగా తలెత్తింది, "అవును అడ్డురాలేదు, అందువల్ల కలిసేగాథ నా ఒక్కతెదే అయినప్పుడు. కాని, చక్రవర్తీ, బాధపడిన హృదయమే బాధ నర్థం జేసుకోగలదు. నాలాగా నిర్మల జీవితం కూడా నాశన మవ్వాలా ? ఒక సంసారం నిలబెట్టడానికి మరో సంసారం బలిచేసావా?"

రవీంద్ర మెల్లిగా మాట్లాడటానికి ఉపక్రమించాడు. "నా తప్పులన్ని తెలుసుకున్నాను. నీ మీద నాకు కోపం లేదు. చక్రవర్తీ ! నా జీవనజ్యోతి మాధవిని నిలబెట్టిన నీ పాదాలు కడుక్కు త్రాగుదామని వచ్చాను. నీపట్ల చూపిన అగౌరవానికి సిగ్గుపడుతున్నాను, చక్రవర్తీ. నన్ను క్షమించి తిరిగి రా. లేకపోతే నాకు మనశ్శాంతి ఉండదు."

"నన్నేదో గొప్పవాడినిచేసి బ్రతిమాలవద్దు. రవీంద్రా నా కెవరిపైనా కోపం లేదు. నే నొక నష్ట జాతకుడను. నాతో బంధుత్వం, స్నేహం పనికిరావు. అందువల్ల అందరికి అనర్థాలే. దయవుంచి నన్ను పోనివ్వండి. మీరంతా ఆనందంగా ఉండండి. మాధవిని ప్రాణంగా చూచుకో. అదే నా కోరిక. నన్ను పోని."

నిట్టూర్చాడు రవీంద్ర. "నన్ను మాధవే తేలికగా క్షమించింది. ఇక నువ్వు క్షమించలేవా అనే ధైర్యంతో వచ్చాను."

నవ్వాడు చక్రవర్తి. "అందుకే ఆమెను దేవతను కొన్నాను. మరో స్త్రీ ఎవరైనా సరే సూటి పోటీ మాటలు

వినయుసః. ఆమె సామాన్యురాలుకాదు, రవీంద్రా. నీ జీవితా నికి లక్ష్మి. జాగ్రత్తగా చూచుకో."

"ఎలా, చక్రవర్తీ? ఇన్ని తెలిసిన నీకు చెప్పాలా ? ఎలా ఆమెను జాగ్రత్తగా చూడడం?" శ్రీదేవి చాలా తెలివిగా అడి గింది. "కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తోంది. పచ్చి బాలెంత రాలు. అసలే నీరసంగా ఉంది. నీ యీ చర్యకు ఆమె హృద యం తట్టుకోగలదంటావా ? ఇన్నాళ్ళ మన శ్రమంతా వృథా అయిపోయింది."

అదిరిపడ్డాడు చక్రవర్తి. "నిజమేనా ?" అన్నాడు. కంగారుగా.

"అక్షరాలా ! ఎంతమంచివారైనా ఒక్కొక్క స్థితిలో వారిని చూచి జంకడంమామూలే. మంచినీరు లేనిదే బ్రతుకలేని మనుష్యులు మహా ప్రవాహవేగాన్ని చూచి పారిపోవడంసహజం. నదివద్దకు వెళ్ళి నీరు తెచ్చుకుంటారు గాని నదే దయతలచి వస్తూంటే భయపడిపోతారు. అందుకని కోపంతో మంచినీరే బిగపట్టేస్తే ఏమైపోతారు ? ఆ ప్రవాహానికి కాల్వలుతీసి నద్విని యోగం చేసుకోనివ్వాలి" అంది శ్రీదేవి నవ్వుతూ.

చక్రవర్తి కూడా నవ్వాడు. "గొప్ప ఉపమానమే చెప్పావు కాని నేనంత మహానుభావుణ్ణికాను, దేవీ. సరే ఏమైతేనేం ? మాధవి కే మాత్రం కష్టం కలిగించలేను పదండి. ఆవిడ అనుమతి తీసుకున్నాకనే వెళ్తాను."

"హమ్మయ్య!" "తృప్తిగా ఊపిరి పీల్చాడు శ్రీధర్. ఆ మాటన్నావ్, బాగుంది మధు నిన్ను వెళ్ళనిచ్చి నవ్వుడు చూద్దాంలే."

"ఒక్కమాట" మెల్లగా అన్న నిర్మల మాటలకు 'ఏమి' టన్నట్లు చూచారు అందరూ.

"అందరి ఎదుటా క్షమాపణ కోరుకుంటున్నాను. ఇంకెప్పుడూ యిటువంటి తెలివితక్కువ పని చెయ్యను. ఈ కలతలన్నిటికీ మూలకారణం నేను. ఆయన మాధవి నంత వాత్సల్యంతో చూడటం, పువ్వులు, పళ్ళు పంపడం, ఆమె కథలను పొగడటం సహించలేక అసూయతో పద్మ అనే పేరుతో నేనే వ్రాయించా నా వుత్తరం. మాధవికి గర్వమనుకున్నాను. కాని ఆవిడ హృదయాన్నర్థం జేసుకోలేకపోయాను. పద్మ దిక్కులేని దీనురాలని చేరదీశారు డాక్టరుగారు. అదే ఆయనపై అంత అపవాదు వేయించింది. నన్ను రెచ్చ గొట్టింది" అంది కన్నీళ్ళతో నిర్మల.

"పోనీలే, నిర్మలా. మరచిపోదాం" అన్నాడు చక్రవర్తి.

"అవునమ్మా, మనలో మన కేమిటీ క్షమాపణలు ? మరచిపోదాం. రా వెళ్దాం" అన్నారు రవీంద్ర, శ్రీధర్.

ఎండలకు కాలికాలి బీటలువారిన నేల వర్షాగమనంతో చల్లబడి ప్రశాంతత పొందింది. చెట్లు, చేమలు సంతోషంగా తలలూగించు తున్నాయి. మూల మూలలనున్న చీకట్లను

పారద్రోలి తన బంగారు కిరణాలను లోకంపై ప్రసరించి వెలుగును ప్రసాదిస్తూ బయల్దేరాడు బాలభానుడు.

## ౪౨

ఆకాశం మేఘదూరమై నిర్మలంగా ఉంది. చల్లని ప్రశాంత ప్రకృతిలో మానవకోటి ఆహ్లాదం పొందుతూంది. సంధ్యా సానువులు సరసంగా సాగి వస్తున్నాయి.

మేడ వరండాలో నిల్చి సంధ్యాశోభను తిలకిస్తూన్న మాధవి, తన నెవరో మృదువుగా స్పృశించడంతో వెనుదిరిగి చూచింది, రవీంద్ర!

“ఇక్కడ నిల్చున్నా వేమిటి? చలిగాలికి జబ్బు చెయ్యదూ?”

“ఈ ఆలనా పాలనలు యిన్నాళ్ళనుండీ ఏమయ్యాయి” యంటుందనుకున్నాడు రవీంద్ర. కాని అతడికి ఆశాభంగమే అయ్యింది. దెప్పుళ్ళూ, ఏడ్పులూ, మొత్తుకోళ్ళూ తెలియని వినయ సౌజన్యమూర్తి ఆమె!

“నాకింకే జబ్బులూ, మాలిన్యాలూ అంటవు.” నీరసంగా నవ్వి గదిలోకి దారితీసింది మాధవి.

గది మధ్య స్టాండు ఉయ్యాలలో ముద్దులు మూటకడుతున్న పసిడిఛాయ పసిబిడ్డ అమాయకంగా అందంగా నిద్రపోతున్నాడు. ఊయలకు అటూ ఇటూ నిల్చుని ప్రేమఫలాన్ని

పఠికిస్తూ ఆలోచనావల్లరులలో తేలిపోతూన్న భార్యాభర్త లిద్దరూ, చక్రవర్తి శ్రీధర్‌లు గదిలో ప్రవేశించడం గమనిం నించనేలేదు.

"ఏం బావగారూ? మీ అబ్బాయి మాతో మాట్లాడ వద్దంటున్నాడా?" అన్నాడు శ్రీధర్, రవీంద్ర భుజం చరుస్తూ.

మాధవి సిగ్గుపడి ఉయ్యాలకు దూరంగా వెళ్ళి కుర్చీలో కూర్చుంది.

రవీంద్ర తిరిగి మాట విసరాడు. "అవును. మాట్లాడ వద్దంటున్నాడు, మీ చెల్లాయి గుణాలొచ్చినట్టున్నాయి."

పాపాయిని చేతులలోకి తీసుకున్నాడు చక్రవర్తి. "నోటితో చెప్పనక్కర్లేదు. రూపమే చెప్తోంది ఎవరిపోలికో. మా చెల్లెలికి చుక్కకళ్ళూ, చప్పిడి ముక్కూ లేవు."

చక్రవర్తి మాటలకు శ్రీధర్ గదిదద్దరిల్లేలా నవ్వాడు. మాధవికూడా శ్రుతి కలిపింది. సందడికి మేల్కొన్న పిల్లవాడు కేర్ మంటూ ప్రక్కవాయిద్యం జోడించాడు.

చక్రవర్తి చేతులలోనుంచి కొడుకును తీసుకొని జోకొడుతూ, "ఎక్కడి కెళ్ళేరన్నయ్యా, మధ్యాహ్నం కాఫీలకు కూడా రాలేదు!" అంది మాధవి శ్రీధర్‌నూ చక్రవర్తినీ చూస్తూ.

చక్రవర్తి నవ్వి ఊరుకున్నాడు. శ్రీధర్ అతడివైపు సాభిప్రాయంగా చూస్తూ, "నయంకదూ యింకా? కూడా నేనుండబట్టి యిప్పుడైనా లాక్కొచ్చాను. బజారు బజారంతా కొనేస్తున్నాడు, మేనల్లుడు బారసాల బహుమతుల కోసం."

"పండితురాలైన చెల్లెలి ముందు అవేం మాటలయ్యా? బారసాల కాదు, బాలసారె అనాలి" అన్నాడు చక్రవర్తి, మాటతప్పింప జూస్తూ.

కాని శ్రీధర్ వదలలేదు. "ఎన్నెన్ని కొన్నాడనీ? రండి చూద్దురుగాని, నా గదిలో ఉన్నాయి."

"ఏమిటి శ్రీధర్, నువ్వుమరీని?" చిరుకోపం ప్రదర్శించాడు చక్రవర్తి.

తడిసిన కనురెప్పలను బరువుగా పైకెత్తి చక్రవర్తివైపు చూచింది మాధవి. "ఎందుకన్నయ్యా అవన్నీ? మీరు మళ్ళీ దయతో తిరిగిరావడం, అందరం యిలా మళ్ళీ కలిసి ఉండగలగడమే గొప్ప విషయం. మీ ప్రేమాభిమానాల కన్నా విలువైన బహుమతులున్నాయా ప్రపంచంలో?" ప్రయత్నించినా ఆగకుండా జలజలా రాలిపోయాయి కన్నీళ్ళు. చక్రవర్తి లేచివచ్చి మాధవి చెంపలమీద జాలువారే కన్నీటిని తుడుస్తూ మౌనంగా ఉండిపోయాడు. ఏవేవో భావపరంపరలతో అతడు కూడ ఆవేశపూరితుడై మాట్లాడలేకపోయాడు.

"ఏమిటి, మధూ, పిల్లవాణ్ణి ఒళ్ళో పెట్టుకుని?" చెల్లెల్ని వాత్సల్యపూర్వకంగా మందలిస్తూ, ఆ మేనల్లుడిని లేవదీసి ఉయ్యాలలో పడుకోబెట్టాడు శ్రీధర్.

అవన్నీ చూస్తూ కూడా చూడనట్టు తలవంచు కూర్చున్నాడు రవీంద్ర, చక్రవర్తికి అర్థమైంది, అతడింకా పశ్చాత్తాపంతో, సిగ్గుతో కుమిలిపోతున్నాడని, మెల్లగా

రవీంద్ర చెయ్యిబట్టి లేవదీశాడు. ఆశ్చర్యం! అతడి చెక్కిళ్లు కూడ తడిసి ఉన్నాయి.

"ఆనందాశ్రువులా?" పరిహాసమాడాడు చక్రవర్తి.

లేని నవ్వు బలవంతంగా తెచ్చుకున్నాడు రవీంద్ర. చక్రవర్తి, మాధవి చేతిలో రవీంద్ర చేతిలో ఉంచుతూ, "ఇలాగే కలకాలం ఉండాలని ఆశీర్వదిస్తున్నాను. ఇకనుంచీ మాధవికి అన్న లిద్దరు. నా ఇల్లు కూడా మాధవికి పుట్టిల్లే. విధిగా ప్రతి పండుగకూ, వేడుకకూ నా యింట్లో కూడా మాధవికి ఆడపడుచు లాంఛనాలు, మర్యాదలు దక్కుతాయి" అన్నాడు గంభీరంగా, హుందాగా.

అందరూ ఆశ్చర్యపోయారు. ఇతడి వాత్సల్యానికి అంతే లేదా? "నిజంగా నిన్నుచూచి అసూయాపడుతున్నాను చక్రవర్తీ! దానితో పుట్టి పెరిగిన నా కంటె నువ్వెక్కువ సన్నిహితుడవై పోయావు" అన్నాడు శ్రీధర్.

శ్రీధర్ మాటలకు చిరుదరహాసాలు ఒలిపిస్తూ అందరూ ప్రక్క గదిలోకి వెళ్ళారు. చూపరుల నాశ్చర్యంలో ముంచేస్తూ పెద్ద ట్రంకుపెట్టె తెరిచాడు చక్రవర్తి, ఒక వెండి పళ్లెంతీసి, అందులో వెండి పన్నీరు బుడ్డీ, అత్తరు సీసా, గంధం గిన్నె, బంగారు కుంకుమ భరిణె, బంగారు తమలపాకుల పళ్లెం. ఖరీదైన చీర, రవ్వల నెక్లెస్ ఉంచి మాధవి చేతికివ్వబోయాడు.

"ఆ పని నిర్మల చేస్తే యింకా బాగుంటుందేమో!" అంది సన్నగా, అప్పుడే నిర్మలను వెంటబెట్టుకు పైకి వచ్చిన శ్రీధర్ భార్య.

"అవును. తప్పు చేయనివాడు క్షమాపణ చెప్పుకున్నట్టు నేనివ్వడమేమిటి?"

చక్రవర్తి మాటలకు అందరూ నవ్వినా నిర్మల నవ్వ లేదు. ముందుకువచ్చి, "సంతోషంగా యిస్తాను. మాధవివంటి ఆడబిడ్డను పొందే అదృష్టం అందరికీ దక్కుతుందా? కాని చేసిన తప్పు ఒప్పుకున్నాక నన్ను తిరిగి ఆ విషయమై ఎవ్వరూ ఏమీ అనవద్దని ప్రార్థిస్తున్నాను" అంది రుద్ధకంఠంతో.

"లేదు, నిర్మలా. అన్నయ్య హాస్యం చేశారంతే, తప్పులు చెయ్యని మానవులెవ్వరు? కాని అది ఒప్పుకుని సరి దిద్దుకోగల ఘనత నీలో ఉంది. అందుకు నేను చాలా సంతో షిస్తున్నాను" అంటూ మాధవి, నిర్మల చెయ్యి పట్టుకుని, "నాది ఒక్క కోరిక తీరుస్తావా మరి? చక్రవర్తి అన్నయ్య మానవరూపంలో ఉన్న దేవుడు. అటువంటి వారికి మిత్రులవ్వ డంగానీ, బంధువు లవ్వడంగానీ గర్వించదగ్గ సంగతి. మరి నీవు సాక్షాత్తూ అర్ధాంగివంటే ఎంత అదృష్టవంతురాలవో గ్రహించు. అతి చనువు తీసుకుంటున్నందు కేమనుకోక గానీ, ఆయన మనసు నెరిగి ప్రవర్తించి శాంతి చేకూర్చమని అర్థిస్తున్నాను" అన్నది. గొంతు వణకింది.

నిర్మల చాలసేపు మౌనంగా ఉండిపోయింది. కడకు, "అవును, వదినా. చెడు లేనిదే మంచి తెలియదన్నట్టు మాన వులు కొన్ని తప్పులవల్లే సరియైన మార్గాన్నీ, వ్యక్తుల విలువ